# రామాయణము



గ్రంథకర్త్రి: కుమ్మర మొల్ల.




రామా అండ్ కో.,

విద్యావిషయిక ప్రచారకులు,

ఏలూరు.




 [వెల రు. 0—10—0

# పీ ఠి క.

ఈ రామాయణము రచించినది మొల్ల. ఈ యమ కుమ్మరకొలపు రతనము. ఆతుకూరి కేసనశెట్టి కొమరితెనని గద్యయందు వ్రాసికొనియున్నదే కాని భర్తపేరుఁ జెప్పఁబడ లేదు. దీనింబట్టి యీ కవయిత్రి బాలవితంతువై చిన్ననాట నుండి తండ్రియింటనే యుండి గ్రంథరచనా లాలసయై జీవ యాత్ర గడపినట్లు తలంపవలసి వచ్చుచున్నది. నెల్లూరు మండలస్థ గోపవరగ్రామ మీ నారీశిరోమణి నివాసమని యీ పొత్తమందలి కవిస్తుతివల్లనఁ దెలియవచ్చుచున్నది. ఇందు రామాయణకథను మిక్కిలి సంకుచితపరచి వ్రాసియున్నను ముఖ్యమగు పట్టులమాత్రము వదలలేదు. కవిత్వము లలిత పదభూయిష్టమై, ధారాళమై మృదుమధురశైలిని నొప్పు చున్నయది. వ్యాకరణలోపము లందందు గన్పడుచున్నను నీ కవయిత్రీ రచనాపాటవము సాధారణ కవిరచనా సామర్థ్య మున కేమాత్రమును దీసిపోవుటలేదు. ఈ యువతీలలామ క్రీ.శ. ౧౬వ శతాబ్దమందున్నటులఁ గనుపట్టుచున్నయది. స్త్రీ విద్య యత్యావశ్యకమని పెనగులాడు నీవింశతి శతాబ్దమున స్త్రీ లిట్టి చక్కని కయిత రచించు నేర్పులవడుటకుం దగు విద్యాప్రణాళికను విద్యాశాఖవారు పాఠశాలలందు జదువు బాలికలకు నిర్ణయింతురుగాక యని నమ్ముచున్నారము.

—క. కో. రా.



శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## బాలకాండము.

శ్రీమహిమాభిరాముఁడు వసిష్ఠమహామునిపూజితుండు సు
త్రామవధూకళాభరణరక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామలసన్నిభాంగుఁడు మహాగుణశాలి దయాపరుండుశ్రీ
రాముఁడుప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలమున్.

ఉ. శ్రీనగమందిరుం డమరసేవితుఁ డర్ధశశాంకమౌళి స
న్మానిమనఃపయోజదిననాయకుఁ డబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్నుఁ డతిధన్యుఁడు శేషవిభూషణుండు వి
ద్యానిధిమల్లికార్జునుఁడు దానిడుమాకుశుభంబులొప్పఁగన్.

ఉ. తెల్లనిపుండరీకముల తేజము మెచ్చని కన్నుదోయితో
నల్లనిశక్రనీలరుచి నవ్వెడు చక్కని దేహకాంతితో
నల్లనిఁ బిల్లఁగ్రోవి కరమందలిసంజ్ఞల నింపు నింపఁగా
గొల్లతలన్ విరాళి దగఁగొల్పెడు కృష్ణుఁడు ప్రోచుగావుతన్.

ఉ. మించి సమస్తలోకములు మిన్నక తాఁదన నేర్పు మీఱ ని
ర్మించి ప్రగల్భతన్ మెఱసి మేలును గీడును బ్రాణికోట్లు సే
వించ ఘటించి శాస్త్రములు వేదములుం గొనియాడుచుండ నా
కాంచనగర్భుఁడిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్.

సీ. చంద్రఖండకలాపుఁ జారువామనరూపుఁ
గలితచంచలకర్ణుఁ గమలవర్ణు
మోదకోజ్జ్వలబాహు మూషకోత్తమవాహు
భద్రేభవదను సద్భక్తసదను
సన్మునిస్తుతిపాత్రు శైలరాడ్దౌహిత్రు
ననుదినామోదు విద్యాప్రసాదుఁ
బరశువరాభ్యాసుఁ బాశాంకుశోల్లాసు
నురుతరఖ్యాతు నాగోపవీతు

గీ. లోకవందితగుణవంతు నేకదంతు
నతుల హేరంబు సత్కరుణావలంబు
విమలరవికోటితేజు శ్రీవిఘ్నరాజుఁ
బ్రథితవాక్ప్రౌఢికై యెప్డుఁ బ్రస్తుతింతు. 5

చ. కరిముఖుఁడుం గుమారుఁడు వికారపుజేతల ముద్దుసూపుచున్
గురువులువాఱుచున్నగగుట్టలుదాఁటుచుఁ జన్నుదోయితో
శిరములు రాయుచుం గబరిఁ జేర్చినచంద్రునిఁ బట్టితీయఁగాఁ
గరములఁజాఁపన వ్వెదుజగమ్ములతల్లి శుభంబులీయుతన్! 6

ఉ. సామజయుగ్మ మింపలరఁ జల్లనినీరు పసిండికుండలన్
వేమఱు వంచివంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ

దామరపువ్వుగద్దియ ముదంబున నుండెడిలోకమాత మా
కామునితల్లి సంపదనఖండముగా నిడు మాకు నెప్పుడున్ !

ఉ॥ మేలిమిమంచుకొండ నుపమింపఁగఁజాలిన యంచ నెక్కి వా
హ్యాళి నటించివచ్చుచతురాస్యు నెదుర్కొని నవ్వు దేరఁగా
వాలికసోగకన్నుల నివాళి యొనర్చి ముదంబుఁ గూర్చు వి
ద్యాలయవాణి శబ్దములనర్థములన్ సతతంబు మాకిడున్ ! 8

సీ. సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి
నఖిలవేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకారపరిభారవి భారవి
సత్కాంతిహిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్వితవిఖ్యాతి భవభూతిఁ
బ్రకటకావ్యధురీణు భట్టబాణు
మానినీలోకసమ్మదభద్రు శివభద్రుఁ
గవితారసోల్లాసుఁ గాళిదాసు

గీ. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజులవాగ్వృద్ధ్యు నన్న పార్యు
రసికుఁడై నట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీనిమించి. 9

క. తొల్లిటి యిప్పటి సత్కవి
వల్లభులను రసికవినుతవాగ్విభవకళా
మల్లులఁ గవితారచనల
బల్లిదులై నట్టిఘనుల భక్తిగఁ దలఁతున్. 10

క. గురులింగజంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్లయనఁగ వఱలినదానన్. 11

సీ. దేశీయపదములు దెనుఁగులు సాంస్కృతుల్
సంధులు ప్రాజ్ఞుల శబ్దవితతి
శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు
లాయా సమాసంబు లర్థములను
భావార్థములుఁ గావ్యపరిపాకములు రస
భావచమత్కృతుల్ పలుకుసరవి
బహువర్ణములును విభక్తులు ధాతు ల
లంకృతి చ్ఛందోవిలక్షణములుఁ

గీ. గావ్యసంపద క్రియలు విఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ విఖ్యాతగోప
వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత
నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి. 12

క. చెప్పుమని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్. 13

వ॥ అని మఱియు, 14

చ. వలిపపు సన్నపయ్యెదను వాసిగ గందపు బూఁతతోడుతన్
గొలఁదిగఁ గానవచ్చువలిగుబ్బచనుంగవ తీవి నొప్పఁగాఁ
దెలుఁగని చెప్పుచోటఁ గడు తేటలమాటలఁ గొ్త్రరీతులం
బొలుపు వహింపకున్న మరి పొందగునే పటహాదిశబ్దముల్.

క. మును సంస్కృతముం జేటుగఁ
దెనిగించెడుచోట నేమి దెలియక యుఱడన్
దనవిద్య మెఱయఁ గ్రొమ్మెర
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే! 16

గీ. తేనెసోఁక నోరు తీయన యగురీతి
తోడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగచెవిటివారి ముచ్చటగును. 17

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మరి కానుపించు విబుధులమదికిన్. 18

వ. అని మఱియును, 19

క. ఆది రఘురాముచరితము
నాదరముగ విన్నఁ గొ్త్రయై లక్షణసం
పాదమ్మై పుణ్యాస్థితి
వేదమ్మై తోఁచుకొన్న వెట్టినె చెప్పన్. 20

ఉ. రాజితకీర్తియైన రఘురాముచరిత్రము మున్ గవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పిరని తెల్సియుఁ గ్రమ్మరఁజెప్ప నేలనన్
భూజనకల్పకం బగుచు భుక్తికి ముక్తికి మూల మైనయా
రాజును దైవమైన రఘురామునుతించినఁ దప్పు గల్గునే! 21

క. వారాంగన శ్రీరాముని
పేరిడి రాచిలుకఁబిలిచి పెంపు వహించెన్
నేరుపు గలచందంబున
నారాముని వినుతిసేయ హర్షము రాదే! 22

క. నేరిచి పొగడినవారిని
నేరక కొనియాడువారి నిజకృపమనుపం
గారణ మగుటకు భక్తియె
కారణ మగుఁగాని, చదువు కారణమగునే! 23

ఉ. సల్లలిత ప్రతాపగుణ సాగరుడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామనరపాలకునిన్ స్తుతిసేయ జిహ్వకున్
జిల్లరరాజలోకమును జేకొనిమెచ్చఁగ నిచ్చపుట్టునే !
నల్లము బెల్లముం దినుచు నప్పటికప్పటి కాససేయునే! 24

వ. అని వితర్కించి ముదంబున నిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రుస్తుతియునుం జేసి నాచేయంబూనిన మొల్ల రామాయణమునకుఁ గథావిధానం బెట్టు లనిన,

సీ. సరయూనదీతీరసతతసన్మంగళ
ప్రాభవోన్నతమహావైభవమ్ము

కనకగోపురహర్మ్యఘనకవాటోజ్జ్వల
ప్రాకారగోపురశ్రీకరమ్ము
గజవాజిరథభటగణికాతపత్రచా
మరకేతుతోరణమండితమ్ము
ధరణీవధూటికాభరణవిభ్రమరేఖ
దరిసించుమాణిక్యదర్పణమ్ము

గీ. భానుకులదీపరాజన్యపట్టభద్ర
భాసినవరత్నఖచితసింహాసనమ్ము
నాఁగ నుతికెక్కు మహిమ ననారతమ్ము
ధర్మనిలయమ్ము మహి నయోధ్యాపురమ్ము. 26

సీ. మదనాగయూథసమగ్రదేశముగాని
కుటిలవర్తనశేషకులము గాదు
ఆహవోర్వీజయహారినివాసముగాని
కీశసముత్కరాంకితము గాదు
సుందరస్యందనమందిరం బగుఁగాని
సంతతమంజులాశ్రయము గాదు
మోహనగణికాసమూహగేయము గాని
యూథికానికరసంయుతము గాదు

గీ. సరస సత్పుణ్యజననివాసమ్ముగాని
కఠిననిర్దయదైత్యసంఘమ్ము గాదు
కాదు కాదని కొనియాడఁ గల్గినట్టి
పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము. 27

సీ. భూరివిద్యాప్రౌఢి శారదాపీఠమై
గణుతింప సత్యలోకమ్ము వోలె
మహనీయగుణసర్వమంగళావాసమై
పొగ డొందు కైలాసనగమువోలె
లలితసంపచ్ఛాలిలక్ష్మీనివాసమై
యురవైన వైకుంఠ పురమువోలె
విరచితప్రఖ్యాతహరిచందనాఢ్యమై
యారూఢి నమరాలయమ్మువోలె
గీ. రాజరాజనివాస మై తేజరిల్లి
నరవరోత్తరదిగ్భాగనగరివోలె
సకలజనములు గొనియాడ జగములందు
బొలుపు మీఱెను సాకేతపురవరమ్ము. 28

క. ఇమ్ముల నప్పురవప్రము
కొమ్ములపై నుండి పురముకొమ్మలు వేడ్కన్
దమ్ముల చుట్టము పదజల
జమ్ములు పూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. 29

క. పరువున మురువై యుండును
సౌరపురమున గల్పతరులు చూపఱ కింపై
పరువున మురువై యుండును
దురగంబు లమోఘగతుల ప్రతోళికలందున్. 30

క. దానగుణమ్మున సురపురి
నేనాఁడును నగరరత్న మెన్నిక కెక్కన్

దానగుణంబున మిక్కిలి
యేనుఁగు లాపురములోన నెన్నిక కెక్కున్. 31

క॥ కవిగురుబుధమిత్త్రాదులు
వివిధార్చనల నమరపురి వెలయుదు రెలమిన్
గవిగురుబుధమిత్త్రాదులు
వివిధార్చనల నమరఁ బురి వెలయుదు రెపుడున్. 32

క॥ భోగాను రాగసంపద
భోగులు వర్తింతు రందు భూనుతలీలన్
భోగాను రాగసంపద
భోగులు వర్తింతు రందు భూనుతలీలన్. 33

సీ॥ ప్రకటానురాగసంపన్ను లౌదురుగాని
రమణీయరుక్మకారకులుగారు
శుభపవిత్రోజ్జ్వలసూత్రధారులుగాని
టక్కరహాస్యనాటకులు గారు
ఉభయసంధ్యాదివిధ్యుక్తకర్ములుగాని
చర్చింపఁగా నిశాచరులు గారు
తిలకించిచూడ సద్ద్విజులౌదురే కాని
తలపంగఁ బక్షిజాతములు గారు

గీ. బాడబులు గాని యగ్నిరూపములు గారు
పండితులుగాని విజ్ఞులపగిదిఁ గారు
ధీవరులుగాని జాతినిందితులు గారు
పరమపావను లాపురిధరణిసురులు. 34

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారులందఱున్. 35

సీ. తగ దానవిఖ్యాతి ధరఁ గుబేరులుగాని
సతతాంగకుష్ఠపీడితులు గారు
నిర్మలసత్కీర్తి ధర్మసూనులుగాని
చర్చింప ననృతభాషకులు గారు
ప్రకటవిభూతిసౌభాగ్యరుద్రులుగాని
వసుధపై రోషమానసులు గారు
కమనీయగాంభీర్య ఘనసముద్రులుగాని
యతులితభంగసంగతులు గారు

గీ. వర్తకులుగాని పక్షు లేవరుసఁ గారు
భోగులే కాని పాములెప్పుడును గారు
సరసులే కాని కొలఁకులజాడ గారు
వన్నెకెక్కిన యప్పురివైశ్యులెల్ల. 36

క. పంటల భాగ్యోదయులై
పంటలపైఁ బంటలమర బ్రతుకుదు రెపుడున్
బంటలుఁ బాఁడియుఁ గలయా
పంటలు మొదలైన కాఁపుఁబ్రజ లానగరిన్. 37

సీ. కలికిచూపులచేతఁ గరఁగింప నేర్తురు
బ్రహ్మచారుల నైన భ్రాంతిగొలిపి

మృదువచోరచనల నదలింపనేర్తురు
ఘనమునీంద్రుల నైనఁగచ్ఛడములు
వలపులుపైఁజల్లివలపింపనేర్తురు
సన్న్యాసులను నైనఁ జలముపట్టి
సురతబంధమ్ములఁ జొక్కింపనేర్తురు
వ్రతములు గైకొన్న యతులనైన
గీ. అచల మెక్కింప నేరుతు రౌషధముల
మరులు గొలుపంగ నేర్తురు మంత్రములను
ధనము లంకింప నేర్తురు తక్కునేసి
వాసికెక్కిన యప్పురివారసతులు. 38

సీ. శారద గాయత్రి శాండిల్య గాలవ
కపిలకౌశి కులఖ్యాతి గలిగి
మదన విష్వక్సేన మాధవ నారద
శుక వైజయంతి కార్జునులు గలిగి
చంద్రార్కగుహగిరిసంభవజయవృష
కుంభబాణాదులఁ గొమరుమిగిలి
సుమన యైరావత సురభి శకామృత
పారిజాతముల సొంపారఁ గలిగి
గీ. బ్రహ్మనిలయమ్ము వైకుంఠపట్టణమ్ము
నాగకంకణుశైలమ్ము నాకపురము
లలితగతిఁబోలి యేవేళఁ జెలువుదూఁగి
ఘనతనొప్పారు నప్పురివనము లెల్ల. 39

చ. కనకవిలాసకుంభములు గబ్బికుచంబులలీలఁ జిత్రకే
తనములు పైటకొంగులవిధంబున గ్రాలఁగవాక్షముల్రహిన్
గనుఁగవయట్లుపొల్పెసఁగఁగా భువి భోగులు మెచ్చ భోగినీ
జనములరీతిఁ జెల్వమరు సౌధనికాయము పాయకప్పురిన్.

తే. మకర కచ్ఛప శంఖ పద్మములు గలిగి
ధనదునగరమ్ముపైఁ గాలు ద్రొవ్వుచుండు
సరసమాధుర్య గాంభీర్య సరణిఁ జేర్చి
గుఱుతు మీఱిన యప్పురికొలఁకు లెల్ల. 41

తే. అమృతధారాప్రవాహమ్మునందు నెపుడు
నొక్కధేనువు దివినున్న నుచితమగునె!
అమృతధారాప్రవాహమ్మునందు నెపుడు
బెక్కుధేనువు లప్పురిఁ బేరునొందు. 42

క. ఈకరణి సకలవిభవ
శ్రీకరమై తాఁ బ్రసిద్ధిఁ జెలఁగుచు మహిమన్
నాకపురికోడ నొఱయుచు
సాకేతపురమ్ము వెలయు జగమునుతింపన్. 43

వ. అట్టి మహాపట్టణంబున కధీశ్వరుం డెట్టివాఁడనఁగ, 44

సీ. తనకీర్తి కర్పూరతతిచేత వాసించెఁ
జటుతరబ్రహ్మాండభాండ మెల్లఁ
దనశౌర్యదీప్తిచే నిజబలజమనయంబుఁ
బగలెల్ల మాఁగుడువడఁగఁ జేసె

దనదానవిఖ్యాతి సనుదినంబును సర్థి
దారిద్ర్యములు వెళ్ళఁ బాఱఁ దరిమెఁ
దననీతిమహిమచే జనలోకమంతయుఁ
దగిలి సంతతమును బొగడఁ దనరె

గీ. భళిర! కొనియాడఁ బాత్రమై పరఁగినట్టి
వైరనృపజాలమేఘసమీరణుండు
దినకరాన్వయపాథోధి వనజవైరి
నిశితకౌక్షేయకకరుండు దశరథుండు. 45

సీ. పాలింప దవినీతిపరుల మన్ననఁ జేసి
పాలించు సజ్జనపఙ్త్రితతి నెప్పుడు
మనుపఁడెన్నఁడు జోరులను గారవముఁజేసి
మనుచు నాశ్రితకోటి ఘనము గాఁగ
వెఱ పెఱుంగఁడు వైరివీరులఁ బొడగన్న
వెఱచు బొంకేమొక దొరలునో యని
తలఁకఁ డర్థివ్రాతములు మీఱి పైకొన్నఁ
దలఁకు ధర్మంబెందుఁ దప్పునో యని

గీ. సరవిఁ బోషింపఁ డరిగణషట్క మెప్పుడు
వెలయఁ బోషించు నిత్యమ్ము విప్రవరుల
భాస్కరాన్వయతేజోవిభాసితుండు
మానధుర్యుండు దశరథక్ష్మావరుండు. 46

సీ. కనఁగొరఁ డొకనాఁడుఁ గన్నులఁ బరవధూ
లావణ్యసౌభాగ్యలక్షణములు

వినఁ గోరఁ డొకనాఁడు వీనులకింపుగాఁ
　　గొలుచువారలమీఁది కొండెములను
చిత్తంబు వెడలించి జిహ్వాగ్రమునఁ గోరి
　　పలుకఁడు కాఠిన్యభాషణములు
తలఁపఁ డించుకయైన ధనకాంక్ష నేనాఁడు
　　బంధుమిత్రాశ్రిత ప్రతతిఁ జెరుప

గీ. సతతగాంభీర్యధైర్యభూషణవరుండు
వార్తకెక్కిన రాజ్యానువర్తనుండు
సకలభూపాలజనసభాసన్నుతుండు
ధర్మతాత్పర్యనిరతుండు దశరథుండు. 47

సీ. విరహాతిశయమున వృద్ధిఁ బొందఁగలేక
　　విషధరుండును గోర విషముఁ బూనె
తాపంబు క్రొవ్వించి తరియింప నోపక
　　పలుమాఱుఁ గడగండ్లఁ బడియెఁ గరులు
కందర్పశరవృష్టి నందనోపక ఘృష్టి
　　వనవాసమునఁ గ్రుస్సి వనరుసూపె
దీపించి వల పాప నోపకఁ గూర్మంబు
　　కుక్షిలోపల దలఁ గ్రుక్కికొనియె

గీ. కుంభినీకాంత తమమీఁది కూర్మి విడిచి
ప్రకటరాజన్యమస్తకాభరణమకుట
చారుమాణిక్యదీపితచరణుఁ డైన
దశరథాధీశుభుజపీఠిఁ దగిలినంత.

క. ఆరాజురాజ్యమందలి
వారెల్లను నిరతధర్మవర్తను లగుచున్
భూరిశ్రీవిభవంబుల
దారిద్ర్యం బెఱుఁగ రెట్టితటి నేనాఁడున్. 49

వ. ఇట్టిమహాధైర్యసంపన్నుండును మహైశ్వర్యధుర్యుండుననగు దశరథమహారాజు సకలసామంతరాజలోక పూజ్యమానుం డగుచుఁ బ్రాజ్యంబగురాజ్యంబు నేలుచు నొక్కనాఁడు. 50

సీ. సంతానలబ్ధికై చింతించి చింతించి
శిష్టవర్తనుఁడౌ వసిష్ఠుఁ జూచి
తనకోర్కి వినుపింప విని మునిసింహుండు
పలికె బుశ్యశృంగు నెలమిఁ దేర
ఘనుఁడాతఁడాగిఁ బుత్త్రకామేష్టి యనుపేర
యాగమ్ముఁ గావింప నందువలన
వినుతి కెక్కఁగఁజాలు తనయులు గలుగుట
సిద్ధమ్ము నామాట బుద్ధిలోన
గీ. నిలుపుమనిచెప్ప నారాజు నెమ్మితోడ
నకుటిలాత్మకు నావిభాండకునితనయు
నెలమిరావించి పుత్త్రకామేష్టియనెడి
జన్న మొనరించుచున్నట్టి సమయముననుం. 51

ఉ. రావణుచేతిబాధల నిరంతరమున్ బడి వేఁగిమూఁకలై
దేవతలెల్ల గీష్పతికిఁ దెల్లముగా నెఱిఁగింప వారి రా

జీవతనూజుఁడున్నెడకు శీఘ్రమె తోడ్కొనిపోయి చెప్ప నా
దేవుఁడు విష్ణుసన్నిధికి దిగ్గనఁ జేకొనిపోయి యచ్చటన్. 52

వ. అప్పురాణపురుషోత్తముం గాంచి నమస్కరించి యింద్రాది దేవతలం జూపి బ్రహ్మయిట్లని విన్నవించె. 53

ఉ. రావణుఁడుగ్రుఁడై తనపరాక్రమశక్తిని పేరిసంపదల్
రావిరఁగొల్లలాడి త్రిదివంబును బాడుగఁజేయ నేఁడు దే
వావళి దీనభావమున వక్కడనుండఁగ నోడి భీతిచే
దేవరఁ గానవచ్చె నిఁక దేవరచిత్తము పేరిభాగ్యమున్. 54

వ. అని విన్నవించిన విని వనరుహాలోచనుండు దయాయత్తచిత్తుండై యనిమిషనాయకునింగూర్చి యిట్లానతిచ్చె. 55

గీ. వనజగర్భునిఁగూర్చి రావణుఁడు మున్ను
తపము చేసిన వరమిచ్చెఁ తటిని దనకు
నేరిచేఁ జావులేకుండఁ గోరునాఁడు
నరులవానరులను జెప్పమఱచినాఁడు. 56

వ॥ అక్కారణంబునం జేసి, 57

గీ. నరుగలిగెను మనకు రావణునిఁ జంప
వినుఁడు మీరెల్ల నామాట వేడ్కమీఱ
దశరథుండను రాజు సంతానకాంక్ష
నొనర జన్నంబు గావించుచున్నవాఁడు. 58

క॥ ధరణీపతి యగుదశరథ
నరనాయకునింటఁ బుట్టి నరరూపమునన్

చెఱఁగెద నే నీక మీరును
సురకంటకుమీఁద లావు చూపుటకొఱకై. 59

క. కొందఱు కపివంశంబునఁ
గొందఱు భల్లూకకులమున గురుబలయుతులై
యందఱు నన్ని తెఱంగుల
బృందారకులార! పుట్టి పెరుఁగుఁడు భువిపై. 60

వ. అని కృపాధురీణుండైన నారాయణుఁడానతిచ్చిన వినివనజాస
నాదిదేవతానికరం బవ్వనజోదరుని పాదారవిందమ్ములకు
వందనములాచరించినిజనివాసమ్ములకుం జనిరయ్యవసరమ్మున.

మ. ఇల సాకేతనృపాలశేఖరుఁడు దా హేలావిలాసంబుతో
పలకాంక్షన్ సవనంబు సేసినయెడన్ బంగారుపాత్రమ్ములో
పల దుగ్ధాన్నము చాల నించుకొని తాఁ బ్రత్యక్షమై నిల్చిని
ర్మల తేజంబునఁ బావకుండనియెఁ బ్రేమన్ మంజువాక్యంబులన్.

క. భూపాల! నీదుభార్యల
కీపాయస మారగింప నిమ్మా తనయుల్
శ్రీపతిపుత్రసమానులు
రూపసు లుదయింతు రమితరూపస్ఫూర్తిన్. 63

వ. అని చెప్పి యప్పాయసపాత్రంబు చేతికిచ్చిన. 64

గీ. పాయసమ్ము రెండుభాగముల్ గావించి
యగ్రసతుల కీయ నందులోన
సగము సగము దీసి సుగుణ సుమిత్రకు
నొసఁగి రంత వారె మెసవెఁ బ్రీతి. 65

వ. అంతం గొన్నిదినంబులకుఁ గౌసల్యాకైకేయీ సుమిత్రలు గర్భవతులై యొప్పారుచుండ. 66

సీ. ధవళాక్షు లనుమాట తథ్యంబు గావింపఁ
దెలు పెక్కె కన్నులు తేటలయ్యె
నీలకుంతల లని నెగడినయామాట
నిలుపంగ నెఱులపై నలుపు సూపె
గురుకుచ లనుమాట సరపి భాషింపంగఁ
దోరమై కుచముల నీరుపట్టె
మంజుభాషిణు లనుమాట దప్పక యుండ
మెలఁతలపలుకులు మృదువులయ్యె
గీ. గావినను లటంట నిక్కమై కాంతలందు
మీఱి మేలైనరుచులపైఁ గోరికయ్యె
సవతిపోరనఁ దమలోన సారె సారె
కోకిలింతలు జెట్టుచిట్టుములుఁ బుట్టె. 67

వ. మఱియును, 68

సీ. తనుమధ్య లనుమాటఁ దప్పింపఁ గాఁబోలు
బొఱలేక నడుములు పొదలఁ జొచ్చె
గుచములు బంగారుకుండలో యనుమాట
కల్లగా నగ్రముల్ నల్లనయ్యెఁ
జంద్రాస్యలనుమాట సరవి మాన్పఁగఁ బోలు
గళలవిలాసమ్ము పలుచ నయ్యె

సుందరు లనుమాట సందియమ్మగఁ బోలు
గర్భభారమ్ములఁ గాంతి దప్పె

గీ. ననుచుఁ గనుఁగొన్నవారెల్ల నాడుచుండఁ
గట్టుచీరెల ప్రేఁకంబు పుట్టుచుండ
నాసతులఁ జూచి యందఱు నలరుచుండఁ
గాంతలకు నవ్వు గర్భముల్ గానుపించె. 69

వ. ఇట్లు దుర్భరంబులైన గర్భంబులు దాల్చిన కౌస ల్యాది కాంతాత్రియమ్మను చైత్రమాసమ్మున శుక్లపక్షమ్మున నవమీ భానువాసరమ్మునఁ బునర్వసు నక్షత్రంబున కర్కాటక లగ్నంబున శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులం గాంచినం దదనంతరంబున దశరథుండు యథోచిత కర్తవ్యంబులు జరపి యప్పుదిదినంబులు నరిష్టంబు లేక ప్రతిదిన ప్రవర్ధమాను లగు చున్న కుమారచతుష్టయంబునకుఁ గాలోచితంబులగు చౌలో పనయనాది కృత్యంబులు గావించి వెండియు విద్యాప్రవీణులగు నట్టు లొనర్చి గజాశ్వరథారోహణంబులు నేర్పి ధనుర్వేదపార గులం గావించి పెంచుచున్న సమయమ్మున, 70

సీ. ఒకనాఁడు శుభగోష్ఠి నుర్వీశ్వరుఁడు మంత్రి
హితపురోహితులును నెలమిఁజేరి
బంధువర్గము రాయబారులుఁ జారులుఁ
బరిచారకులు నెల్ల సరవిఁ జేరి
గాయకులును భృత్యగణములు మిత్రులు
సతులును సుతులును జక్కనలరి

సరసులుఁ జతురులుఁ బరిహాసకులుఁ గళా
వంతులు గడు నొక్కవంకఁ జేరి

గీ. కొలువఁ గొలువున్న యెడ వచ్చి కుశికపుత్త్రుఁ
డర్థి దీవించి తా వచ్చినట్టికార్య
మధిపునకుఁ జెప్ప మదిలోనఁ నాత్రపడుచు
వినయ మొప్పార నిట్లని విన్నవించె. 71

క. రాముఁడు దనుజులతోఁ సం
గ్రామము సేయంగఁ గలఁడె కందు గదా వే
నే మిమ్ము గొలిచి వచ్చెద
నో మునిరాజేంద్ర! యరుగు ముచితప్రౌఢిన్. 72

మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి విను మయ్యా! రాజ! నీచేతఁగా
దన రాదైనను రాక్షసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
ఘనుఁడీ రాముఁడు దక్క వారిఁ గెలువంగా రాదె పిన్నంచు నీ
వనుమానింపక పంపుమింకఁ గ్రతురక్షార్థంబు భూనాయకా!

వ. అని ప్రియోక్తులు వలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకులపవిత్రుండైన దశరథుండు మారాడ నోడి యప్పుడు.

క. మునినాథువెంట సుతా్రి
ముని సలజడి పెట్టుచున్న మూర్ఖులపై రా
ముని సౌమిత్రిని వెన న
మ్మునితో సానందవార్ధి మునుఁగుచుఁ బనిచెన్. 75

## మత్తకోకిలము.

వారిఁ దోడ్కొని కౌశికుం డట వచ్చునయ్యెడ ఘోరకాం
తారమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా
కార మొప్పఁగ నట్టహాసవికాస మేర్పడ రాఁగ నా
క్రూరరాక్షసిఁ జూచి యమ్మునికుంజరుం డొగి రామునిన్.

క. తాటక వచ్చిన దదిగో
నాటగ నాఁడుదని మేల మాడక నీ వీ
పాటి పడ నేయు మని తన
చాటున భయపడెడి రామచంద్రున కనియెన్. 77

వ. ఇట్లు చెప్పిన యా మునిచంద్రునిపల్కు లాలించి
రామచంద్రుండు తన యంతరంగమ్మున నిట్లని వితర్కించె. 78

క. ఈయాఁడుదానిఁ జంపఁగ
నాయమ్మున కేమిగొప్ప! నగరే వీరుల్ !
ఛీ యని రోయుచు నమ్ముని
నాయకుభయ మొఱఁగి తనమనమ్మున నలుకన్. 79

క. వ్రేటు గొని రామచంద్రుఁడు
సూటిగ నొకదిట్టకోల సురలు నుతింపన్
ఘోటకసమ వక్షస్థలఁ
దాటక నత్యుగ్రలీల ధరపైఁ గూల్చెన్. 80

వ. ఇట్లు తాటకం గీటణంచినయంత నమ్మునీంద్రుండు
మేటిసంతోషమ్మున రామునిం గొనియాడుచు నక్రమంబుగ

నిజాశ్రమంబున కేతెంచి రామసౌమిత్రుల సాయంబున
జన్నంబు సేయుచున్న సమయంబున. 81

క. ఆకాశవీధి నెలకొని
రాకాసులు గురిసి రమిలెరక్తముఁ బలలం
బా కౌశికుయజ్ఞముపై
భీకరముగ మునిగణంబు భీతిం బొందన్. 82

ఉ. అంబరవీధి నిల్చి త్రిదశాంతకు లెంతయు నేచి రక్తమాం
సంబులు గాధినందనునిజన్నముపైఁ గురియంగనంతలో
నంబరరత్నవంశకలశాంబుధిచంద్రుఁడు రామచంద్రుఁ డు
గ్రంబుగ ద్రుంచె జండబలగర్వులదమ్ముఁడు దానునొక్కఁడై.

వ. ఇట్లు రామచంద్రుండు సాంద్రప్రతాపంబు మించ
నిందాద్రిదులఁ ద్రుంచిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా
జన్నంబొనర్చి రామసౌమిత్రులం బూజించె నట్టిసమయమ్మున.

క. ధరణీసుత యగుసీతకుఁ
బరిణయ మొనరింప జనకపార్థివుఁ డిల భూ
వరసుతుల రండని స్వయం
వర మొగిఁ జాటించె నెల్లవారలు వినఁగన్. 85

వ. ఇట్లు స్వయంవరమహోత్సవ ఘోషంబున సంతో
షమ్ము నొంది విశ్వామిత్రుండు రామసౌమిత్రుల మిథిలా
నగరంబునకు దోడ్కొని చనుచుండు మార్గంబున. 86

క. ముద తాపసి వెనువెంటను
వదలక చనుదెంచునట్టి వడి రాముని శ్రీ
పదరజము సోఁకి చిత్రం
బొదవఁగఁ గనుపట్టె నెదుట నొకయుపల మటన్. 87

క. పదనై యొప్పిదమై కదుఁ
గదలుచు బంగారుప్రాదె కరఁగినరీతిన్
బొదలుచు లావణ్యస్థితి
సుదతిగ జూపట్టె నిలిచె సురుచిరలీలన్. 88

ఉ. ఆమునివల్లభుండు గౌనియాడుచుఁ బాడుచు వేడ్కతోడ శ్రీ
రాముని జూచి యిట్లనియె రామ! భవత్పదధూళిసోఁకి యీ
భామిని తాయిమున్ను కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగువారలకు నమ్మఁగవచ్చును భుక్తిముక్తులున్.

వ॥ అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతయు సంతసమ్మున నమ్మునిజేంద్రనందనుల కెఱిఁగింపుచు మిథిలానగరంబునకుం జనియె నచ్చట. 90

సీ॥ ద్రవిడకర్ణాటాంధ్రయవనమహారాష్ట్ర
రాజకుమారులు తేజమలరఁ
బాండ్యఘూర్జరలాటబర్బరమళయాళ
భూపనందనులు విస్ఫూర్తిమీఱ
గౌళకేరళసింధుకాశకోసలసాళ్వ
ధరణీశపుత్త్రిలు సిరి వెలుఁగ

మగధమత్స్యకళింగమాళవనేపాళ
నృపతనూభవులు నెన్నికకు నెక్క
గీ. మరియు నుత్కలకొంకణమద్రపాండ్ర
వత్సగాంధారసౌరాష్ట్రవంగచోళ
రాజ్యముల నొప్పు చప్పన్న రాజసుతులు
వచ్చి రక్కుమారీస్వయంవరమునకును. 91

ఉ. కొందఱు పల్లకీల మఱికొందఱు తేరుల నందలంబులన్
కొందఱుకొందఱశ్వములఁగొందఱుమత్తగజేంద్రసంఘమున్
కొందఱు స్వర్ణడోలికలఁ గోరికె నెక్కి నృపాలనందనుల్
సందడిగాఁగ వచ్చిరి బిజంబిజ బిజంబిజను ద్రొబ్బులాడఁగన్.

వ. అట్టి సమయంబున, 93

చ॥ గురుభుజశక్తి గల్గుపదికోట్లజనంబులఁ బంప వారు నా
హరునిశరాసనంబుఁ గొనియాడుచు బాడుచుఁ గొంచువచ్చి సు
స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన దానికి ధూపదీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పఁగన్.

వ. అట్టి సమయంబున జనకభూపాలుండు రాజకుమా
రులం గనుఁగొని యిట్లనియె. 95

ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుండిదె పూర్వమారికై
యుంకువ నేసినాఁడ వివిధోజ్జ్వల మైనధనంబుఁ గాన నీ
శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుం డగువాని కిత్తు నీ
పంకజనేత్ర సీత నరపాలకులార! నిజంబు సెప్పితిన్. 96

గీ. అనుచుఁ బలుకుచున్న యువనీశతిలకుని
వాక్యములకు నుబ్బి వసుమతీశ
సుతులు దాము తామె మతిలోనఁ జెలఁగుచు
దగ్గఱంగఁ బోయి ధనువుఁ జూచి. 97

క. విల్లా యిది కొండా యని
తల్లడపడి సంశయంబు తలకొన మదిలో
బల్లిదులగు నృపనందను
లెల్లరు దాదవుల నుండి రెంతయు భీతిన్. 98

క. కొందఱు డగ్గర నోడిరి
కొందఱు సాహసము చేసి కోదండముతో
నందంద పెనఁగి పాఱిరి
సందుల గొందులను దూరి సత్వము లేమిన్. 99

సీ. గాలిఁ దూలినరీతిగా నెత్తఁ జాలక
తముఁ దామె సిగ్గునఁ దలలు వంచి
కౌఁగిలించిన లోను గాక వెగ్గల మైన
భీతిచే మిక్కిలి బీరువోయి
కరముల నందంద పొరలించి చూచిన
గదలక యున్నఁ జీకాకుపడుచుఁ
బాషాణ మున్నట్టిపగిది మార్దవ మేమి
కాన రాకుండినఁ గళవళించి

గీ. రాజసూనులు కొందఱు తేజ ముడిగి
జగతిరాజుల మోసపుచ్చంగఁ దలఁచి
జనకుఁ డీమాయఁ గావించె జాలు ననుచు
దలఁగి పోయిరి దవ్వుగా ధనువు విడిచి. 100

సీ. ఇది పర్వతాకార మీవిల్లు కను విచ్చి
తేరి చూడఁగ రాదు దేవతలకు
నటు గాక మును శేషకటకునిధను వంట
హరుఁడె కావలెఁ గాక హరియుఁ గాక
తక్కినవారికిఁ దరమె యీకోదండ
మెత్తంగఁ దగుచేవ యెట్లు గలుగు?
దీనిడగ్గర నేల దీని కోడఁగ నేల
పరులచే నవ్వులు పడఁగ నేల

గీ. గురుతు సేసియుఁ దమలావుఁ గొలఁదిఁ దామె
తెలియవలెఁ గాక యూరక తివుర నేల
యొరుల సొమ్ములు తమకేల నోఱకుననుచుఁ
దలఁగి పోయిరి రాజనందనులు గనుచు. 101

వ॥ అంత విశ్వామిత్రమునీంద్రుండు రామచంద్రుని
ముఖావలోకనంబుఁ జేసిన, 102

చ. కదలకుమీ ధరాతలమ, కాశ్యపిఁ బట్టు ఫణీంద్ర, భూవిషా
స్పదులను బట్టు కూర్మమ, రసాతలభోగిఢులీకులీశులన్

వదలక పట్టు ఘృష్టి ధరణీఫణికచ్ఛపపోత్రివర్గముల్
బొదవుచుఁబట్టుఁడీకరులు భూవరుఁడీశుని చాపమెక్కిడున్.

క. ఉర్వీనందనకై రా
మోర్వీపతి యెత్తు నిప్పు డుగ్రునిశాపం
బుర్విం బట్టుఁడు దిగ్గం
త్యుర్వీధరకిటిఫణీంద్రు లూఁతఁగ గడిమిన్. 104

వ. అనుచు లక్ష్మణుండు దెలుపుచున్న సమయంబున.

మ. ఇనవంశోద్భవుఁడైన రాఘవుఁడుభూమీశాత్మజుల్ వేడ్కతోఁ
డను వీక్షింప మునీశ్వరుం డలరఁ గోదండంబు చేనంది చి
వ్వన మోపెట్టి గుణంబు పట్టి పటుబాహాశక్తితోఁ దీసినన్
దునిఁగెన్ జాపము భూరిఘోషమున వార్ధుల్ మ్రోయు
చందంబునన్. 106

గీ. ధనువు దునిమినంత ధరణీశసూనులు
శిరములెల్ల వంచి సిగ్గు పడిరి:
సీత మేను బెంచె; శ్రీరామచంద్రునిఁ
బొగడెనపుడు జనకభూవిభుండు. 107

వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వసంపదకు మెచ్చి,
సంతోషించి జనకమహారాజు వివాహంబు సేయువాఁడైరమ్మని
దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంచిన దశరథ
మహారాజును నాశుభలేఖలం జదివించి సంతోషంబున నానంద
బాష్పంబులు గ్రమ్మ దేర మంత్రిప్రవరుం డగు సుమంత్రు

నింబిలిపించి సుమంత్రా! యిప్పుడు మనమందఱమును బయలు దేరి మిథిలాపట్టణంబునకుం బోయి యట జనకమహారాజునింట మన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు వివాహమహోత్సవము జరుపవలయుం గావున వసిష్ఠాది ద్విజవర్యులను గౌసల్యాది కాంతాజనమ్మును నరుంధతి మొదలుగాఁ గల భూసురభార్యలను మరియు సకల బంధుజనంబును రావించి బంగరు ఉరదంబుల నిడికొని తోడ్కొని రమ్మని యంపిన నతండును మహాప్రసాదం బని తత్క్షణమ యంతఃపురంబునకుం బోయి కౌసల్యా కైకె సుమిత్ర మొదలగు రాజకాంతలను వసిష్ఠాది ద్విజవరిష్ఠులను నరుంధతి మొదలుగాఁ గలము త్తైదువలను మిగిలన సకలబంధుజనమ్మును రావించి యుక్తప్రకారమ్ముగాఁ గనకరథమ్ములపై నిడికొని దశరథమహారాజు కడకుం గొనివచ్చిన యంత దశరథుండు పుత్రద్వయసహితమ్ముగ రథ మారోహించి సమస్త సేనా సమన్వితుం డగుచు వాద్యఘోషంబులు దశదిశలునిండనడచుచున్న సమయమ్మున నంతకుముందు జనకభూవల్లభుండు దశరథ మహీపాలు నెదుర్కొని తోడి తెచ్చి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాది విధుల విధ్యుక్తంబుగాఁ బూజించి మానితంబుగఁ గానుకలొసంగి సకలసంపత్సంపూర్ణమయిన నివేశముంగల్పించి యుంచు పెండ్లివారిని విడియించె నంత నక్కడఁ గనకవికారమైన పీఠమ్ముపై గూర్చున్న సమయంబున దేవా! శుభముహూర్తం

బాసన్న మగుచున్నది, రమ్మని వసిష్ఠుండు సనుదేర నాతడుసని రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు మంగళస్నానమ్ము జేయించి నిర్మలాంబరాభరణంబు లొసంగి వేద్వేర నొక్క ముహూర్తమ్మునఁ దనకూతుఁ సీతను శ్రీరామచంద్రునకును, దనతమ్ముఁడు కుశధ్వజునికూతు లగు మాండవ్యూర్మిళా శ్రుతకీర్తులను భరత లక్ష్మణశత్రుఘ్నులకును నిచ్చి వివాహముఁజేసి తన ప్రియ తనయం కొక్కొక తెగు నూఱేసి భద్రగజమ్ములను వేయేసి తురగంబులను బదివేలు దాసీజనమ్మును లక్ష ధేనువులను నరణంబు లిచ్చి దశరథాది రాజలోకమ్మునకు బహుమానమ్ముగా నవరత్న ఖచితభూషణమ్ములును జీని చినాంబరమ్ములును నొసంగి సుగంధద్రవ్యమ్ముల నర్పించి పూజించి యంపె నంత దశరథమహారాజు మరలి యయోధ్యాపట్టణంబునకు వచ్చుచుండగా మధ్యమార్గంబున. 108

గీ. పరశురాముఁ డడ్డుపడి వచ్చి మీరామ
మెవ్వ రనిన మొలకనవ్వుతోడ,
నేను దశరథుండ నితఁడు నాపుత్రుఁడు
రాముఁడండ్రు పేరు భీమబలుఁడు. 109

వ. అని వినుపించిన క్రోధావేశ వశంవదుండై యప్పుడప్పరశురాముండు రాముం గనుంగొని యిట్లనియె. 110

క. రాముఁడ నేనై యుండఁగ
నామీఁద నొకండు గలిగెనా మరి యోఁగా

కేమాయె ధణ మొనర్పఁగ
రామా! రారమ్మటంచు రహిఁ బిలిచెఁ దగన్. 111

వ. పిలిచినతోడనే రామచంద్రుం డతని కిట్లనియె 112

గీ. బ్రాహ్మణుండ వందుఁ బరమపవిత్రుండ
వదియుఁగాక భార్గవాన్వయుండ
వైన నిన్నుఁ దొడరి మహావస్థలమున
జగడమాడ నాకుఁ దగునె చెప్పుమ! 113

వ. అనిన విని పరశురాముం డిట్లనియె. 114

ఉ. శస్త్రము దాల్చినందగునె సన్నుతికెక్కిన బ్రాహ్మణుండనన్
శాస్త్రము గాదు నాకెదిరి సంగరభూమిని నిల్చినంతనే
శస్త్రముఖంబులన్ నృపుల జక్కఁగ జేయుదుగాన నిప్పుడున్
శస్త్రముశాస్త్రముంగలవు సాహసవృత్తినిరమ్ము పోరఁగన్.

వ. అనిన రామచంద్రుఁ డిట్లనియె. 116

మ. విను మావంటినృపాలురైన గలనన్ వీరత్వముం జూపఁగా
వనయోగాక మహానుభావుడవు నిన్నాలంబులో మీఱగా
నెనయన్ ధర్మమెమాకుజూడ మఱినీవేమన్న నీమాటకుం
గనలన్ మంచిదికాదు మాకెపుడుదోర్గర్వంబుమీఁపట్టునన్.

వ. అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముం
డారఘురామునితో నిట్లనియె. 118

గీ. శివునిచివుకువిల్లు శీఘ్రంబె యానాఁడు
విరచినాఁడ వనుచు విఱవీఁగ

వలదు నేఁడు నాకు వశమైనయీచాప
మెక్కుపెట్టి తివియు మింతెచాలు. 119

ఉ. రాముఁడు గీముఁడంచును ధరాజను లెల్ల నుతింప దిట్టవై
భీమునిచాపముఁ విఱిచి ప్రేలెద వందుల కేమిగాని యీ
శ్రీమహిళేశుకార్ముకముఁ జేకొని యెక్కిడవేని నేఁడు నీ
తో మఱి పోరు సల్పి పడఁద్రోతు రణస్థలి నీశరీరముఁ.

చ. అని తనచేతివిల్లు నృపులందఱుఁజూడఁగ నందియీయ నా
ధనువునుగూడి తేజముఁ బ్రతాపముఁ రాముని జెందెనంతనే
జనవరుఁ డాశరాసనముఁ జక్కఁగ నెక్కిడి వాఁడిబాణమం
దుననిడియేదిలక్ష్యమనఁ ద్రోవలుసూపినఁదుంచెఁగక్కునఁ

వ. ఇట్లు మహాప్రతాపంబునఁ దా విలుదుంచియనర్గళ
పరితాపమ్మున భార్గరాముఁడోర్గర్వంబు నిర్గర్వంబు గావించి
జయమ్ముఁ గైకొన్న కుమారునిం గౌఁగిలించుకొని దశరథుండు
కుమారచతుష్టయమ్ముతో నయోధ్యానగరంబు బ్రవేశించి
సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున. 122

శా. పారావారగభీరికిఁ ద్యుతిలసత్పద్మారికిఁ నిత్యవి
స్తారోదారవిహారికిఁ సుజనరక్షాదక్షదక్షారికిఁ
సారాచారవిచారికిఁ మదరిపుక్ష్మాపాలసంహారికిఁ
వీరీ సాటి నృపాలకుల్ దశరథోర్వీనాథజంభారికిఁ. 123

వ. అని కొనియాడఁ దగిన నృపాలశేఖరుండు ధర్మ
మార్గంబు నొక్కింతయేనిఁ దప్పకుండ రాజ్యంబుసేయు చుండె

ననుట విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁది
కథావిధానం బెట్టిదని యడుగుటయు. 124

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!
జలజాకరచారుహంస! జానకినాథా! 125

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురులింగ
జంగమార్చన వినోద నిత్యాశై వాచార సంపన్న
సూరిజనవినుత ఆతుకూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం
బైన శ్రీరామాయణ మహాకా
వ్యంబునందు బాలకాండము
సర్వము నేకాశ్వాసము.

# అయోధ్యాకాండము.

క. కందర్పరూప! ఖండిత
కందర్పవిరోధిచాప! కరుణాద్వీపా!
వందితశుభనామా! ముని
సందోహస్తుత్యభూమ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహాముని కెఱిం
గించిన తెలుంగు వినిపించెద నాకర్ణింపుము. 2

సీ. తనసుమంత్రాది ప్రధానులతోఁ గూడి
సుఖగోష్ఠి నుండంగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ
గురునితో దశరథధరణినాథుఁ
డనియె నీభూభార మంతయు నొక్కట
నేలితిఁ జాలదే యేకహేళి
నటుగాక పగతుర నవలీల గెల్చితి
నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడ

గీ. నింతచాలదె యాశకు నెంత కెంత
రామచంద్రుని ధరణికి రాజుగాఁగ
మీఁరెసూడంగఁ బట్టంబు భూరిమహిమఁ
గట్టవలయును మంచిలగ్నమునఁ జెలఁగి. 3

గీ. అనుచు గురునకుఁ దెల్పి తా నతనిసమ్మ
తమున సౌభాగ్యమంగళద్రవ్యసమితిఁ

గూర్చు డనుచున్న మంత్రులకును జెలుంగఁ
జెప్పి శృంగార మీపురిఁ జేయుఁడనియె. 4

వ. అట్టి సమయంబున, 5

గీ. పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథిఁ
జరమదిక్కున కేఁగఁగా శ్రమముదోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయనరుగు
కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె. 6

క. మేలిమి సంధ్యారాగము
ప్రాలిన చీఁకటియు గలిసి వరుణునివంకన్
నీలముఁ గెంపును నతికిన
పోలికఁ జూపట్టె నట నభోమణి తలఁగన్. 7

క. వారక కల్పద్రుమమునఁ
గోరకములు పుట్టినట్లు గురుతర కాంతిన్
దారకములు తల చూపెన్
జోరానీకమ్ము మిగుల స్రుక్కుచునుండన్. 8

గీ. కారుమొగులరీతిఁ గాటుకచందాన
నీటిభాతి నింద్రనీలమహిమ
మాషరాశిపోల్కి మఱిమఱి యప్పు డంధ
కార మవనియెల్లఁ గలయఁ బర్వె. 9

వ॥ అట్టిసమయంబున, 10

చ. తలవరులన్ విజాధిపుల దర్పకునేర్పునఁ గన్నుఁబ్రామియు
త్తలఁ దమపిన్నపాపల నుదారత నేర్పడ నిద్రపుచ్చి ని

ర్మలకరకంకణావళులు రట్టుగఁ దా మటు మ్రోఁగనీక వి
చ్చలవిడిఁ గ్రాఁజరించి రోగిజారలతాంగులు మధ్యరాత్రులన్. 11

చ. సురతము లేక యుస్సురను జోటిమగండు డికించు కాంతయున్
సరస మెఱుంగు చంద్రముఖి పావడిదంటయు బేరకత్తెయున్
బరపురుషాభిలాషమును బాయని భామిని పోరుకట్టునన్
బరఁగిన భామలాది యుపభర్తలఁ గూడి చరించి రత్తఱిన్. 12

ఉ. భానుసహస్రసత్కిరణపంక్తుల నుద్భవమైన యాబృహ
ద్భానుని వెట్టఁ బెల్లుడకఁబడ్డ సుధాంబుధి మీఁది మీఁగడల్
పూని సమీరుచేఁ దెరల పూర్వదిశం గనుపట్టఁ దానిపై
ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుకొండపైఁ దగన్.

చ॥ కుముదములుం జకోరములు కోమలసస్యము చంద్రకాంతముల్
రమణఁ జెలంగ వెన్నెలతిరంబుగఁ జేసె జగంబు లుబ్బఁగాఁ
గమలములున్ వియోగులధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్
రమణఁ గలంగ వెన్నెలతిరంబుగఁ గాచె జగంబు లుబ్బఁగాన్.

ఉ. నారదులైరి సన్మునులు నాకమహీజములయ్యె భూజముల్
శారదలైరి భామినులు శంకరశైలములయ్యె గోత్రముల్
పారదమయ్యె నీరధులు పన్నగనాయకులయ్యె నాగముల్
వారిదవర్గమెల్ల సితవర్ణములయ్యెను బండువెన్నెలన్. 15

చ. క్రొడుకుదయించె నంచలరి కోరి సుధాంబుధి మిన్నుముట్టి య
ప్పుడు జగమెల్లఁ గప్పెననఁ బూర్ణత నొందెను సాంద్రచంద్రికల్

పుడమికిఁ బాలవెల్లిగతిఁ బొల్పెసలారఁగ జంద్రుఁ డొప్పె న
య్యుడుపతి మేనిమచ్చ యనునొప్పెఁ బయోనిధిపద్మనాభుఁడై.

వ. అట్టి సమయంబున, 17

ఉ. కోరి చకోరదంపతులు గుంపులుగుంపులు గూడి రంతులన్
చేరిన చంద్రికారసముఁ జేర్కొనిమార్కొనిపొట్టనిండఁగాఁ
బారణ సేసి పెన్బయలఁ బ్రాఁకుచుఁ జంచుపుటంబు లెత్తుచున్
బేరము వారుచుండె మదిఁ బ్రేమజనింప వధూటికోటికిన్. 18

ఉ. వెన్నెలతీఁగలన్ గొనలు వేడుక ముక్కులఁ ద్రుంచి తెచ్చి
దారొన్న ప్రియాంగనాతతికిఁ గూరిమి నోరికి నిచ్చి కేళికిన్
సన్నపుఁగంఠనాళముల సన్నలు సేసి సుఖించె నింపుగన్
దిన్ననిచంద్రకాంతమణితిన్నెలమీఁదఁ జకోరదంపతుల్. 19

గీ. పాకశాసని సేవంతిబంతి దివికి
నెగుర వైచిన కైవడి నేమి సెప్పఁ
బాండువర్ణంబుతోఁ బూర్వభాగమందు
సొంపు మీఱంగ వేగుఁ జుక్క వొడిచె. 20

వ. అట్టి సమయంబున, 21

క. రవి యుదయించెను జమఁడీ
దివియులు నక్షత్రసమితి తిమిరము శశియున్
బవ లేమిటి కనుఁగొని
గువలయమున గూళ్ళఁ గోళ్ళు గూయ మొదలిడెన్.

చ. వదలక పద్మరాగమణి వట్రువఁ గ్రాలఁగ బట్టి నేర్పు పెం
పొదవఁగఁ దూర్పుకొండపయి కొప్పుగఁ దెచ్చి జగద్గురుండు దాఁ

ద్రిదశవరేణ్యు కట్టెదురఁ దేఁకువ నిల్పినదర్పణంబు నా
నుదయము నొందె భానుఁడు సముజ్జ్వలకోకనదప్రదీప్తులన్.

వ. ఆరాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్లుగా మెలంగి యాతఁడు దన్ను మెచ్చు టెఱింగి కైక యిట్లనియె. 24

ఆ. వసుమతీశ! నాకు వర మిచ్చి తప్పుట
తగవు గాదు మీకుఁ దలఁపులోన
మఱచినా రదేమొ మన్నించి తొల్లింటి
యీవు లీయవలయు నీక్షణంబ. 25

క. జననాథ ! నాకుమారుని
వినుఁడీ పట్టంబు గట్టి వేవేగను రా
ముని మునిఁగా ననుపుఁడు మఱి
వనమునఁ బదునాలు గేండ్లు వర్తింపంగన్. 26

వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుండు డిల్లపడి తల్లడిల్లుచు నుల్లంబు గలంగి ముసుంగిడి యచ్చేడియ పలికిన పలుకులకు మాఱాడ నోడి మిన్నక యున్నసమయంబున సుమంత్రుం డేతెంచి స్వామీ! రామచంద్రునిఁ బట్టంబు గట్ట సుముహూర్తం బాసన్నం బయ్యెఁ గావున మిమ్ము నచ్చటికి విచ్చేయ నవధరింపుం డని వసిష్ఠభగవానుండు విన్నవించు మని పంపె నని చెప్పిన విని కైక యిట్లనియె: 27

మ. అనిలోనమున్ను నృపాలుచిత్తమున కేనాహ్లాదముంగూర్చినా
తనయున్ బట్టముగట్టి రాఘవునిఁబద్నాల్గేండ్లు కాంతారమం

దునువ ట్రిల్లఁగ బంపఁగొన్న వరముఁ ద్రోయంగ రాదెంతయు
న్వనసీమఁ మునివృత్తినుండుమనుఁడీవై ళంబయా రామునిఁ.

క. అని పలుకు కైకపలుకులు
విని వేగమ మరలి వచ్చి విన్నఁదనంబుఁ
దనుక వసిష్ఠునితోడఁ
వినుపించె సుమంత్రుఁ డట్టివిధ మేర్పడఁగన్. 29

వ. అనిన విని వసిష్ఠాది ప్రముఖులును సుమంత్రాది ప్రధానజనంబులును సైన్యంబును బరివారంబులు విన్నవై యున్న నా సన్న యెఱింగి రామచంద్రుండు రాజచిహ్నంబులు త్యజించి జటావిభూతివల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై యున్నంత లక్ష్మణుండును భూపుత్రికయును దోడంజను దేరఁ దల్లులకు నమస్కరించి వసిష్ఠానుమతంబున నాశీర్వచనంబులు గైకొని యాస్థానంబు వెలువడి యరణ్యంబున కరుగు నప్పుడు పురజను లందఱును బురపురం బొక్కుచు దశరథ మహారాజును దూషింపుచుఁ గైకను నిందింపుచు మూఁకలై శోకింపుచుండ నది యంతయు విని దశరథుండు పురోహితామాత్యబంధువర్గంబులతో శ్రీరామచంద్రుం డేఁగిన త్రోవం జన్నంత నారాముఁడు దూరంబునఁ జనియె. దశరథుండును మరలి వచ్చి పుత్త్రశోకంబునన నాకపురంబునకుఁ జనియెఁ దద నంతరంబ, 30

ఆ. చనుచు రాఘవుండు స్వర్ణనది యొద్దన
గుహునిఁ గాంచి యతని, గుస్తరించి

తడఁయ కోడఁ బెట్టి దాఁటింపు మనవుడు
నట్ల చేయఁ దలఁచి యాత్మలోన. 31

చ. సుడిగొని రాముపాదములు సోఁకినధూళివహించి రాయియే
యేర్పడ నొక్క కాంత యయ్యెనఁట పన్నుగనీతని పాద రేణువి
య్యెడవడి నోడసోఁకనిదియేమగునోయని సంశయాత్ముఁడై
కడిగెగుహుండు రామపదకంజయుగంబు భయమ్ము పెంపునన్.

వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీపాదంబులనీటఁగడిగి యోడపై
నెక్కించి యమ్మువ్వుర నవ్వలికిఁ దాఁటించిన నాక్షణంబ, 33

ఉ. రాజకులావతంసుఁ డగు రాముఁడు తమ్ముఁడుఁ దాను నా భర
ద్వాజమహామునీంద్రుపద వారిజముల్ గని మ్రొక్క నాతఁడం
భోజహితాన్వయాబ్ధిపరిపూర్ణ సుధాకరుఁడైన రాముని
బూజలొనర్చి కంద ఫలమూలములన్ బరితృప్తిఁ జేసినన్.

వ. సంతసింపుచు నారాత్రి యచ్చట నివసించి మఱు
నటిదినమర్కోదయమ్మున, 35

ఆ. ముదముదోడఁ దమ్ము ముని భరద్వాజుండు
భక్తి ననుప రామభద్రుఁ డపుడు
చనియె భ్రాతృదారసహితుఁడై సన్ముని
కూటమునకుఁ జిత్రకూటమునకు. 36

మ. ఘనుఁడా రాముఁడు చిత్రకూటమున వేడ్కం జేరియున్నంతలో
ననదంతావళవాజిరత్నరథనానాయోధసంఘంబుతో
డ నమాత్యద్విజబంధువర్గములతోడం గూడి వాద్యంబులన్
జనుదెంచెన్ భరతుండు రాముకడకున్ సద్భక్తియేపారఁగన్.

సీ. చనుదెంచి రాముని చరణంబులకు మ్రొక్కి
కైకేయి చేసిన కపటమునకు
నగరంబు విడిచి యీపగిది ఘోరారణ్య
మున కిట్లు రా నేల మునులపగిది
నది గాక మనతండ్రి యత్యంతమైనట్టి
పుత్త్రశోకంబునఁ బొక్కి పొక్కి
త్రిదశాలయమ్మున దేవేంద్రుఁ గవఁ బోయె
నని చెప్ప విని రాముఁ డంతలోన
తే. భరత లక్ష్మణ శత్రుఘ్న ధరణిసుతలఁ
గూడి దుఃఖించి, దుఃఖించి కొంతవడికి
నాప్తవర్గంబుచే మాని నంతమీఁద
భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ. 38
తే. రాజు లేకున్నచో మఱి రాష్ట్రమంతు
గార్య మెల్లను మీ రెఱుంగనిది గలదె!
నేఁటిసమయానఁ బట్టంబు నిలుపుకొనఁగఁ
దిరిగి విచ్చేయుఁ డనుడు నాభరతుతోడ. 39
వ. శ్రీరామచంద్రుం డిట్లనియె, 40
చ. జనకుఁడు పేసినట్టిమితిఁ జక్కఁగఁ దీర్చి కడంక నేను వ
చ్చిన గుఱిదాఁక భూతలము జేకొని రాజ్యము జేయుమాటగా
దవకు మటన్న నొల్ల నన నాతనికిం దనపాదుకాయుగం
బొనరఁగనిచ్చి పొమ్మనుచునుర్వికి రాజుగఁబంపె సొంపుగన్. 41
వ. ఇట్లు భరతుని భరతాగ్రజుం డనునయించి మరలించి
నాకలోకవాటంబగు చిత్రకూటంబు కదలి సౌమిత్రి భూపుత్త్రి

లం గూడి పోవునెడ, నటవీమధ్యంబున విరాధుం డను దైత్యాధముం డపరాధంబుచేసి దిగ్గన డగ్గఱి జగతీతనూభవ నెత్తుకొని గగనమార్గంబున కెగిరి పోవునెడ వాఁడిబాణంబున వానికంఠంబును దుంచి గారుడాస్త్రంబున మరల నయ్యోన జనకనందనం డించి భయంబు వాపి ప్రియంబుసూపి యెయ్యో నయ్యోన నయ్యెడ నున్న యత్రిమహాముని యాశ్రమంబునకుం జని ఘనంబుగ నాఘనుండు సేయుపూజలం గైకొని రామ చంద్రుం డచ్చటిమునీంద్రులకు దైత్యులవలనిభయంబు లేకుండ నభయం బిచ్చి మన్ననం గొన్నిదినంబు లాయా మునుల యాశ్రమంబుల నిలుచుచు వార లనుప శరభాదిమృగోత్కర శరణ్యంబగు నరణ్యంబుఁ జొచ్చిపోయె నని చెప్పిన విను నార దుని వాల్మీకిమునీంద్రుఁడట మీఁది కథావిధానం బెట్టి దని యడుగుటయు. 42

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర
జలజాకరచారుహంస! జానకినాథా! 43

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజనవినుతకవితాచమత్కార రాతుకూరి కేసన సెట్టితనయ మొల్లనామధేయవిరచితం బైన శ్రీరామా యణమహాకావ్యంబునం దయోధ్యాకాండము సర్వము నేకాశ్వాసము.

# ఆరణ్యకాండము.



క. మునిదత్తధనుర్వేదా!
మునినాథప్రియసతీసుపూజితపాదా!
జనకార్చిత! గుణధామా!
సనకాదిస్తవ్యనామ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెలుంగు వినుపించెద. 2

చ. ఇతనికిఁ బాదచారితన మేటికి వచ్చెనో పట్టభద్రుఁ డీ
సతి నవరూపరేఖలను జక్కనిదయ్యును నిట్టిదుర్దశల్
ప్రతివసియించు టెట్లొ రతిరాజసమానుల వీరి నేల యీ
గతిఁబడఁద్రోచెఁ బ్రహ్మ యని కాంతురు చెంచెతలమ్మహాత్ములన్.

సీ. నడువ నేరని కొమ్మ యడుగులు పొక్కులై
శర్కరస్థలముల శ్రమముఁ జెందె
వీచినచేతుల వ్రేళ్లు నెత్తురుగ్రమ్మి
పోటుమర్లు కెంపులపోల్కి నమరె
వడిగాలి సుడివడి వాడినలేఁదీఁగ
భావంబునను మేనిచేవ తఱిగెఁ
బూర్ణచంద్రునికాంతి పున్నమవేకువఁ
గనుపట్టుగతి మోము కళల విడిచె

తే. ధవుని నడుగడుగునకుఁ గై దండఁ గొనుచు
నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురుఁ
బెదవు లెండఁగ నీడకు నుదలఁ గొనుచు
మనసులోఁ జేవ యూత్మఁగఁ జనెడు వేళ. 4

వ. ఇట్లా సీతయు రాముండును సత్యంబుమింబోని సౌమి
త్రియుఁ గతిపయప్రయాణంబులఁ బంచవటికిం జని సంతోష
భరితాంతరంగులై. 5

క. అచ్చటఁ గొన్ని దినంబులు
ముచ్చటపడి యుండఁ దలఁచి మునిముఖ్యులచే
మచ్చికఁ దమ్ముఁడుఁ దాను
గ్రిచ్చఱ నొక పర్ణశాలఁ గావించి తగన్. 6

ఆ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను
గొన్ని వాసరంబు లున్న వేళ
వికృతవేషధారి వేవేగ నటఁ జుప్ప
నాక యనెడి దైత్యనారి యొకర్తు. 7

వ. రామునిం గని ప్రేమాభిరామం బగు మనంబునఁ
దన్నుఁ గావించిరమ్మనిన రామచంద్రుండు సౌమిత్రినిఁజూప
నతఁడు మున్ను మాయన్న నభిలషించుటం జేసి నాకు దోషంబు
గాన నీ వారామునికడకు మరలఁ జను మన్న నది యట్ల
చేసిన రామచంద్రుండును దిరుగ లక్ష్మణుంజూపినఁ గోపించి
యారాక్షసి మనుజేంద్రసూనుల దండింపం దలంచిన నెఱింగి

భరతానుజుండు దానినాసికాకర్ణంబులు గోసి వైచిన నది
నెత్తురు జొత్తిల్లఁ బసిపాపయుంబోలి యేడ్చుచు ఖరదూష
ణాది సోదరులకుం జెప్పిన వారు గనలి రాక్షణంబున. 8

క. పదునాల్గువేల దైత్యులు
మదమున సోదరులుగొల్వ మండుచు శూరా
స్పద మగురథనికరముతోఁ
గదనంబున రాముకడకు ఖరుఁ డేతెంచెన్. 9

ఆ. ఖరుఁడు వచ్చినట్టి కలకలం బాలించి
రాఘవుండు తనదు రమణియొద్దఁ
దొలఁగకుండ ననుజుఁ దోడుగాఁ గాపుంచి
బెదర కంతఁ గలని కెదిరి నిలిచె. 10

శా. ఆవేళన్ ఖరుఁ డుగ్రవృత్తి లయకాలాభీల ఘోరాకృతుల్
దైవారన్ గజవాజిసంఘములతోఁ దైత్యాళితోఁ భూరిరో
షావిర్భూతమనస్కుఁడై నడిచె గర్వారంభసంరంభుఁడై
దేవవ్రాతము భీతిఁబొంది కలఁగన్ దేజంబుసొంపారఁగన్.

వ. ఇట్లు ఖరుఁడు సనుదెంచి భయంకరంబుగా రణంబు
సేయుసమయంబున. 12

ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకరరౌద్రరసంబుకన్నులన్
నిప్పులరాల్చుచున్ నెఱయ నిర్జరులార్వ విచిత్రశస్త్రముల్
కుప్పలు గాఁగ నేయుచును గుంజరవాజిరథావళుల్ ధరన్
దప్పకకూల్చుచున్ రుధిరధారలఁ దేల్చెనరాతిసంఘమున్.

వ. అట్టి సమయంబున, 14

క. కరితురగస్యందనములు
బరివారము దెగినపిదపఁ బటురోషమునన్
గరకరపడుచును నెదిరిన
ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరునిశిరంబున్. 15

వ. త్రుంచినం గని తీండ్రింబుగా, 16

క. ఘోషించి రామచంద్రుని
దూషించుచు వచ్చినట్టి దూషణుమీఁదన్
రోషించి సురలు కడు సం
తోషింపఁగ వానికరమ్ముఁ ద్రుంచెఁ గడంకన్. 17

క. త్రిశిరుఁ డంతఁ గనలి దివ్యాస్త్రసంపద
రాముమీఁదఁ జూపి రణ మొనర్చె
మూఁడుశిరము లతఁడు మొదలించి యటవాని
మూఁడుతలలఁ ద్రుంచె మొగ్గరమున. 18

వ. ఇట్లు ఖరాది రాక్షసుల శిక్షించి జయంబుగొని ధనువెక్కుడించి మరలి పర్ణశాల కేతెంచి తమ్ముఁడును దానును సమ్మదంబునం గలిసి యున్న సమయంబున, 19

చ. చలమున నంత శూర్పణఖ సయ్యనలంకకు నేఁగి రావణున్
గొలువునఁ గాంచి మ్రొక్కి తనకున్ నృపసూనులు చేసినట్టిచేఁ
తలు వినుపించి వారు తమతండ్రియనుజ్ఞను వచ్చి కానలోఁ
పలఁ దిరుగాడుచందములుఁ బన్నుగ నేర్పడఁ జెప్పి పిమ్మటన్.

క. ఆరాముభార్యవిభ్రమ
మేరాజతనూజలందు నెఱుఁగము విని మున్

ధారుణిలోఁ బలుకఁ గాఁ మిను
లారమణికి సాటిఁ బోల రభినుతిఁ జేయన్. 21

సీ. కన్నులు గలువలో కాముబాణంబులో
తెలివిగా నింతికిఁ దెలియరాదు
పలుకులు కిన్నరపలుకులో చిలుకల
పలుకులో నాతి కేర్పఱుప రాదు
అమృతాంశు బింబమో యద్దమో నెమ్మోము
తెంపుతోఁ జెలికి భావింపరాదు
కుచములు బంగారుకుండలో చక్రవా
కమ్ములో చెలి కెఱుంగంగ రాదు

తే. కురులు నీలంబులో తేఁటిగుంపు లొక్కొ
పిఱుఁదు పులినంబొ మన్మథుపెండ్లియరుగొ
యనుచుఁ గొందఱు సంశయంబందుచుండ
వెలఁది యొప్పారు లావణ్యవిభ్రమముల. 22

క. కలదో లేదో యనుచును
బలుమఱు నెన్నడుముఁ జూచి పలుకుదు రితరుల్
బలిమో కలిమో యనుచును
బలుమఱు జఘనంబుఁ జూచి పలుకుదు రితరుల్. 23

సీ. పద్మదళంబులపైకి సంపెంగపువ్వుల
జలజాతముల పైకి జందమామఁ
గిసలయంబులపైకిఁ బెనఁ గలకంఠముల్
సింధురమ్ములపైకి సింహములను

దొండపండులపైకి దొడ్డరాచిలుకల
నలరుదూడులపైకి హంసవితతిఁ
బండువెన్నెలనిగ్గుపైకిఁ జకోరముల్
పవనంబుమీఁదికి బాపఁ జేని

తే. మరుఁడు వైరంబు చేసినమాడ్కి నలక
నాసికాకరాననచరణస్తనములు
వరపయోధరమధ్యోష్ఠవచనబాహు
గమనహాసాక్షు లూర్పారు రమణి కమరె. 24

క. బంగారునీరు నిలువున
బొంగారుచు నుండ నజుఁడు లోసినమాడ్కిన్
శృంగారమెల్ల నిలువునఁ
బొంగారుచు నుండుఁ గరఁగి పోసినమాడ్కిన్. 25

వ. అట్టి వయోరూపంబులను గనుపట్టునట్టి యక్కాంతారత్నంబు నీకు సిద్ధించెనేని నీవు త్రిభువనంబులు విజయంబు చేసిన యంతకన్నను సంతసింతు వన్న విని కామాశుగంబులం దగిలి కామాంధుండై కన్నులు గానక యున్నకొని తన్నుఁ దా మఱచి యొడ్డోలగంబు సాలించి పుష్పకం బనువిమానరత్నంబుపై నధిష్ఠించి మారీచుకడకుంజని ప్రార్థించి నీవు కనకమృగంబవై జనస్థానంబునకుం జని దశరథనందనుండగు శ్రీరాముం డున్నపర్ణశాలకడం బొడకట్టిన నతండును నిన్ను వెనుకొను నీవు నతని నతిదూరంబుగాఁ గొనిపోయి మాయం

బైన నేనును రాముని భార్యం గొనివత్తుననిన విని సమ్మతిలక మారుత్తరం బిచ్చిన రావణుం డుగ్రుండై మండిపడ నతం డా సన్న యెఱింగి కనకమృగరూపంబును దాల్చె నాక్షణంబున, 26

క. ఒడలెల్లను బంగారము
పొడలెల్లను రత్నసమితిఁ బోలిన మెఱుఁగుల్
నడలెల్ల నెఱపి మెలఁగెడు
కడలెల్ల విలాసరేఖ కళలం దొప్పెన్. 27

వ. ఇట్లు కనకమృగాకారంబు గైకొని పర్ణశాలకడకుం బోయి మెలంగునప్పుడు. 28

క. కనియును వినియును నెఱుఁగము
కనకమృగం బనుచు వేడ్కఁ గడలుకొనంగన్
గనకమృగం బద్భుతమిది
కనకమృగం బేమి సేయఁ గలదో యీడన్. 29

వ. అని కనుఁగొన్న మునిజనంబులు మనంబులం దలంక నెడ నామృగంబును మృగనేత్రయగు ధాత్రీపుత్త్రి గని దాని నభిలషించిన నాపన్న యెఱింగి సౌమిత్రిని భూమిజకుం దోడిడి శ్రీరామచంద్రుండు దానివెంటఁగొని చనుచున్నయవసరమ్మున.

సీ. తనుఁ బట్టనొయ్యన వెనుకొని చనుదెంచి
నిలఁజేసితలఁపుఁ దాఁ దెలిసి తెలిసి
చేరువ మెలఁగుచుఁ బూరి మేయుచు డాసి
మెల్లన యంతంత మొలఁగి మెలఁగి

తననీడఁ గనుఁగొని తానె దిగ్గన దాఁటి
భయమునఁ బరువెత్తి పఱచి పఱచి
యెడ్డరైనఁ బోవక యెడలయించి కనుఁగొన్నఁ
దరువుల నొయ్యన నొరసి యొరసి
తే. చెవులు నిక్కించి చూచుచుఁ జెలఁగి చెలఁగి
పోవ రాముండు దవ్వుగాఁ బోయి పోయి
యెలమి మాయామృగం బని యెఱిఁగి మదిని
దీనిఁ జంపుదుఁగా కని తెగువ చేసి. 31

క. ఏచినకినుకను బలునా
రాచము సంధించి డాసి రాఘవుఁ డామా
రీచుని దైత్యాధముఁ గుల
నీచునిఁ గూలంగ నేసె నిర్జరు లలరన్. 32

వ. వాఁడునుం గూలునవ్వేళ "హా! లక్ష్మణా" యనుర వంబుం జేసిన నాధ్వని విని జనకనందన మనంబున నులికి లక్ష్మణుంబిలిచి మాయన్న, కేమికీడు వాటిల్లెనో కాని నన్నుఁ దలంచె. నీవునుం బోయి మాయన్న కుశలస్థితిం దెలిసికొని రమ్మ నిన నతండు తలంకక నామెతో నిట్లనియె. 33

ఉ. ఏమిటి కింతభీతి మది నీవగ త్రోఁచుట యేమి నీకు నో
భామిని! రామునందు నొక భారము చెందదు చెందెనేనియున్
భూమి వడంక దేవసభము బోరన మ్రొగ్గియదె వార్థు లింక వే
తామరసాప్తసోమగ్రహతారక లెల్లను నేల ద్రెల్లవే! 34

ఉ. అంత పసన్యోనేని దనుజాంతకు నంతకు నమ్మదాంధకుఁ
బంతముమీఱఁగాఁగలఁచిపన్నగమర్త్యసురేంద్రలోకముల్
బంతులు కట్టి యూడ్చి రిపుభంజను రామునిఁగందకుండ న
ర్పింతును నీకుఁదెచ్చి మది భీతిని బొందకు మమ్మ జానకీ!

వ. అని లక్ష్మణుండు పలికిన విని జనకరాజనందన కినిసి వినరానిమాటలం చూల నాడిన మనంబునం గంది కుందుచు శ్రీరామచంద్రుిం డేఁగినమార్గంబునఁ జనియె నంత నిక్కడ. 36

క. సన్న్యాసివేష మలరఁగ
నన్యాయము తలఁచుకొనుచు నసురేంద్రుఁడు దాఁ
గన్యారత్నముఁ గని సౌ
జన్యమునన దీవన లిడె శాంతము దోఁపన్. 37

క. దీవించుచు మునియో యని
భావింపుచుఁ జేర వచ్చుభామిని నపు డా
రావణుఁడు రథముమీఁదికి
వేవేగమ తిగిచి గగనవీథినిఁ జనియెన్. 38

వ. అయ్యవసరంబున. 39

ఆ. అసుర గొంచుఁ బోవ నవనీతనూభవ
వెఱచి పలికె దిశలు వినఁగ నంత
సీత నాదుపేరు, శ్రీరాముభార్యను
నన్నుఁ గావరయ్య మిన్న కిపుడు. 40

వ. అని మఱియును. 41

ఆ. దేవగణములార! దిక్పాలవరులార!
వృక్షజాతులార! పక్షులార!
కుటిలదానవుండు గొంపోవుచున్నాఁడు
కరుణతోడ నన్నుఁ గావరయ్య. 42

ఆ. అనుచుఁ బలుకుచున్న నాయార్తనాదంబు
విని జటాయు వనెడి విహగనాథుఁ
డరుగుదెంచి కలహ మత్యుగ్రముగఁ జేయ
రావణుండుఁ బక్షిరాజుఁ దాఁకె. 43

చ. అసురవిభుండు వైచునిశితాస్త్రముఖంబుల నొచ్చిపక్షియుఁ
గొసరక దైత్యనాయకుని గుండెను నొవ్వఁగఁ దన్ననంతలోఁ
గసర నిశాచరుండు కరఖడ్గముఁ ద్రిప్పుచుఁ బక్షియుగ్మముఁ
వసుధఁ బడంగఁ ద్రుంచి కడువైళమ లంకకు నేఁగువ త్తఱిన్.

క. వనచరు లొకగిరిచేరువ
వనమునఁ జరియింపఁ జూచి వసుధాసుతయుఁ
దనచీరకొంగుతునుకను
దనసొమ్ములు మూట గట్టి ధరపై వైచెఁ. 45

క. అంతట దైత్యుఁడు లంకకుఁ
బంతముతో నేఁగి శింశుపాతరు క్రిందఁ
సంతసమున నిడి దానవ
కాంతల నవనిజకుఁ దోడు కావలియుంచెఁ. 46

ఉ. అ త్తఱి రాఘవుండు తనునాసలఁ బెట్టుచుఁ గొంచుఁ బోవఁగా
జిత్తమునొచ్చి యామృగము శీఘ్రమునన్ బడ నేసి దానిపై
తిత్తిని దీసివింటికొనఁ దెచ్చెడి వేళఁ బయోజమిత్రవం
శోత్తముఁ డుల్కఁ గానఁబడెనక్కడ లక్ష్మణుఁ డన్న దృష్టికిన్.

చ. పొడగని గుండె ఝల్లుమన బుద్ధిఁ గలంగుచు రామచంద్రుఁడ
వ్వెడఁ గడు నుగ్రుఁడై పలికె నీవిటు నాకడ కేల వచ్చితి
క్కడ నిముఁ బర్ణశాలకడఁ గావలి యుంచిన చోటనొంటిమై
బడఁతుక డించి రాఁ దగునె వన్యమృగోత్కరమధ్యసీమకున్.

ఆ. అనుచుఁ బలుకుచున్న యన్నకుఁ బ్రణమిల్లి
వినయవాక్యఫణితి విన్నవించె
జనకతనయపలుకు చందంబు మొదలెత్తి
లవముఁ దప్పకుండ లక్ష్మణుండు. 49

వ. చెప్పిన మాటలు విని విన్నఁదనంబునఁ జిన్నబోవుచు
దుర్నిమిత్తంబులం గనుచుఁ దత్తరంబున నాశ్రమంబునకుఁ జని
యక్కడ; 50

ఆ. పర్ణశాలలోనఁ బరికించి పరికించి
సీతఁ గానఁబడమిఁ జిన్నవోయి
చిత్తమంతఁ దలఁగి శ్రీరామచంద్రుండు
పలువరింపఁ జొచ్చె బ్రమసి బ్రమసి. 51

సీ. నీదృగ్విలాసంబు నెఱి లభ్యసించెడు
గురుకుచ గానవే హరిణవిభుఁడ!

నీమంజులాలాపనిచయంబుఁ గైకొన్న
సుకుమారిఁ గానవే పికకులేంద్ర!
నీనిండుసత్కాంతి నెమ్మోము గలయట్టి
రుచిరాంగిఁ గానవే రోహిణీశ!
నీపక్షవిస్ఫూర్తి నెనయుధమ్మిల్లంబు
గలయింతిఁ గానవే యళికులేశ!

తే. స్తనభరంబున నీపోల్కిఁ దనరినట్టి
యతివఁ గానవె చక్రవాకాధినాథ!
నెఱయ నినుఁ బోలు నెన్నడ నేర్చినట్టి
రమణిఁ గానవె నీవు మరాళరాజ! 52

సీ. ఘనసారభూజంబ! కానవే నీవంటి
గంధంబు గలయట్టికరటియాన!
దదళికాతరురాజ! కానవె నీయట్టి
మెఱుఁగుఁబెందొడల మా మీననేత్ర!
విలసిల్లు చంపక వృక్షంబ! కానవే
లలి నీదుపుష్పవిలాసనాసఁ!
గమనీయలత! నీవు కానవే నీయట్టి
కరములు శోభిల్లు కంబుకంఠి!

తే. గ్రముకధరణీరుహాధీశ! కానవయ్య
నీఫలస్ఫూర్తికంఠంబు నీలవేణి!
గళికలను మించు నవకుంద! కానవమ్మ
నీదుకోరకనిభదంత నీరజాస్య! 53

సీ. వనజాస్య! నినుఁ గూడి వర్తించు నతిఘోర
వనములు శృంగారవనము లగును
పడఁతి! నీతోఁ గూడి పవళించు కర్కశ
శయ్యలు పూవులశయ్య లగును
గలకంఠి! నీచేతి కందమూలాదిభో
జనములు మధురభోజనము లగును
హారిమధ్య! నినుఁగూడి చరియించునటువంటి
తపములు సత్పుణ్యతపము లగును
తే. గరలి నీతోడఁ గూడ భోగించునట్టి
భోగ మంతయు దేవేంద్రభోగ మగును
సుదతి! పొడకట్టఁగదె నాకుఁ! జూడవలయుఁ
గన్నులకుఁ గానఁబడ వేమి కమలనయన! 54

వ. అని మఱియును. 55

సీ. ఏమృగంబును గన్న నేణాక్షిఁ గానవే
యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేపక్షిఁ గనుఁగొన్న నెలనాగఁ గానవే
యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేమ్రానుఁ జూడగన్న వామాక్షిఁ గానవే
యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేగట్టుఁ జూడగన్న నిభయానఁ గానవే
యని పెక్కుభంగుల నడిగి యడిగి

ఆ. కలఁగు భీతి నొందుఁ దలఁకుఁ జిత్తములోన
సొలయు మూర్ఛఁబోవు నలఁయు నలఁగు
సీతఁ గానఁబడమి శ్రీరామచంద్రుండు
విరహతాపవహ్ని వేఁగి వేఁగి. 56

వ. ఇట్లు సీతావియోగంబునకుఁ బలవరింపుచున్న యన్నఁ గని సౌమిత్రి యిట్లనియె. 57

క. దీనునికైవడి నూరక
మానము సెడి వగవ నేల మనుజేశ్వర! యీ
కాననభూముల వెదకఁగఁ
గానని మీఁదటను వగవఁ గాఁదగు మనకున్. 58

వ. అని ప్రతాపించి కోప మాఁపుకోఁజాలక కన్నులు జేగురింప నన్నతో నిట్లనియె. 59

ఉ. వ్రచ్చెద నాకలోకమున వారలగుండెలు నాగలోకమున్
గ్రొచ్చియహీంద్రవర్గమును గూల్చెదఁగవ్వపుగొండకైవడిన్
దచ్చెద మర్త్యలోకము సుదారత నేగతినైనఁ గ్రిమ్మఱిం
దెచ్చెద సీత నీక్షణము దేవరచిత్తము మెచ్చునట్లుగన్. 60

వ. అని యిట్లు పలికి మఱియును. 61

ఉ. చించెద దైత్యసంఘములఁ జిందఱవందఱఁ జేసి బ్రహ్మ బా
ధించెద లోకపాలకులఁ ద్రెళ్ళఁగ నేసెద భూతలమ్ము గ్ర
క్కించెద శైలజాలముల గీటడఁగించెద భూమినందనన్
గాంచెదఁ దల్లడిల్లకుము కంజహితాన్వయవార్ధిచంద్రమా!

క. భూతలమును నాకసమును
బాతాళంబును నెమకిరొ బాధించిరొ నే
సీతను దెచ్చిన పిమ్మట
సీతమ్ముఁడ ననుచు మెచ్చు నిఖిలోర్వీశా! 63

వ. అని పలుకుచున్న తమ్ముని శౌర్యధైర్యాదిగుణంబులకు సంతోషింపుచు జనస్థానంబు వెడలి జనకనందన నన్వేషింపుచు దక్షిణాభిముఖులై చనుచు ముందట. 64

క. పక్షములుఁ గాళ్లుఁ దునిఁగిన
పక్షీంద్రునిఁ జూచి రామభద్రుండు మదిలో
రాక్షసమాయయొ యనుచును
శిక్షింపఁ దలంచు నంత శీఘ్రమె పలికెన్. 65

క. సీతండ్రికి నతిమిత్త్రుఁడ
నోతండ్రీ! నన్ను నేయ నుచితమె నీకున్
నాతగు పేరు జటాయువు
సీతాధిప! నన్ను నెఱుఁగు చిత్తములోనన్. 66

వ. అని చెప్పి వెండియు నాజటాయు విట్లనియె. 67

మ. వినుమో రాఘవ! పంక్తికంధరుఁడు దోర్వీర్యంబు సంధిల్లఁగా
జనకక్ష్మాపతినందనన్ గొనుచు స్వేచ్ఛావృత్తితో నేఁగుచో
వనితారత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా
వినిపోరాడఁగ బ్రాప్తమయ్యె మఱియా వేషంబు భూమీశ్వరా!

క. అని సీత తెఱఁగుఁ దనపని
జననాయకుఁ డైన రామచంద్రునితోడన్
వినుపించి యాజటాయువు
తను వెరియఁగ నంతఁ గాలధర్మము నొందెన్. 69

వ. ఇట్లు రామచంద్రునకు సకల వృత్తాంతమును నెరి
గించి శరీరంబు విడిచిన యప్పక్షిరాజునకు భక్తిపూర్వకంబుగా
వగ్ని సంస్కారాది విధులు దీర్చి దక్షిణాభిముఖులై చనుచుఁ
జిత్రరూపంబున నున్న కబంధుని వధియించి ముందట. 70

క. చనిచని యెదుటను రాముఁడు
గనుఁగొనియె మహీజనోగ్ర కలుషాద్రిమహా
శనిరూపం బనఁ దగు నా
ఘనముక్తివధూవిలాసకబరిఁ శబరిన్. 71

తే. కాంచినను మ్రొక్కి యాభూమికాంతునకును
మించి సద్భక్తిఁ బూజఁ గావించినంత
శబరితోడను దమ కార్యసరణిఁ దెలియ
వినయమునఁ జెప్ప నాకాంత విన్నవించె: 72

తే. ఇనకులాధీశ! సుగ్రీవుఁ డనెడువాఁడు
కపికులశ్రేష్ఠుఁ డత్యంతఘనుఁడు తలప
నతనితోఁ బొత్తుగావింపు మన్ని పనులు
జక్క నౌటకు నాత్మ నిస్సంశయంబు. 73

వ. అని చెప్పి వీడ్కొలిపిన నమ్మునుజేంద్రనందను లట మీఁదఁ బంపాతటంబునకుం జని రని చెప్పునారదుని వాల్మీకి మునీశ్వరుం డటమీఁదికథావిధానం బెట్టిదని యడుగుటయు.

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుత పాదజలజాతా! సుధా
జలరాశి భవ్యమందిర!
జలజాకర చారుహంస! జానకినాథా! 75

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురుజంగమార్చన
వినోద సూరిజనవినుతకవిత్వాచమత్కారా రాతుకూరి కేసన
సెట్టి తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీ
రామాయణ మహాకావ్యంబునం దారణ్య
కాండము సర్వము నేకాశ్వాసము.

# కిష్కింధాకాండము.

క. పక్షీంద్రవాహా! గిరిజా
త్ర్యక్షమనోబ్జాతగేహా! యపహృతమోహా!
రాక్షసభీమా! మునిజన
సాక్షాత్కృతనైజధామ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునీశ్వరున
కెఱింగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 2

సీ. పంపాతటమ్మున బాణాసనాయుధ
పాణులై యున్న భూపాలసుతులఁ
గనుగొని భీతిల్లి కఘులాప్తసూనుండు
వాలిపంపున వీరు వచ్చి రనుచుఁ
గలఁగి తా ఋశ్యమూకంబున నుండంగ
వెఱచి మలయశైల విపినసీమఁ
దిరిగి వారలరాక తెఱఁ గెల్లఁ దెలిసి రాఁ
బవనాత్మజుని వేగఁ బంప నతఁడు

తే. వచ్చి రఘురాము శ్రీపాదవారిజముల
కర్థిఁ బ్రణమిల్లి మీ రెవ్వ రయ్య యిటకు
నేమికతమున వచ్చితి, రేడి నామ
మనుచు నడిగిన సౌమిత్రి యతని కనియె. 3

సీ. దశరథుం డనురాజుతనయుల మాతని
పంపునఁ దపమాచరింపఁ గోరి
వచ్చి కాననభూమి వర్తించుచుండ నీ
రాజుదేవిని దుష్టు రావణుండు
కుటిలవృత్తిని నెత్తుకొని పోవ నాజాడ
వదలక దిక్కులు వెదకి వచ్చి
శబరికి మారాక చందంబుఁ దెలియంగఁ
జెప్పిన నర్కజుచేతఁ గాని

తే. మీదుకార్యంబు నెగ్గదు మీరలరిగి
వేగ సుగ్రీవుచెల్మి గావింపుఁ డనిన
వచ్చినారము గనుఁగొన వలసి యతని
నతఁడు రాముండు లక్ష్మణుం డంచ్రు నన్న. 4

తే. తలప నీరాజునకు నెందు ధాత్రిలోన
విను మసాధ్యంబు లైనట్టిపనులు లేవు
సూర్యవంశోత్తముడు మహాశూరుఁ డితఁడు
నీకుఁ బేరేమి చెప్పుమా మాకు నన్న. 5

తే. వాయుదేవునిఁ బ్రార్థించి వేయుగతుల
నంజనాదేవి గాంచినయాత్మజుండ
నర్కజునిమంత్రి నై యుండు ననుదినంబు
వినుడు నా పేరు హనుమంతు డనుదు రిలను. 6

వ. అని చెప్పి మఱియు నిట్లని విన్నవించె. 7

చ. వినుడుమహాత్ములార! యరవిందహితాత్మజుదోడి తెచ్చి మి
మ్మునుబొడగానుపింతునని మ్రొక్కుచు నేగికపీంద్రు జేరి తాఁ

జనిన తెఱంగు వారిఁ గనుచందము నేర్పడఁజెప్పి గొబ్బునన్
బనిగొని వచ్చి రాముపదపంకజముల్ గనుపించెనంతటన్.

వ. సుగ్రీవుండు శ్రీరామచంద్రుని పగదీర్పఁదా భారం
బువహించి తనకుఁ బగవాఁడైన వాలిని జంపింపం దలంచి
వానితోఁ దనకుఁ గలిగిన పూర్వవైరంబు తెఱంగు శ్రీరాము
నకుఁ దెలియవిన్నవించి వాలి మహాసత్వశాలి యతండు రాము
నిచేతం దెగుట చెల్లంబుగా దుందుభికళేబరంబును బదియోజ
నంబులదూర మెగురఁ జిమ్ముటయును సప్తతాళంబు లొక్క
బాణంబునఁ దెగనేయుటయును జూచి సుగ్రీవుండు భయకం
పితహృదయుండై రాఘవేశ్వరుల పాదారవిందంబులకు వంద
నంబాచరించి జనకనందన మున్ను జాఱవిడిచిన యాభరణం
బుల మూటఁ దెప్పించి జూపినం జూచి మూర్ఛిల్లి గొబ్బునం
దెలిసి యర్కకులేశ్వరుం డైన శ్రీరామచంద్రుం డర్కసంభ
వుండైన సుగ్రీవునితో నిట్లనియె. 9

క॥ పగ నీ కెక్కడి దింకను
నగచర! నగభేదిసుతుని నాయస్త్రమునన్
దెగ నేయుదు నమ్ముమనుచు
జగదీశుఁడు వలుక నతఁడు సంతోషించెన్. 10

వ. ఇట్లు ప్రమాణవచనంబుల న య్యచలచరాగ్రణి
స్వాంతంబును సంతోషింపఁజేసిన నతండును శ్రీరామచంద్రుని
కార్యంబునకు సహాయుఁడై యుండ నొడంబడి యమ్మహా

యకుని యనుమతంబున యుద్ధసన్నద్ధుండై కిష్కింధానగరంబు
నకు జని తద్ద్వారంబున నిలిచి సింహనాదంబు జేసినం గనలి
యాదేవేంద్రతనూభవుండు ననుదెంచె నంత నయ్యిరువురుం
గదిసి భుజంబు లప్పళించుచు గర్వాలాపంబు లాడుచు నొం
డొరుల మార్కొని. 11

శా. శైలంబుల్ గడువేగ నువ్వ్రచు మహోఘుంకారహుంకారము
ల్, చాలం జేయుచు భీకరోద్ధతుల చేసాలంబులన్ వ్రేయుచున్
వాలాగ్రంబుల మోదుచున్ వడివడిన్ వక్త్రంబులన్ రక్తముల్
కూలన్ వాలియు సూర్యసూతియు నడిం గోపాత్ములై పోరఁగన్.

వ. అట్టి సమయంబున. 13

ఉ. స్థాలముపొంతనిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి శబ్దవి
న్మాలముగాఁగవిల్ దివిచి ముష్టియుదృష్టియుఁ గూర్చి గోత్రభృ
త్కూలము వజ్రపాతహతిఁ గూలువిధంబునఁ గూలనేసెన
వ్వాలిఁ బ్రతాపశాలి మృదువందనశీలి సురాలి మెచ్చఁగన్.

వ. తదనంతరంబున. 15

క. తారాపతి శిక్షింపుచుఁ
దారాపతిధవళకీర్తిఁ దగునర్కజునిన్
రారా దేవికిఁ బురి కా
దారార్కము గాఁగ రాజతనయుఁడు నిల్పెన్. 16

క. నిగ్రహము మాని నృపతి శు
భగ్రహలగ్నంబునందుఁ బట్టము గట్టెన్
విగ్రహరాజోపగ్రహు
సుగ్రీవుని హేమదామసుగ్రీవుం దగన్. 17

వ. ఇట్లు సుగ్రీవునిఁ గపిరాజ్యపట్టభద్రునిం జేసి వాలి
తనూసంభవుని నంగదకుమారుని యువరాజపదంబున నిలిపె
నంత వర్షకాలము గడచునంతదనుక శ్రీరాముని మాల్యవం
తంబుపై నుండ నియమించి వారు సని రయ్యవసరమున. 18

సీ. బ్రహ్మాండ మగలంగఁ బటపటధ్వనులతో
నఱుము లంతంతకు నఱుముచుండఁ
గడు భయంకరముగా వడి మ్రోఁగు మ్రోఁతలఁ
బిడుగు లాడాడ గుభిల్లు మనఁగఁ
గ్రముకంబులం తేసి కణములతోఁ గూడఁ
గరుడు గట్టిన వడగండ్లు రాలఁ
గోరవిదయ్యంబుల వెఱపించు తెఱఁగున
విద్యుత్ప్రకాశమ్ము విస్తరిల్ల
తే. ముసుఁగు వేసిన చందాన మొగులు గప్పి
మిఱ్ఱు నలు పెక్కి చీఁకట్లు కాఱుకొనఁగ
మించి కడవల నుదకంబు ముంచి తెచ్చి
కుమ్మరించినగతి వాన గురిసె నపుడు. 19

క. ఏఱులు కాల్వడ తెప్పఁగఁ
బాఱెను సస్యములు పండె ఫలవృక్షములున్
మిఱి ఫలించెను ధరఁ బా
లేఱులుగా సురభు లెల్ల నెప్పుడుఁ బితికెన్. 20

వ॥ అంత వర్షకాలాంతంబు గాఁగ నమ్మహీకాంతుండు
ప్రేయసీవియోగ పరితాపానలంబునఁ బొరలుచు నోర్వలేక
విభ్రాంతస్వాంతుండై యుండ. 21

సీ. పలుమాఱు నీహస్తపల్లవంబులచేత
నలివేణి! నాతాప మార్ప వేల
నళినాక్షి! పరిరంభణక్రీడఁ దేల్చు నీ
మదినొప్పి నానొప్పి మాన్ప వేల
చెలియ! యోష్ఠామృతసేవకై నీయల్క
వడిఁ దప్పి నాదప్పి గడప వేల
భామ! తాపానల పరితాప ముడుప నీ
తనువు నాతనువునఁ బెనఁచ వేల
ఆ. అనుచు సీతఁ బిలుచు నందంద పరికించు
దిక్కు లాలకించు నిక్కి చూచు
దశరథాత్మజుండు తన్నుఁ దా మఱచుచు
బయలు కౌఁగిలించుఁ బలువరించు. 22
వ॥ అని మఱియును. 23
ఉ. కూరలునోటికిం రుచులుకూడుటదప్పెనుదుంపఁదూడులుం
గారముతోఁ జెఱిహ్వకును గమ్మనితేనెలు చేదులయ్యెఁ గం
గారయెఁ జిత్తమంతయును గంటికినిద్రరహింపదయ్యె శృం
గార మెలర్ప సీతఁ బొడగానని రామనృపాలమౌళికిన్.
ఉ. తాలిమి దూలిపోయిపరితాపమునం దిరుగాడు నొక్కచోఁ
గాలును నిల్వదొక్కనధికారముచాలక యెప్పుడుంగడుం
జాలి వహించుఁ జిత్తమునఁ జంచలతం గను భూమిపుత్త్రిపై
మేలిమిఁ జేసి రాముఁ డట మిన్నక పేదురుగొన్నకై వడిన్
వ. ఇట్లు విరహతాపంబునఁ బొరలుచున్న సమయంబున
గార్తికమాసంబు సనుదెంచిన శ్రీరామచంద్రుండు బలంబులం

గూర్చుకొని రమ్మని సుగ్రీవుపాలికి సౌమిత్రి ననుప నా
రాముతమ్మునిం గూడి యసజుఁడు తారాసమేతుండై చను
దెంచి రాఘవేశ్వరుల చరణారవిందమ్ములకు నమస్కరించి
తన బలంబుల దోడు సూపం దొడంగె నెట్లనినఁ బదులును
నూఱులును వేలును బదివేలును లక్షలును బదిలక్షలును
గోట్లును శతకోట్లును నర్బుదంబులును నిర్బుదంబులును ఖర్వం
బులును మహాఖర్వంబులును బద్మంబులును మహాపద్మంబులును
క్షోణులును మహాక్షోణులును శంఖంబులును మహాశంఖం
బులును క్షితులును మహాక్షితులును క్షోభంబులును మహా
క్షోభంబులును నిధులును మహానిధులును సాగరంబులును
మహాసాగరంబులును బరిమితంబులును మహాపరిమితంబులును
ననంతంబులును మహానంతంబులును గడచి లెక్కకు మిక్కిలి
యెక్కువయై డెబ్బదిరెండు వెల్లువలు గల కపిబలంబుతోడఁ
దోడుసూపినం జూచి రాఘవేశ్వరుండు సంతోషించి సవిత్రు
నందను గారవించి కౌఁగలించికొని సీతాన్వేషణంబుఁ జేయఁ
గల వానరోత్తముల నధికబలయుతుల నేర్పఱిచి దిశలకుం
బంపు మనవుడుఁ దూర్పునకు మైందుండును బశ్చిమంబునకు
సుషేణుండును నుత్తరంబునకు శతబలియు ననువారిని నేర్ప
ఱిచి వారలకుఁ దోడుగా వానరవీరులను లక్షలక్షసంఖ్యా
కుల నేర్పఱిచి యిచ్చి జానకియున్న చొప్పును దెలిసి యొక్క
నెలలో రమ్మని యనిపి హనుమంతునిం బిలిచి నీవు దక్షి

ణమ్మునకుం బొమ్మని యనుపునపుడు శ్రీరామభూపాలుండు వానివిశ్వాసాదిగుణమ్ములకు మెచ్చినవాఁడై దగ్గఱఁగాఁబిలిచి నీవు శౌర్యవంతుండవు హితుండవును గావున నీచేత మత్ప్రియోజనం బీడేఱు నని పలికి తనచేతియంగుళీయకం బతని చేతి కిచ్చి యీముద్రిక జనకరాజనందనకు సమర్పించి యాజానకి శిరోరత్నంబు మా కానవాలుగాఁ దెమ్మని యనుపనతండియ్యకొనిమ్రొక్కిన నాతనికిందోడుగానంగదజాంబవదాదులంగూర్చి యనిపె ననుటయు విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయును. 26

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర
జలజాకరచారుహంస! జానకినాథా! 27

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజనవినుత కవితాచమత్కార నాతుకూరి కేసన సెట్టితనయ మొల్లనామధేయవిరచితంబైన శ్రీ రామాయణ మహాకావ్యంబున గిష్కింధాకాండము సర్వము నేకాశ్వాసము.

# సుందరకాండము



క. సూర్యకులరత్నదీపా!
సూర్యసహస్రప్రతాప! సుందరరూపా!
ఆర్యార్చాధితనామా!
శౌర్యాదికసుగుణసీమ! జానకిరామా! 1

వ. శ్రీనారదమహాముని వాల్మీకి కెఱింగించిన తెఱంగున విన్నవించెద నవధరింపుము. 2

తే. రామునకు మ్రొక్కి యక్కపిరాజుకరుణఁ
దక్షిణంబున వెడలిరి దక్షిణంబు
వెదకువారగు వానరవీరవరులు
పంతములు పెంచ నెంతయు సంతసమున. 3

క. మును తా మేఁగినదిక్కులు
సనివడి వెదకంగఁ జనిన బలిముఖు లెల్లన్
జనకజఁ గానక వచ్చిరి
మనుజేశునికడకు చనినమార్గంబున నే.

వ. అట్టి సమయంబున.

క. గిరులును నదులును వనములుఁ
బరికింపుచుఁ బట్టణములు బహువిధగతులన్
దిరుగుచు వెదకుచుఁ గానక
కరువలికొడుకు కాదియైన కపివరు లెనుటన్. 6

క. ఆలోకింపఁ గాంచిరి సత్కపి
జాలము గరిశరభసింహశార్దూలమృగా
భీలముఁ బుణ్యాకదంబవి
శాలము నగు నమ్మహేంద్రశైలము లీలన్. 7

వ. ఇట్లు మహేంద్రపర్వతంబుం గనుంగొని డాయం
జని యచ్చట. 8

ఉ. ఆతఱి వానరప్రవరు లాధరణీసుతఁ గానలేక దుః
ఖాతురులై వగం బడఁగ నయ్యెడఁ దగ్గిరినుండి వచ్చి సం
పాతియనంబ్రసిద్ధుఁడగు పక్షికులేంద్రుఁడు రావణుండు దా
సీతనుగొంచుఁబోవుగతి జెప్పుచుఁదెల్పెను లంకత్రోవయున్. 9

క. ఆపక్షీంద్రుని చేతను
జాపలశుభనేత్రి రామచంద్రుని దేవిన్
బాపాత్ముఁడైన దైత్యుఁడు
వే పట్టుక చనినత్రోవ విని కపులెల్లన్. 10

వ. మహానందంబు నొంది యమ్మహేంద్ర పర్వతం
బారోహించి పురోభాగంబున. 11

క. ఆకపివీరులు గనుఁగొని
రాకాశనదీప్రచుంబితార్భటభంగా
నీకమహాఘనరవభయ
దాకారనటత్ప్రకాశు నాజలధీశున్. 12

క. తమతమ సత్త్వస్థితులును
గమి యించెదు నబ్ధిఁ గోలఁదిఁ గనుఁగొని మదిలో
భ్రమయుచుఁ బలికెను గపిసం
ఘము లెంతయు డెందమందుఁ గళవళపడుచున్. 14

క. ఈవార్ధి దాఁట సత్త్వము
మావలనం జాల దింక మారుతి! వినుమా
పావని నగుటం జేసియు
నీవలనం దక్కనోరులు నేరరు దాఁటన్. 15

వ. అని యిట్లు ప్రార్థించినతోడనే యుబ్బి వారివచ
నంబులకు సమ్మతించి వాయుతనూజుం డిట్లనియె. 16

ఉ. పావనమూర్తి రామనరపాలకుపంపున నబ్ధి దాఁటెదన్
దేవవిరోధిదొంగిలిన దేవినిఁ జూచెదఁ గాన కుండినన్
లావున గడ్డతోఁ బెకిలి లంకయ తెచ్చెద నట్లు గానిచో
రావణుఁ బట్టి తెచ్చెదను రామునిసన్నిధి కెన్నిరీతులన్. 17

వ. అని వారిమనంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు
వక్కాణించి తనకుఁ దండ్రియైన వాయుదేవునకును దివ్యమూ
ర్త్యాత్మకుండైన లోకబాంధవునకును నిందునకును సంద్రమ్ము
నకును నమస్కరించి శ్రీరామలక్ష్మణులఁ దనమనఃపద్మంబు
నం దిడికొని మ్రొక్కి బంధుమిత్త్రులం గౌఁగిలించుకొని వారి
చేత దీవనలం బొంది గమనోన్ముఖుండై, 18

చ. మొగముబిగించిపాదములు మొత్తముగానటసూఁదిత్రొక్కి
నీ, టుగ మొగమెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహుల

త్యగణితలీలనూఁచి వలయంబుగ వాలముఁద్రిప్పి వ్రేఁగునన్
నగముసగమ్ముగ గ్రుంగఁగపినాథుఁడు నింగికి దాఁటె జవ్వనన్.

వ. ఇట్లు నింగికెగిరిపోవుచుండు సమయంబునఁ బావనికి నడ్డంబుగా మానవరూపంబున మైనాకపర్వతంబును సురస యను నాగజననియు ఛాయాగ్రాహిణియైన సింహికయును గనుపట్టిన నెల్లర నతిక్రమించి సువేలాచలంబునఁ గరిగి యక్కడ సలయిక దీఱ నొక్కయిక్కవ నించుక సేపు విశ్రమించియున్న సమయంబున. 20

ఉ. భేరికి సాటి యౌ దనుజభీషణ భాషలు భద్రనాగఘీం
కారనినాదముల్ హయనికాయపు హేషలు కాహళధ్వనుల్
వీరమృదంగనాదములు విశ్వభయంకరలీల లంకలోఁ
బోరుకలంగఁగా శ్వసనపుత్త్రుఁడు చాలఁగ నాలకించుచున్.

ఉ. కోటికిఁ గోట్లులై పరఁగు కుంజరవర్గము ఘోటకంబులున్
గోటికి నెక్కుడై పరఁగు గోత్రసమా    రథంబులున్
గోటికి హెచ్చులై పరఁగు ఘోరనిశాచరకోటికోట్లతో
సాటికినెక్కునప్పురము సాహసవంతుఁడు గాంచె ముందఱన్.

వ. ఇట్లాలంకాపుటభేదనంబున్ వీక్షించి తనమనంబున 23

శా. ఘోరాకారులు కామరూపులు మహాక్రూరాత్ములత్యుగ్రులీ
శూరుల్ వీరలఁ గన్నఁ బ్రామిపురిలోఁ శోధించులాగెట్లొకో
యీరూపంబునఁ బోవఁగాఁ గనిన వారెగ్గెంచి గావింతురో
నారీరత్నము సీత నందుఁ గనఁగా నాకెట్లు సిద్ధించునో. 24

వ. అని తలంచుచున్న యవసరమ్మున. 25

ఉ. క్రుంకెఁ బయోజబాంధవుఁడు గూండ్లకుఁ బక్షులు సేరె నెల్లెడన్
బొంకముతీసెఁ జామరలు పూచెను గల్వలు తారకావళుల్
బింకముఁ జూపెఁ గాంతి నళిబృందము కూర్కెఁ దమంబు బర్వె
నే, వంకను జారచోరగులు వాలి చరించిరి కౌతుకంబునన్.

వ. ఇట్లు నిశాసమయమునందుఁ దనమేటిగాత్రంబు బఁకు మాత్రంబుగా గుదియించి యగ్గిరి డిగ్గి చనుచు నల్లనల్లనఁ బురద్వారంబునొద్దకుఁ జేరి వానరకులపుంగవుండు పురప్రవేశంబు సేసి. 27

ఉ. మేడలు రచ్చకొట్టములు మిద్దెలు మచ్చులు నాటకూటముల్
మాడువు లంగళుల్ దనుజమందిరముల్ పురగోపురావళుల్
వాడలు దేవగేహములు వప్రచయంబులు వేశ్యవాటికల్
గోడలు నాదిగాఁగఁ గపికుంజరుఁ డప్పుడు చొచ్చి చూచుచున్.

క. మఱువులు సందులు గొందులు
నిరవులుఁ జొరరానిచోట్లు నేకాంతంపుం
దెరువులు నంతఃపురములు
వెరవున గపికుంజరుండు వెదకం జొచ్చెన్. 29

ఆ. గాలిలీల శీతకరకాంతివిఖ్యాతి
ధూమరేఖరీతిఁ దూఱి చొచ్చి
యసురమందిరముల నక్కడ నెక్కడఁ
గలయఁ దిరిగి వెదకెఁ గపివరుండు. 30

వ. ఇట్లు తిరిగి తిరిగి వెదకుచుఁ దనమనంబున. 31

క. మాయాబలుండు రాక్షస
నాయకుఁ డిటఁ బట్టి తెచ్చునాఁ డతని మహా
కాయము నుగ్రాకృతిఁ గని
తోయలి తన తనువు నెచటఁ దాఁగెనొ యకటా!

మ. అటుగా కీతఁడె యన్యదేశమున నాయబ్జాక్షిఁ బెట్టించెనో
ఘటయంత్రస్థితివార్ధిమధ్యమునఁదా గౌర్వ్యంబునన్ దాఁచె
నో, పటుబాహాబలశక్తి నాకభువనప్రాగ్దేశమం దుంచెనో
చటులోగ్రాకృతి రాముబాణములకున్ శంకించి యెందుంచెనో

వ. అని యీగతి వితర్కించి. 34

ఉ. త్రుంతు విధాతజందెములు ధూర్జటిశైలము వ్రత్తు విష్ణునే
వింతగ్రహంబులందిరుగ వేయుదుఁ బూర్ణపయోధు లేడుంగా
రింతు నుడువ్రజంబులఁ బొరిన్ గణియింతును భూతలంబుఁ గ్రు
క్కింతు నహీంద్రలోకమును గీడ్పడఁ జేయుదు సాహసంబునన్.

ఉ. కొట్టుదు నింద్రుఁ బావకుని గుండెలు వ్రత్తుఁ గృతాంతుఁ
జెండుదున్, మట్టుదు దైత్యునిన్ వరుణుమానముఁ గొందు
ను గాలిఁ దూలఁగాఁ బట్టుదుఁ గిన్నరేశ్వరుని ప్రాణము
కల్గుదు శూలిఁ దోలుదున్, జట్టలు దుంతు రావణుని
సాగసలోచనఁ జూపకుండినన్. 36

క. ఈమాడ్కిఁ జేయు దేవ
స్తోమమ్ములు చంద్రవదనఁ జూపెద రొండేన్

ఏమిటికిఁ గీడు తగ దని
రాముఁడు వలదనుచు మరలి రమ్మనుకొండెన్. 37

వ. అని యనేకపరీకారంబుల నాలోచింపుచు నొక్క గోపురం బారోహించె నాసమయంబున. 38

క. పావని కనుఁగొనె నప్పుడు
పావన విఖ్యాత సుగుణభావోపేతన్
సేవితదనుజవ్రాతన్
భూవనితాజాత నిత్యపూతన్ సీతన్. 39

వ. ఆరామంజూచి శ్రీరామచంద్రుని దేవినిగాఁ దలంపుచు నగ్గోపురంబునుండి డిగ్గి సూక్ష్మరూపంబుఁ గైకొని శింశుపా వృక్షం బారోహించి యందు. 40

సీ. పతిఁ బాసినట్టి యాపదకంటెఁ బలుమాఱు
వివిధమాయలచేత వేఁగి వేఁగి
వీరదానవకోటి వికృతవేషంబులు
కనుఁగొని చిత్తంబు కాఁగి కాఁగి
తనదిక్కులేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోఁగి లోఁగి
కర్ణకఠోరంబుగా నాడు మాటలఁ
దారఁగెడి కన్నీటఁ దోఁగి తోఁగి

ఆ. రాముఁ దలఁచుకొంచు రాముని బేర్కొంచు
రామ! రామ! యనుచు రమణి వలుకఁ

గపివరుండు సూచి కామినీరత్నంబు
సీత యనుచుఁ బొంగెఁ జిత్తమందు. 41

వ. అట్టి సమయంబున రావణాసురుండు సీతాపహృత హృదయుండై పన్నీట మజ్జనంబాడి దివ్యాంబరంబులు గట్టుకొని కర్పూరసమ్మిళితం బైన శ్రీగంధంబు మేనఁబూఁతఁబూసి పారిజాతపుష్పంబులు ముడిచి మస్తంబుఁదాపి నివ్వటిల్లెడు జవ్వాది మెత్తి దశశిరంబులయందును రత్నముకుటంబులు ధరించి మణిమండితంబు లగుకుండలములు పూని భానుప్రభా విలసితంబు లగుపతకంబులును ముక్తాహారంబులును భుజకీర్తులును బాహుపురులును నంగుళీయకంబులును నవరత్నఖచితంబగు నొడ్డాణంబును నమరించి చంద్రహాసహస్తుండై కందర్ప విలాస సుందరుం డగుచుఁ గిన్నరకింపురుషగంధర్వాసురోరగసిద్ధ విద్యాధరాంగన లుభయపార్శ్వంబుల నాలపట్టంబులు పట్టి మౌక్తికచ్ఛత్రంబులును తాలవృంతంబులును వింజామరంబులును ధరియించి రాఁగఁ గొందఱు కరదీపికాసహస్రంబులు గైకొని ముందఱ బిఱుంద నేతేర నశోకారామంబునకుఁ జనుదెంచె. నప్పుడు గంధవాతూలంబునం దూలు పుష్పలతయునుంబోలె వడవడ వడంకుచుఁ దనసుందరాంగంబులు హస్తోరువస్త్రకేశంబుల మాటియుఁ గప్పియు నడంచియు నిగురుగప్పిన నిప్పుచందంబున ధూళిధూసరం బగు రత్నంబు కైవడి మేఘచ్ఛన్నం బగు చంద్రబింబంబుచందంబున నిత్తడిపొదిగిన కుందనంపుశలాకలాగున నమాఱుపడి యున్న జానకిని గదిసి. 42

క. సీతను గనుఁగొని రావణుఁ
డాతతనయవాక్యఫణితి నతికుతుకమునన్
జేతోభవనిశితాంబక
పాతంబులఁ జాల నొచ్చి పలుకఁగఁ జొచ్చెన్. 43

లయగ్రాహి. తోయజదళాక్షి! వలరాయఁ డిటు లేచి పటు
సాయకము లేర్చి యిషు డేయఁగ దొడంగెన్
తోయదపథంబున నమేయరుచితోడ నుడు
రాయఁడును మించి వడఁగాయఁగఁ గడంగెన్
కోయిలల్లుఁ గీరములుఁ గూయఁగ నళివ్రజము
లేయెడలఁ జూచినను మ్రోయుచుఁ జెలంగెన్
నాయెడఁ గృపారసము సేయ కవివేకమున
నీయెడల నుండుటిది న్యాయమె లతాంగీ! 44

వ. అని మఱియును. 45

సీ. అలకేశ్వరుం డుపాయనముగా నిచ్చిన
యంచితచీనిచీనాంబరములు
దివిజాధినాథుండు దినదినంబును నిచ్చు
పారిజాతోల్లసత్ప్రసవములును
దక్షిణాధీశుండు తగఁ గానుక లంపిన
సురభికస్తూరాదిపరమళములు
పాతాళముననుండి ఫణినాథుఁ డొసఁగిన
పుత్తెంచినటువంటి భూషణములు

తే. గలవు నాయింట నేప్రొద్దుఁ గడిమ లేక
దేహపరితృప్తిఁ గావించి మోహ మలరఁ
గామకేళి సుఖంబులఁ గలయు టొప్ప
విడువు మడియాన రామభూవిభునిమీఁద. 46

సీ. ఎవ్వానివీటికి నేడువారాసులు
పెట్టనికోటలై పెచ్చుపెరుఁగు
నెవ్వానిసేవింతు రిందాదిదేవత
లనుచరబలు లయి యనుదినంబు
నెవ్వానిచెరసాల నేప్రొద్దునుందురు
గంధర్వ సుర యక్ష గరుడకాంత
లెవ్వానిభండార మిర వొంద విలసిల్లు
నవనిధానంబుల వివిధభంగి

తే. సకలలోకంబులును మహోత్సాహవృత్తి
నెవ్వనికిఁ జెల్లుఁ బుష్పల మెక్కి తిరుగ
నాకె తక్కంగఁ గలదె యేనాఁట నైన
మద్భుజాశక్తి ప్రతిపోల్ప నద్భుతంబు. 47

సీ. శ్వసనుండు లోఁగిలి సమ్మార్జనముఁ జేయు
నబ్ధినాథుఁడు కలయంపి సల్లఁ
బావకుం డరుదెంచి పాకంబు లొనరింప
శమనుండు వెసఁ బరిచర్యఁ జేయఁ
బాకారి కల్పకప్రకరంబు లొనరింప
దమజేశ్వరుండు కైదండ యిడఁగ

వరవాహనుండు దా నగరివెచ్చము వెట్ట
నీశానుఁడు విభూతి నెలమి నీయ

తే. గురుఁడు పంచాంగం మెప్పుడు సరవిఁ జెప్ప
నమరకిన్నరగంధర్వయక్షభుజగ
సిద్ధకింపురుషాంగనల్ చేరి కొలువ
వైభవంబునఁ జెలు వొందువాఁడఁ దరుణి! 48

ఉ. ఎత్తితి శంకరాచల మహీనబలంబున బంతిలాగునన్
మొత్తితి సర్వదిక్పతుల మూఁగినగర్వము నిచ్చి పాఱఁగా
నొత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున భూమి ద్రెళ్ళఁగా
మెత్తితి భోగికంఠము లమోఘుజనంబున మేటికీర్తులన్. 49

తే. జడలు ధరియించి తపసుల చందమునను
దమ్ముఁడును దాను ఘోరదుర్గమ్ములందు
క్రూరగాములు గూడుగాఁ గుడుచునట్టి
రాముఁ డేరీతి లంకకు రాఁగలండు. 50

ఆ. ఇంకఁ జేయు సేవ లీదంగ నోపరు
కట్ట లేరు చుట్టి పట్టలేరు
జలధి దాఁటు లావు చాలదు నరులకు
వచ్చు టెట్లు చెపుమ వారిజాక్షి ! 51

క. దానవు లెప్పుడు చూచిన
మానవులను గెలువఁ గలరు మది నూహింపన్
మానవభక్షకు లై మను
దానవులను గెలువ నరులతరమే జగతిన్. 52

క. జగదీశుఁడు మానవుఁడఁట
నగరే భుజశక్తిచేత నాకెదు రన్నన్
నగధరుఁడో నగధన్వుఁడో
నగభేదియొ కొంత కొంత నాతోఁ బోరన్. 53

వ. అసంగతి యట్లుండ నిమ్ము. 54

క. నీకన్నుల సౌభాగ్యము
నీకుచములఁ గలుగు మేలు నీముఖకాంతుల్
నీకరములలావణ్యము
నాకస్త్రీలందు లేవు నాకుం జూడన్. 55

మ. సురకాంతల్ సరిరారు యక్షసతులున్ సూటింపఁగా రారు కి
న్నరభామల్ ప్రతిరారు సిద్ధవనితల్ న్యాయంబుగాఁ బోలరా
గరుడస్త్రీలసమాన లెంతో చవుకల్ గంధర్వలోలాక్షులున్
మఱియేరీ నినుఁ జెప్పి చెప్పఁ దరుణుల్ మత్తేభకుంభస్తనీ!

క. పీడ యలంకారముగా
నాడుము భయ మ్ముడిగి మధురమైనమృదూక్తుల్
బేడిసల నేలుకన్నులఁ
జూడుము కనుఱెప్ప లెత్తి సుదతీ! నన్నున్. 57

వ. అని యిట్లు నోరికి వచ్చిన మచ్చునఁ బ్రేలుచున్న యానీచుని దుష్టభాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనకభూపాలనందన యిట్లనియె. 58

క. పతి దైవముగా నెప్పుడు
మతిఁ దలఁచుచు నుండునట్టి మగువలఁ జెఱుపన్

బ్రతిన గలయట్టినీతోఁ
బ్రతివచనము లాడుకంటెఁ బాపము గలదే. 59

క. పరదారాపేక్షకు లగు
పురుషుల కాయువు నశించుఁ బుణ్యము సెడు న
త్పురుషులు దూషింపఁగఁ దుది
నరకంబున బడుదు రనెడిన్యాయము వినవే. 60

వ. అదియునుం గాక. 61

క. తనసాహసంబు తానే
కొనియాడునతండు హీనగుణుఁ డని వినుచున్
నిను నీవ పొగడుకొంటివి
వినఁ గూడదు నీదునీతివిరహితభాషల్. 62

ఉ. సంగరరంగమందు నతిశౌర్యమునన్ రఘురాముతోడ మా
తంగతురంగసద్భటశతాంగబలంబులఁ గూడి నీవు పో
రంగను నోప కిప్పుడు విరాధఖరాదులపాటుఁ జూచియున్
దొంగిలినన్నుఁదెచ్చితివి తుచ్ఛపుఁబల్కులుపల్కఁబాడియే.

సీ. కూఁకటిముడికి నై కురులు గూడనినాఁడె
బెదరక తాటకఁ బీఁచమణఁచె
గాధేయుఁ డొనరించుక్రతువును రక్షింపఁ
బెక్కండ్రుదైత్యుల నుక్కణంచె
నవనిపై విలసిల్లు నఖిలరాజన్యులు
వేగ్రిలఁ జూపఁగ లేని విల్లు విఱిచె

ఘోరాటవులలోనఁ గుహ్రిమ్మరుచునప్పుడు
ఖరదూషణాది రాక్షసులఁ జంపెఁ

తే. బాదరజమున నొకకాకిఁ బడఁతిఁజేసె
లీల మాయామృగంబును గూలనేసె
రాజమాతుర్ణ్డె మేదినీరక్షకుండు
రామభూపాలుఁ డాదినారాయణుండు. 64

తే. అట్టిరామున కీయబ్ధి యనఁగ నెంత!
లంక యన నెంత! దనుజులపొంక మెంత!
నీ వనఁగ నెంత! నీలావుచేవ యెంత!
చెప్ప నేటికి నీవె చూచెదవు గాక ! 65

శా. వీరాలాపము లాడ నేల వినుమీ విశ్వప్రకాశంబుగాఁ
బారావారముఁ గట్టి రాఘవుఁడు కోపస్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజిన్ నినుడాసి లావుకలిమిన్ గోటీరయుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబులమస్తముల్ దునిమిభుక్తుల్ వెట్టుభూతాళికిన్.

శా. ఆరూఢప్రతిమానవిక్రమకళాహంకారతేజోనిధిన్
శ్రీరామున్ సుగుణాభిరాముఁదెగడన్ జేకొన్ననిన్నాజిలో
దారన్ దొంగిలితెంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప ము
న్నీ శైలనుదాఁటివచ్చు నలుకన్ నేఁడల్లి శాంతింపుమా!

వ. అని తమ్ముఁ జీరికిం గొనక వీరాలాపంబులాడ నారావణుం డొడుపునప్పిన కాలాహిచందంబున నుగ్రుండై మండిపడి యిట్లనియె. 68

క. ఆటఁదిగా యని కూరిమి
పాటించినకోలఁది నన్నుఁ బలుకగఁ జొచ్చెన్
మాటాడకుండ నాలుక
తూటులుగాఁ జేయకున్న దోసము గాదే! 69

క. కుయ్యాడక నాముందరఁ
గయ్యమునకుఁ గాలు దువ్వఁ గడగెను దీనిన్
దయ్యాలకు బలి వెట్టెద
వ్రియ్యాలుగా నతికి మెల్లవారును జూడన్. 70

క. కాకున్న దీని బలిమిని
జైకొని నాకాంక్ష దీఱ భ్రావజకేళిన్
జేకొనక విడిచిపెట్టినఁ
గైకొనునే నవ్వఁగాక గర్వము పేర్మిన్. 71

శా. భీమాటోపభుజప్రతాపమహిమన్ భీమాచలం బెత్తిన
త్రామాద్యష్టదిగీశ సైన్యముల సంగ్రామంబులోనోర్చి యు
ద్దామపౌఢిఁ జెలంగుచుండెడుకళా ధాముండనాముండటన్
రామున్ గీముని జెప్ప గిప్ప నగరా రాకేందుబింబాననా!

సీ. అఖిలలోకముల నాయాజ్ఞ నిల్పితి నేక
హేలను బుష్పకం బెక్కి తిరిగి
వేల్పుమూఁకలచేత వెట్టి సేయించితి
దితివంశవల్లభుల్ నుతులు సేయ
గణములతోఁగూడ గైలాస మెత్తితి
బటువైన పూవుల బంతివగిది

వనజగర్భునిచేత వరములు గైకొంటి
దండిగా నత్యుగ్రతపము సల్పి

తే. చెఱలు పట్టితి గంధర్వసిద్ధసాధ్య
భుజగసుర యక్షకిన్నర ముఖ్యసతుల
నిట్టి సామర్థ్య మెవరి కేనాఁడు గలదు
మహిని నాకొక్కనికె కాక మంజువాణి! 73

తే. నాకు నెదిరింప నొక పేదవరుని నొడ్డి
వెఱవ కీరీతి దుర్భాష లఱచు దీని
జిహ్వ మొదలంటఁ బట్టి యీశితకరాగ్ర
ధారఁ దునుమాడి ధారుణిఁ బాఱనైతు. 74

వ. అని చంద్రహాసంబు జంకించి లేవ నుంకించుతఱిఁ గొందరు ప్రియసుందరు లడ్డంబు సొచ్చి. 75

చ. సురవరుఁడో ధనంజయుఁడొ సూర్యతనూజుఁడొ యాతుధానుఁ
డో, శరధివిభుండొ గాఢస్ఫురశాసనమిత్రుఁడొ భోగిభూషణుఁ
డో, గురుభుజశక్తిఁ గైకొనుచు గోపము సూపఁగ నీకు నెంతయు
త్తరుణి పయిం బ్రతాపమున దారుణకృత్యము సేయఁగూడునే!

క. ఏటికి మీ రిటు కినియఁగ
గాటపు [illegible] గరువాలున కీ
యాటది యెవ్వతె [illegible] నీ
మాటికి మన్నించి కావుమా యని జాలున్. 77

వ. అని శాంతవచనంబులం బ్రియంబు సెప్పిన నప్పంకరుహాక్షుల విన్నపంబులు మన్నించి యారాక్షసచక్రవర్తి వైదే

హింకఁగావలియున్న యేకజటా ద్విజటా త్రిజటా దుర్ముఖి వా యుముఖి శూర్పణఖ లాదిగ గల దైత్యకామినుల వంక గనుంగొని. 78

క. గడువిచ్చితి నిరుమాసము
లాడఁబడుపుడు నేర్చినట్టు లాడబడ కున్నన్
గడికండలుగాఁ గోసుక
పడఁతులు భక్షింపుఁ డింతిపలలం బంతన్. 79

వ. అని రోషారుణితనేత్రుండై యుత్తిభీషణ కారంబుఁ దాల్చి పలికిన, 80

క. తనపతి నిందించుటకును
దనప్రియమ్ములు చెప్ప వినక తక్కినవాదన్
దనుఁ జంపుఁ డన్నమాటకు
నినకులవల్లభుని దేవి యేడ్చెన్ బెలుచన్. 81

సీ. జానకి శోకింప సాధ్యకిన్నరయక్ష
గరుడోరగామరకాంత లెల్ల
వెంటనే శోకింప విని గంధవహపుత్రు
డాత్మలోఁ జింతించి యాగ్రహమున
నీదుష్టదైత్యుపై నిప్పుడే లంఘించి
చెండాడ నాచేతఁ జిక్కనేని
కార్యంబు లెస్సగుఁ గాక సత్త్వము తూలి
బలువిడి వీసిచే బడితినేని

తే. సీతఁ గానంగ లేక కృశించి రాము
భద్రుఁ డడఁగిన సీతయుఁ బ్రాణ మొడలు

లక్ష్మణుండును జూడ నాలస్య ముడిగి
తెగును నశ్లైన గార్యంబు తెలుఁగు దప్ప. 82

చ. అని పవనాత్మజుండు దివిజారిపయిం దెగ వేళ గాదు భూ
తనయకు నాదురాక వసుధావరుమేలు నెరుంగజెప్పి మీఁ
దను మఱి చూతమంచు నుచితస్థితి నూరక యుండెనప్పుడా
దనుజవిభుండు వోయె నిజధామముఁ జేర సతీసమేతుఁడై.

వ. అప్పుడు యామినీచరకామినులు రావణానుమతం
బున ననేకవిధంబులగు మధురాలాపంబుల మిథిలాధీశకుమా
రింగురించి బోధించి కార్యంబు సాధింపనోపక యలసియుంటం
జేసి యొక్కింతసేపు నిద్రించుచుండ మేల్కని త్రిజట యను
నిశాచరి యిట్లనియె. 84

మ. కలగంటిన్ వినుఁడింతులార! మనలంకాద్వీప మీయబ్ధిలో
పల గ్రాలన్ మనరావణేశ్వరుని శుంభద్రత్నకోటీరముల్
కలనన్ గూలరఘూద్వహుండెలమితో గంధద్విపం బెక్కియు
జ్జ్వలకాంతిన్ విలసిల్లుసీతఁ గొనిపోవన్ మిన్నకే నిప్పుడే.

క. శుద్ధాత్ముఁడైన రాముఁడు
శుద్ధాంతపు దేవి గాన శుభసూచకముల్
శుద్ధముయి తోఁచుచున్నవి
సిద్ధం బీమాట వేదసిద్ధాంతముగాన్. 86

క. కావున నిక్కోమలియెడఁ
గావలి యున్నట్టిమీరు కఠినోక్తులుగా

నేవియు నాడకుఁ డింక నీ
దేవియ రక్షింప మనకుఁ దిక్కగు మీఁదన్. 87

వ. అని చెప్పి మఱియును. 88

క|| అమ్మా వెఱవకు మదిలో
నిమ్మగ మఱి వేడ్క నుండు మిఁకఁ నీమగఁడున్
నెమ్మిగ నిన్నుఁ గొనిపోవును
నమ్మందఱ మనుపు మమ్మ మఱవక కరుణన్. 89

ఆ. అనుచు దనుజకాంత లంతంత నెడఁబాసి
నిదుర నోయి రంత నదరి సీత
తనకు దిక్కు లేమిఁ దలపోసి దుఃఖింపఁ
బవనసుతుఁడు మనుజభాషఁ బలికె. 90

క. ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁ డిదె కపులఁ గూడి యురుగతి రానై
యున్నాఁడు నిన్నుఁ గొని పో
నున్నాఁ డిది నిజము ముర్వీతనయా! 91

సీ. ఆమాట లాలించి భూమిజ తనలోన
వెఱఁ గంది శింశుపావృక్ష మరసి
చూడంగ నప్పుడు సూక్ష్మరూపంబున
నాడికపూ శాఖలనడుమ నున్న
కపికుమారునిరూప మపరూపముగఁ జూచి
స్వాంతంబులోని హర్షంబు నొంది

దనుజమాయలచేతఁ దఱచు వేగుట జేసి
మాఱాడ నేరక యూఱకున్న

తే. భావ మూహించి తన్ను నాదేవి యాత్మ
నమ్మకుండుటఁ దెలిసి యాకొమ్మవిూఁది
నుండి క్రిందికి లంఘించి నిండుభక్తి
మ్రొక్కి నిలుచుండి కరములు మోడ్చి పలికె. 92

ఉ. తమ్మునిఁగూడి పుణ్యగుణధాముఁడు రాముఁడువచ్చి మా
ల్యవం । తమ్మున సైన్యసంఘము ముదంబునఁ గొల్వఁగ
నుండి భూమిపై । మిమ్ములఁ జూచిరండనుచు మేటికపీం
ద్రులఁబుచ్చి యందు మొ । త్తమ్ముగ మమ్ముగొందఱను
దక్షిణభాగముచూడఁ బంపుచుఁన్. 93

క. అంగనఁ బొడగన నీ వి
ప్పుంగను గడుఁ జాలువాఁడ వంచును నాచే
నుంగర మంపెను శ్రీరఘు
పుంగవుఁ డిదె కొమ్మటంచు భూమిజ కిచ్చెన్. 94

ఉ. ఇచ్చినఁ జూచి రామధరణీశ్వరుముద్రికగా నెఱింగి తా
నిచ్చను మెచ్చి యాకువలయేక్షణ యాత్మగతంబునందు నీ
వచ్చినదానిభావమును వల్లభుచందము నేర్పడంగ నేఁ
జెచ్చెర నంతయుం దెలియఁజెప్పుమునమ్మికపుట్టునట్లుగన్.

వ. అని విచారించి యిట్లనియె. 96

క. నిను విశ్వసింపఁ జాలను
వినుపింపుము నీతెఱంగు విభునివిధము నా

కనవుడుఁ బావని తెలియఁగ
వినయంబున విన్నవించె విస్ఫుటఫణితిన్. 97

ఉ. రాముని డాఁగురించి విను రావణుఁ డెత్తుక వచ్చువేళ నీ
హేమవిభూషణావళుల నేర్పడ ఋశ్యమహాద్రిపై జిరన్
మే మవి తీసి డాఁచితిమి మీపతి యచ్చటి కేఁగుదేరఁగా
దామరసాప్తనందనుఁడు తానవి చూపినఁ జూచి మెచ్చుచున్.

సీ. అర్కసంభవునకు నభయంబు దయజేసి
దుందుభికాయమ్ముఁ దూలఁ దన్ని
యేడుతాడుల సర్వ మేకమ్ముగాఁ ద్రుంచి
వాలి దద్భుతశక్తి కూల నేసి
సుగ్రీవునకుఁ దార సుదతిగా నిప్పించి
యంగదు యువరాజుగ నిలిపి
వారలతోడను వానరసైన్యంబు
లేన్నని గొలువంగ నేఁగుదెంచి

తే. మాల్యవంతంబునం దుండి మనుజవిభుఁడు
నిన్ను వెదకంగ వందల నన్ని దిశలఁ
బనుచునప్పుడు దక్షిణభాగ మరయ
నంగదునితోడఁ గొందఱ మరుగు పేర్చ. 99

తే. వారిపంపున నవలీల వార్ధి దాఁటి
వచ్చి సకలంబుఁ జూచి యీవంకఁ గంటి
రావణుండు వచ్చి నిన్ను నుగ్రంబుగాఁగఁ
బలుకు నప్పుడు నున్నాఁడఁ బాదపమున. 100

వ. ఇవ్విధంబునఁ బలుకుచుండినను నమ్మక యతనిం గనుఁగొని రాముఁ డేరీతివాఁడో యతనిచందం బెఱింగింపు మనవు డావాయువందనుండు రఘునందనునకు వందనం బాచరించి భూమినందన కిట్లని చెప్పుచున్నాఁడు. 101

సీ॥ నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జపత్త్రనేత్త్రములవాఁడు
కంబునన్నిభమైన కంఠంబు గలవాఁడు
బాగైనయట్టిగుల్ఫములవాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాఁడు
ఘనమైనదుందుభిస్వనమువాఁడు
పద్మరేఖలు గల్గుపదయుగంబులవాఁడు
చక్కనిపీనవక్షంబువాఁడు

తే. కపట మెఱుఁగనిసత్యవాక్యములవాఁడు
రమణి! రాముండు శుభలక్షణములవాఁడు
ఇన్నిగుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్త్రి బంగారువన్నెవాఁడు. 102

తే. ఉరుతరాటవిలోన మహోగ్రతపము
వాయుదేవుని గుఱియించి వరుసఁ జేసి
యంజనాదేవి గనియె నన్నర్థితోడ
నర్కజునిమంత్త్రి హనుమంతుఁ డండ్రు నన్ను. 103

వ॥ అనియిట్లు దాత్పర్యంబునఁ బట్టునట్లుగా విన్నవించి దేవీ!నీదేవుం డయిన శ్రీరాముఁడునాచేతి కిచ్చి యంపినయూత్న

రత్నాంగుళీయకంబు నీకు సమర్పించితి నింక నాకు రిక్తహస్తం
బులతోఁ జనుట దూతల కుచితమైన కార్యంబుగాదు గావున
నిన్ను దర్శించినందులకు శ్రీరామునకును నమ్మిక పుట్టునట్టు
లుగా నీశిరోరత్నంబు దయచేయవలయు ననుటయు నా
కుశేశయనయన యిట్లనియె. 104

క. నానాథు క్షేమ మంతయు
ధీనిధి! నీచేత వింటిఁ దెలియఁగ నైనన్
నీనిజరూపము చూడక
నేనారత్నంబు నమ్మి నీ కీయఁజూమీ. 105

వ. అనుటయు నాహనుమంతుఁడు. 106

క. చుక్కలు తలపూవులుగా
నక్కజముగ మేను వెంచి యంబరవీథిన్
వెక్కస మై చూపట్టిన
నక్కోమలి ముదము నొందె నాత్మస్థితికిన్. 107

వ. ఇట్లు తనమహోన్నతరూపంబు చూపి యెప్పటి
యట్ల మరల సూక్ష్మరూపంబు గైకొని నమస్కరించిన నాహ
నుమంతునకు నద్దేవి తనశిరోరత్నంబునను గ్రహించి యిట్లనియె,

చ. రవికులవార్ధిచంద్రుఁ డగురాముని సేమము చాలవింటి నా
వివిధము లైనపాట్లు పృథివీపతికిన్ దగఁ జెప్పఁ గల్గె నేఁ
డవిరళభంగి నీవలన నచ్చుగ నే నుపకార మేమియున్
దవిలి యొనర్ప లేను వసుధాస్థలి వర్థిలు బ్రహ్మకల్పముల్!

వ. ఇట్లు దీవించి మఱియును. 110

క. ఏయెడఁ జూచిన ధరణీ
నాయకు శ్రీపాదయుగము నాచిత్తములో
ఛాయ దని విన్నవింపుము
వాయుతనూజుండ! పుణ్యవంతుఁడ! తెలియన్. 111

తే. ఇపుడు రావణుఁ డేతెంచి కపటబుద్ధి
గర్వమునఁ జేసి నన్నన్ని కాఱులాడె
నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు
పతికి దయ పుట్టఁగా విన్నపంబు సేయు. 112

సీ. నిడుద పెన్నెఱివేణి జడలుగా సవరించి
మలినజీర్ణాంబరం బొలియఁ గట్టి
భూమిరజంబు విభూతిపూఁతగఁ బూసి
తనదివ్యమూర్తిఁ జిత్తమున నిల్చి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మమంత్రంబుఁ బఠింపుచుఁ
గఠినరాక్షసదుర్మృగములలోన

తే. నహితలంకామహాద్వీపగహనసీమఁ
దపము సేయుచు నున్నాను తన్నుఁ గూర్చి
వాకుఁ బ్రత్యక్ష మగు మని నాథునకును
విన్నవింపుము సత్త్వసంపన్న! నీవు. 113

వ. అని చెప్పి మఱియును. 114

చ॥ జనకనిభంగి రామనృపచంద్రుని నన్నును దల్లిమాఱుగాఁ
గని కొలువంగ నేర్చుగుణగణ్యుని లక్ష్మణు నీతిపారగున్
వినఁ గన రానిపల్కు లవివేకముచేతను బల్కినట్టియా
వినుతమహాఫలం బనుభవించితి నంచును జాటి చెప్పుమా.

క. ఆమాటలు మది నుంచక
నామానముఁ గావు మనుచు నయవినయగుణో
ద్దాముఁడు రాముని తమ్ముఁడు
సౌమిత్రికి జెప్పవయ్య సాహసివర్యా! 116

వ. అని యిట్లు జనకరాజతనయ పలికినపలుకులాలకించి హనుమంతుం డాజననితో నిట్లనియె. 117

క. ఇనుఁ డుదయించకమున్నే
వననిధి లంఘించి మనుజవల్లభుకడనున్
నినుఁ గొనిపోయెద వీఁపున
జననీ! కూర్చుండు మనిన సంతోషమునన్. 118

క. నీ వంతవాఁడ వగుదువు
నీవెంటనె వత్తునేని నెగడవు కీర్తుల్
రావణునికన్న మిక్కిలి
భూవరుఁడే దొంగ యండ్రు బుధనుతచరితా! 119

వ. అదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటుదానం గాను గావున నీతో రాఁదగదు మఱియును. 120

క. దొంగిలి తెచ్చినదైత్యుని
సంగడు లగువానివాని సాహస మొప్పన్
సంగరముఖమునఁ జంపక
దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్. 121

వ. మఱియు రామచంద్రుండు త్రిజగదేకవీరుండును గోదండదీక్షాగురుండును రాక్షసకులాంతకుండును నగుటం జేసి రాణివాసద్రోహి యగు రావణుని సంగర రంగంబునఁ బ్రఖ్యాతంబుగాఁ జంపి కొనిపోవుట ధర్మంబు. నీవు రామచంద్రునకుఁ బరమభృత్యుండవును బుత్త్రసముండవును నగుటం జేసి నీవెంట నరుదెంచుట తప్పు గాకపోయినను బగ తీర్పక వచ్చు టుచితంబుగాదు కావున నీవు రాఘవేశ్వరుల కిన్నియుందెలియ విన్నపంబు సేసి తడయక తోడ్కొని రమ్మనిన నద్దేవికి నమస్కరించి హనుమంతుం డిట్లనియె. 122

ఉ. నీవిభుఁడబ్ధి దాఁటి ధరణీతలనాథులు సన్నుతింప సు
గ్రీవసుషేణముఖ్య బలబృందముతో నరుదెంచి నీచునిన్
రావణు నాజిలోఁదునిమి రాజసమొప్పఁగ నిన్నుఁగొంచు సే
నావళితోడ నీపురికి నారయ నేఁగు నిజంబునమ్ముమా. 123

వ. అని విన్నవించి నమ్రుండై యద్దేవిచేత దీవనలు బొంది మరలి చనుచున్నవాఁడై తనరాక రావణున కెఱుంగఁ జేయవలయు నని తలంచి, 124

సీ॥ మేదిని సమముగా మేడలు గావించి
కేళీగృహంబుల నేలఁ గలిపి

కమలాకరంబులు కలఁచి గారలు వెట్టి
వృక్షజాతంబుల విఱుగఁ దన్ని
పుష్పగుచ్ఛంబులు పుడమికి పాఱఁగ వైచి
తేనెలు రాల్చి పూఁదేనె లుడిపి
పొదరిండ్ల పొదవులు చదియఁగా నుగ్గాడి
చప్పరంబుల నేల చదును జేసి

తే. వనముఁగాచెడి రాక్షసవర్గములను
వీరవరులను నెనిమిది వేలఁ జంప
సీతఁ గాచెడి రాక్షసస్త్రీలు బెదరి
పాఱిపోయిరి రావణుపాలి కంత. 125

వ. ఇట్లు రావణుం జేరి వారు. 126

క. దేవా ! నేఁ డొకమర్కటుఁ
డేవిధమున వచ్చినాఁడొ యెఱుఁగము సీతా
దేవిఁ గని మాటలాడియుఁ
బోవుచు వన మెల్లఁ బెఱికి పోయిడి కడఁకన్. 127

తే. వనముఁ గాచెడి రాక్షసవర్గములను
దండి నొకనిని మిడి వోవ కుండఁ బట్టి
వేటిభుజశక్తి నందఱఁ గీటడంచి
వాలి యున్నాఁడు సాహసవంతుఁ డగుచు. 128

వ. అని విన్నవించినంతనే క్రోధరక్తాంతలోచనుం డగుచు నప్పింశతిలోచనుండు విచారించి వాఁడు రాముని

పంపున వచ్చినదూత కాంబోలు వానిఁ జంపుఁ డని పదివేల
రాక్షసులం బంపిన. 129

క. ఉగ్రాకారుం డగుచు ద
శగ్రీవుం డనుప దనుజసంఘంబులు దా
మాగ్రహమునఁ జనుచు బలో
దగ్రోగ్రాత్ము లగుచుఁ దాఁకిరి కడిమిన్. 130

ఉ. తాఁకిన యంత వాయుజుఁడు తా నదలించి కఠోరరేఖతో
వీఁక నెదిర్చి పేర్చి రణవీథి నిశాచరసైన్య మెల్ల నో
క్రూఁకున వెంటనంటి సమనోగ్రబలంబున బాఱఁ బాఱఁగాఁ
దోఁకనుజుట్టి మోఁదెబలు దుర్గములందును మ్రాఁ డెనందఱన్.

క. అందునఁ జావక మిగిలిన
కొందఱు పఱతెంచి యసురకొల్వున మొఱ్ఱో
యందఱ మ్రింగెను దానవు
లందఱకును వీఁడు దారుణాంతకుఁ డగుచున్. 132

వ. అని విన్నవించిన రాక్షసేశ్వరుండగు రావణుండు మండిపడి పింగాళాక్షుని దీర్ఘజిహ్వుని నశ్మవక్షుని శార్దూలముఖుని వక్రనాసునిఁ బనిచిన వారును దమతమబలంబులం గూడుకొని రథారూఢులై వచ్చి యార్పుచుం దాఁకి శస్త్రాస్త్రంబు లడరించిన నవి యెల్ల లెక్కగొనక యక్కరువలి కొడుకు దర్పంబునం జేర్చి వాల మల్లార్చి యెదిర్చినబలంబున బలువిడిఁ గాఁదోలి పింగళాక్షునిఁ ద్రుంచి దీర్ఘజిహ్వుని

దీర్ఘనిదప్రుచ్ఛ వక్రనాసుని, ఛత్రాకృతముంబున జూర్ణంబుసేసి యశ్మవక్షుని భస్మంబుఁ జేసి శార్దూలముఖుని మర్దించి నిర్వక్రపరాక్రమంబున గర్జించి మరలి మకరతోరణంబు నారోహించి యార్చుచున్న సమయంబున. 133

క. చావక మిగిలిన దైత్యులు
రావణుకడ కేఁగి వేగ రాహుత్తులపా
ట్లా వాయుజుసాహసమును
వేవిధములఁ జెప్ప నతఁడు విస్మయపడుచున్. 134

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్షణములం గ్రోధానలజ్వాల లు
త్కటలై మీవర్యమంత్రిసూనులమహాగర్వాంధులన్ గ్రూరుల
న్పటుబాహాబలు లార్వురం బనిచె శుంభద్విక్రమాటోపము
ర్కటపారీంద్రము మీఁద నుద్దవిడి సంగ్రామంబు గావింపఁగన్.

వ. ఇట్లు పనిచిన నాయార్వురును, 136

సీ. శతకోటివిక్రమప్రతి మానుఁడైనట్టి
తరశజహ్వుఁ డత్యంతసాహసుండు
రోషానలాభీల శేషాహి యైనట్టి
రుధిరాక్షుఁ డత్యుగ్రరూపయుతుఁడు
పరసైన్యకాననపావకుండైనట్టి
రక్తరోముఁడు మహారణబలుండు
కఠినశాత్రవలోకగజసింహుఁడైనట్టి
శూలదంష్ట్రుఁడు ప్రళయకాలయముఁడు

తే. వ్యాఘ్రికబళుండు పృథుతర వైరిజయుఁడు
స్తనితహస్తుండు సాహసోదారబలుఁడు
వీర లార్వురు నత్యుగ్రవేషములను
రూఢి వెడలిరి ఘనరథారూఢు లగుచు. 137

క. తమతమబిరుదులు నెఱపుచుఁ
దమకంబున వెడలి రథికతండము గొలువన్
ఘుమఘుమభేరీరవసం
భ్రమములతో మంత్రిసుతులు పావనిమీఁదన్. 138

వ. ఇట్లు కదిసి సింహనాదంబు లంబరంబునం జెలంగ
గజతురంగశతాంగసుభటనికరంబుం గూడి శస్త్రాస్త్రంబులం
బొదివిన, 139

తే. వాల మల్లార్చిన బ్రహ్మాండగోళ మెల్ల
నగలనార్చుచు భుజయుగం బప్పళించి
రణము చేయంగ మకరతోరణము డిగ్గి
మంతు కెక్కినయాహనుమంతుఁ డంత. 140

సీ. ఒక్కొక్కరథముతో నొక్కొక్కరథమును
విటతాటనంబుగా విఱుఁగ గొట్టి
యొక్కొక్కగజముతో నొక్కొక్కగజమును
జాఁపచుట్టగఁ బట్టి చావఁ గొట్టి
యొక్కొక్కహయముతో నొక్కొక్క హయమును
గడిమితో నలినలిగాఁగఁ గొట్టి

యొక్కొక్కభటునితో నొక్కొక్కసుభటుని
వడిఁ ద్రిప్పి చెక్కలు వాఱఁ గొట్టి

తే. బాహుబలగర్వమునఁ జేర్చి ప్రధనసీమ
మంత్రిసూనుల నార్వుర మడియఁ గొట్టి
మకరతోరణమున విక్రమమ్ము మెఱయ
భీకరాకారుఁ డై యుండెఁ బెచ్చుపెరిఁగి. 141

క. ఆరణవీధిని నిలువక
పాఱిన హతశేషు లెల్ల బల్విడి రాజ
ద్వారమున బొబ్బ లిడి రా
ఘోరాజిని మంత్రిసుతులు కూలి రటంచున్. 142

వ. వారిపాటు విని రావణాసురుం డదరిపడి యాజ్యా
హుతిం బ్రజ్వరిల్లుహుతాశనుంబోలి మండిపడి ప్రహస్తతనూజుం
డగు జంబుమాలింగని నీ వా వానరాధముని వధించిశీఘ్రమ్ము
రమ్మని యనిపిన. 143

ఉ. అప్పుడు జంబుమాలి భయదాకృతి వీరరసాప్తిఁగన్నులన్
నిప్పులు రాలఁ బేరలుక నిండుగ నూర్పులు పర్వఁజిత్రమై
యొప్పుగఁ దొప్పుచున్ రణమహోత్సుకుఁడై గజవాజిబృందముల్
విప్పుగ వెంట రాఁగఁ గపివీరునెదుర్కొని విక్రమంబునన్.

క. అదలించి వాయునందనుఁ
బ్రిదరంబుల నేయ నంతఁ బవనజుఁ డలుకన్
గొదగొని బలముల నన్నిటిఁ
జదియంగా మోదె నొక్కసాలముచేతన్. 144

ఆ. రథము నుగ్గు సేసి రథసారథినిఁ జంపి
రథతురంగములఁ బృథులశక్తి
బట్టి వాలములను బడఁ గొట్టి చంపిన
జంబుమాలి కినిసి సాహసమున. 146

క. అడిదంబును గదయును గొని
పుడమికి లంఘించి వాయుపుత్త్రునినిటలం
బెడపక వ్రేసిన ధరణిం
బడి మూర్ఛ మునింగి తెలిసి బలయుతుఁడగుచున్.

క. ఆలంబున నాతనికర
వాలంబును ద్రుంచివైచి వరభుజశక్తిన్
నేలం గూల్చెను విక్రమ
శాలిన్ వడి జంబుమాలి సాహసశీలిన్. 148

ఆ. అట్లు జంబుమాలి యత్యంతబలశాలి
గర్వ మెల్లఁ దూల కలన వ్రాలి
పోలిసె ననుట దైత్యపుంగవుఁ డాలించి
యాత్మ సంచలింప నాగ్రహించి. 149

క. సాహసము వెలయ సమరో
త్సాహంబున దుష్టకపినిఁ జంపు మటంచున్
బాహుబలాఢ్యుని నరినిక
రాహవసంహారు వీరు నక్షకుమారున్. 150

వ. అంపిన నతండు. 151

సీ. చిత్రమాణిక్యరంజిత వేత్రవిభవంబు
భానుకోటిప్రభాభాసితంబు
భీకరధ్వజదండబిరుదాలవాలంబు
శస్త్రాస్త్రపరికరసంయుతంబు
బంధురాధికజనబహుహయోపేతంబు
కుటిలదిక్పాలదృగ్గోచరంబు
ఘననభోమార్గవిఖ్యాతైకగమనంబు
పరతపోలబ్ధాతిపైభవంబు
తే. నైన రథమెక్కి మదవారణౌఘసుభట
వీరహుంకారఝుంకారవార ములియఁ
గదలె హనుమంతుపైకి నాగ్రహ మెసంగ
మదముదైవార నక్షకుమారుఁ డలుక. 152
క. అటు చని పావనిఁ గని ది
క్కటములు పెదరంగ నార్చి దండడి భూభృ
త్తటముపయిఁ గురియువర్షో
త్కటధారలరీతినంపధారలు గురిసెన్. 153
ఉ. వాయుజుఁడప్పుడంపగమివాలముఖంబునద్రుంచె ద్రుంచినన్
వాయుజుమీఁదఁ గ్రమ్మఱ నవార్యబలంబున నేసె నేసినన్
వాఁయుజుఁ డుగ్రుఁడై తునిమె వానిశరావళినెల్లఁ బిమ్మటన్
వాయుజునాట నేసెఁ గడువాఁడిశరంబులనక్షుఁ డుద్ధతిన్ 155
వ. ఇట్లేసిన.

ఉ. తాలమహీజరాజి రథంబును గూలఁగ మోదె మోదినన్
నేలఁ బదాతియైనిలిచి నేర్పున వాఁడు శరాళి మారుతిన్
ఫాలము నొంచె నొంచినను బావనిమూర్ఛిలి తేఱి దానవున్
దూలఁగ ముష్టిచేఁ బొడిచెదోర్బలశక్తి రణాంగణంబునన్.

సీ. పొడిచిన మూర్ఛిల్లి వడిఁ దేఱి దైత్యుండు
గదగొని వైచె వక్షంబు పగుల
వైచిన మారుతి వడి వానిగదఁ బుచ్చు
కొని వానిదేహంబుఁ గుదియనేసె
నేసినఁ దనవీఁక నొసరంపక వాఁడు
గగనంబు కెగసె నాక్షణమునందె
వాయుతనూజుండు వదలక తనవెంట
నెగసిన గదగొని యేసె నతని

తే. నతఁడు గదఁ ద్రుంప ఖడ్గాన నతులశక్తి
వాఁడు మారుతితోడలు నొవ్వంగ నడఁచె
నంత సోలుచు నాహనూమంతుఁ డెగిరి
పట్టుకొని వాని భూమిపైఁ గొట్టిచంపె. 157

తే. అంత హతశేషు లగువార లరుగుదెంచి
సంభ్రమంబున దానవచక్రవర్తిఁ
గాంచి కొలువెల్ల సందడిగాఁగ నపుడు
బహువిధంబుల హనుమంతుఁ బ్రస్తుతించి. 158

సీ. అక్షుండు తెగె నశ్వవక్షుండు తెగటాఱె
రక్తరోముఁడు నీల్గె రణములోన

స్తనితహస్తుఁడు మ్రగ్గె శార్దూలముఖుఁ డీల్గె
గింకరవర్గంబు గీటడంగె
శార్దూలకబళుండు చచ్చె దుర్జయుఁ డేఁగె
శతమాయుఁ డొరిగెను సమసె వక్రి
నాసుండు మఱి రక్తనాసుండుఁ గడతేఱె
శూలదంష్ట్రుఁడు నేలఁ గూలిపోయె

తే. మడిసె యూపాక్షుఁ డట జంబుమాలి తునిఁగెఁ
బింగళాక్షునిపే రంత బిలముసొచ్చె
వనముకావలిరాక్షసవర్గ మడఁగె
దీర్ఘజిహ్వుండు నేటితోఁ దీఱిపోయె. 159

వ. అని వేఱువేఱ విన్నవించిన నసురేంద్రుఁడు విని తనమనంబున. 160

మత్త. వీని వానరుఁ డంచు నిక్కము విశ్వసింపఁగఁ జెల్ల దీ
దానవావళి మ్రింగఁబుట్టిన దయ్యమో యటు గాక వై
శ్వానరుం డిటువంటి రూపున వచ్చి నిల్చెనొ కాక యా
మేను గైకొని విష్ణుఁ డీడకు మేటియై చనుదెంచెనో. 161

మత్త. కాక యేవర మైన నాకఱకంఠుఁ డిచ్చిన నుబ్బి యా
నాకవల్లభుఁ డెల్లకాలము నాకు నోడినభీతియై
లోకభీకరమైనరాక్షసలోక మెల్ల నడంపఁగా
నీకరాళపురూపు నిప్పుడ యీడ కంపఁగ వచ్చెనో. 162

మత్త. కాక తక్కినవార లెవ్వరు గర్వసంపద మీఱఁగా
నాకు డీకొని ఢాకతోడ రణంబు సేయఁగ నోప రే

లోకమం దిటు క్రోధితు లెక్కడ లోఁచు దానవవీరులన్
జోక వీనికిఁ గల్గెనేనియుఁ జూఱ వుచ్చఁడె సర్వమున్. 163
వ॥ అని యి ట్లనేకప్రకారంబులఁజింతించి, యక్షకుమా
రుం దలంచి పలుతెఱంగులఁ బలవించుచున్న తండ్రిం గాంచి
మేఘనాథుం డిట్లనియె. 164
క. దేవతలతోడఁ గూడను
దేవేంద్రునిఁ గెలిచినట్టి దేవరకున్ మీ
కీ వగ పేటికి నేఁటికి
దేవా! చిత్తంబులోన దీనునిభంగిన్. 165
క. వానరునిఁ గొండఁ జేసుక
పూనికఁ జింతింప నేల భుజబలశక్తిన్
వానిం జంపెద నొండెను
దీనునిఁ గావించి పట్టి తెచ్చెద నొండెన్. 166
వ. నావుడు రాక్షసేశ్వరుం డతనిమాటలకు మనంబున
నలరి నీవు విరించివరదత్తప్రతాపవహ్నితాశనుండవు చాప
విద్యాప్రవీణుండవు తపోబలసమర్థుండవు దేవేంద్రగర్వవిమర్ద
నుండవు మత్సమానశౌర్యచాతుర్యధుర్యుండవుఁ గావున నీ
కసాధ్యంబగు కార్యంబెద్దియున్ లేదు నీ వివుడ పోయి వాని
సాధించిరమ్మని పంచిన. 167
సీ॥ మాణిక్యతపనీయమయవిమానముతోడఁ
గెంబట్టుబిరుదుటెక్కెంబుతోడ
సరి చెప్పఁగా రాని శాస్త్రాస్త్రములతోడఁ
బల మైనదివ్యచాపంబుతోడ

నాహవకోవిదుండైన సారథితోడ
ఘనసత్త్వజవతురంగములతోడఁ
గనుపట్టి దిక్కుల గగనయానముతోడఁ
బాలసూర్యోదయప్రభలతోడఁ
తే. గరము విలసిల్లురథ మెక్కి గంధనాగ
తురగరథభటవందిసందోహపటహ
శంఖకాహళదుందుభిస్వనము లొలయ
మేఘనాథుండు హనుమంతుమీఁద వెడలె. 168

లయగ్రాహి. పెక్కులగు గుఱ్ఱములుఁ జొక్కపురథంబులును
నెక్కువగు నేనుఁగులుఁ గ్రిక్కిరిసి రాఁగా
రక్కసులు సేరి యిరుప్రక్కలను గొల్వఁ గడు
నుక్కునను మీఱి చలమెక్కుడుగ నంతన్
గ్రక్కదల భూతలము చుక్కలొగి రాల శిల
లుక్కసిలి నాదములు పిక్కటిలి మ్రోయన్
డెక్కముల మించి జన మెక్కుడుగఁ జూపుదళ
మక్కజముగా నడువదిక్కులువడంకన్. 169

వ॥ ఇట్లు భయంకరాకారంబున వెడలి కంఠహుంకృతులును భేరీభాంకృతులును నంబరంబునఁ జెలంగఁ బొంగి చను దెంచుచున్న రాక్షససైన్యంబుం గనుంగొని హనుమంతుండు తోరణస్తంభంబుపై నుండి బధిరీభూతదిగంతరంబుగా భీకరగతి నార్చిన. 170

క. కలఁగినవి దేవగణములు
జలధులు ఘూర్ణిల్లె గిరులు చలనం బొందెన్
జలజాప్తచంద్రు లాదిగిరి
జలధరములు పఱియ లగుచుఁ జదలం బర్వెన్. 171

క. అప్పుడు దానవవీరులు
నిప్పులు వర్షించునట్టి నిశితాస్త్రములన్
గప్పిరి కెందొగవానలఁ
గప్పినశైలంబుఁ బోలఁ గపివరుమీఁదన్. 172

తే. అంపవర్షంబు తనమీఁద జొంపములుగ
లీలఁ గురియంగ నవి యెల్ల లెక్కఁ గొనక
భువికి లంఘించి యప్పు డద్భుతముగాఁగ
వాల మల్లార్చి యొకమహాసాల మెత్తి. 173

తే. తేరు లన్నియుఁ గూరాటితేరులుగను
గుఱ్ఱముల నెల్లఁ గావేరిగుఱ్ఱములుగ
నేనుఁగుల నెల్ల వెడరూపుటేనుఁగులుగ
దళము లన్నియు మఱి హరిదళముగాఁగ. 174

వ. ఇట్లు సమయింపం జూచి బలంబుపై కుఱికి. 175

సీ. కరియూథములమీఁదఁ గదిసి మావంతుల
తోడఁ గూడఁగఁ బట్టి తునియఁ గొట్టి
గుఱ్ఱంపుఁ జౌజులకును దాఁటి రౌతులఁ
గలయంగఁ బట్టి చెక్కలుగఁ గొట్టి
రథములపైకి నుగ్రంబుగా లంఘించి
రథికులతోఁ గూడ రసను గొట్టి

బలములమీఁద నిబ్బరముగాఁ గుప్పించి
వాలముఖంబునఁ దూలఁ గొట్టి
తే. పటహనిస్సాణకాహళపటిమ లురియఁ
దొరికి శస్త్రాస్త్ర నిచయముల్ తుమురు చేసి
ఛత్రములఁ ద్రుంచి పడగలసత్వ మణఁచి
పవనసూనుండు సాహసప్రౌఢి మెఱసె. 176

వ. అట్టి సమయంబున. 177

చ. అవలముకీర్తి మండి దివిజారితనూజుఁడు తేరు దోలి య
య్యనిలతనూజు నేసె వివిధాయుధపంక్తుల వానినెల్లఁ దు
త్తునియలు సేసెవాయుజుఁడుదోర్బలశక్తినిదైత్యుఁడేయదోఁ
కను దునుమాడెవానిశిఖంబులనన్నిటివాయుసూనుఁడున్.

క. గిరులును వందలకొలఁదిగఁ
దరువులు సేయంగఁ గినిసి దానవుఁ డంతన్
దురమున నడుమనె తుంచెను
శరజాలముచేత నొక్కక్షణమున వానిన్. 179

తే. గంధవహపుత్త్రుఁ డప్పు డాగ్రహముతోడ
రథముఁ గూలంగఁ దన్ని సారథినిఁ జంపి
గుఱ్ఱములఁ జంపి కేతువుఁ గూల నడవ
మేఘనాదుండు కినిసి సమీరసుతుని. 180

వ. అహంకారంబునఁ బ్రతిఘటించి. 181

క. వాయవ్యాస్త్రము నంతట
వాయుజుమీఁదికి వతెండువడి నేసిన నా

వాయవ్యాస్త్రముఁ దూలెను
వాయుజునిం జంప నోడి వారనికరుణన్. 182

వ. అది వృథ యగుటం గని మఱియును. 183

క. రౌద్రిం బడరఁగ నేసెను
రుద్రాస్త్రం బతనిమీఁద రూఢిగ నతఁ డా
రుద్రునియంశం బగుటను
రౌద్రాస్త్రముఁ దేలిపోయె రభసం బొప్పన్. 184

వ. అమ్మహాస్త్రంబుగూడఁ దప్పిపోవుట కాశ్చర్యంబు
నొంది యింద్రజిత్తు మఱియును. 185

క. సురఖచరయక్షకిన్నర
గరుడోరగసిద్ధసాధ్యగంధర్వగణం
బరుదంది చూడఁగా ని
ర్భరముష్టిం దొడిగి యేసె బ్రహ్మాస్త్రంబున్. 186

వ. అట్టి యవసరమున. 187

క. సప్తాంబోధులుఁ గలఁగెను
సప్తద్వీపములు వణఁకె శైలము లదరెన్
సప్తానిలములుఁ దలఁకెను
సప్తాశ్వుఁడు మ్రానుపడియె జగములు గదలెన్. 188

వ॥ ఇట్లనేకప్రకారంబులఁ గాలాగ్ని తెఱంగున వెడలి
మిడుంగుఱులు చెదరి పడఁగ బ్రహ్మాండమండలంబుం బట్టు
కొనునట్లు పెనుమంట లుప్పరం బెగయ నేతెంచు బ్రహ్మాస్త్ర
ముంగని హనుమంతుండు తనమనంబున. 189

ఆ॥ తనకుఁ జిన్ననాఁడు దయచేసినటువంటి
వనజభవునిచేతివరముఁ దలఁచి
బ్రహ్మమంత్రి మప్పు పఠియింప నది చంప
కతనిఁ గట్టివై చె నవనిమీఁద. 190

వ. ఇట్లు కట్టువడినకరువలిపట్టిని జూచి రావణాసురుని
పట్టి తనలో నిట్టు లనుకొనియె. 191

క. ఈబ్రహ్మాస్త్రము తాఁకుట
కేబలియుఁడు బ్రదుక నోఁప డీతఁడు ఘనుఁడై
నీబాహుబలునిఁ గట్టుట
నాబలిమికిఁ దొడవ కాదె నాకులు మెచ్చన్. 192

క. పెక్కండ్రి దనుజవీరులఁ
జక్కాడినవీనిఁబట్టి సాహసముగ మా
రక్కసుల రేనియొద్దకుఁ
జక్కఁగఁ గొనిపోవు టదియ చంపుట గాదే. 193

చ. అని తనసత్త్వసంపద రయంబునఁ బొంగుచు మేఘనాదుఁడు
య్యనిలజుఁ గొందు నేఁగె దివిజారిసభాస్థలి కచ్చ్యుతంబుగా
ఘనరథదంతి ఘోటకనికాయభటావళి శస్త్రదీప్తకే
తనవరశంఖకాహళవితానరవంబులు మిన్ను ముట్టగన్.194

వ. ఇట్లు గొనిపోయి రాక్షసేశ్వరుం డయిన రావణా
సురుసమ్ముఖమ్మునం బెట్టినంతనే గాడుపుపట్టిం గని. 195

క. కుటిలభ్రూకుటినటన
స్ఫుటధూమవిలాసపవనఫూత్కృతిజనితో

ద్భటరోషాననకీలో
త్కటనేత్రుం డగుచుఁ బలికెఁ గటములదురఁగన్. 196

ఉ. ఎవ్వఁడ వోరి నీకుఁ బ్రభు వెవ్వఁడు చెప్పుము నీవిటొంటిమై
నివ్వనరాశి దాఁటి యిటు కేగతి తెచ్చితి నామ మేమి నీ
వెవ్వనిప్రాపునం బెఱికి తీవన మంతయు శంక లేక నిం
కెవ్వని ప్రాపునం దునిమి తీసురవైరుల నెల్ల నుగ్రతన్.

సీ. అమరవల్లభుభోగ మంతయుఁ గైకొని
వీతిహోత్రునిసిరి నూతి ముంచి
జమునికింకరులను సంహార మొనరించి
రాక్షసాధీశ్వరు శిక్ష సేసి
యంభోధినాథుని గాంభీర్య మణఁగించి
దోర్బలంబున గాలిఁ దూలఁ బెట్టి
విత్తనాథునిమహావిభవంబుఁ గొల్లాడి
శూలహస్తుని నొక్కమూల కదిమి

తే. అమరగంధర్వకిన్నరయక్షభుజగ
గురుడగుహ్యకమునిసిద్ధవరుల నెల్లఁ
బట్టి మును వెట్టి సేయించు నట్టినన్ను
విన్నయంతన గుండెలు వ్రీల వెల్లు. 198

చ. శరనిధిదాఁటివచ్చుటయుచాలక నాపురిఁజొచ్చిచొచ్చియున్
వెఱవక బంటనై వనము వ్రేళ్లకుఁ ద్రుంచితి ద్రుంచి క్రమ్మఱన్
బిరుదవుపోలె రాక్షసులఁ బెక్కురఁ జంపితి చంపినెమ్మదిన్
గరకరితోడ నాయెదుర గర్వముతోడుత నిల్పి తద్దిరా!

క. ఖండించెద నీచేతులు
తుండించెద నడుము రెండుతునుకలు గాఁగన్
జెండించి నీదుకండలు
వడించెదఁ జముగుతోన వాచవి గలుగన్. 200

వ॥ ఇట్లు పట్టరాని కోపంబున నాటోపంబుగాఁ బలుకుచున్న రావణాసురుం జిరికిం గొనక హనుమంతుఁ డిట్లనియె.

క. ఇనతనయునివరమంత్రిని
జనపతి యైనట్టి రామచంద్రునిదూతన్
ఘనుఁడగు వాయుకుమారుఁడ
హనుమంతుం డందురన్ను నార్యులుదిశలన్. 202

క. రామునిపంపున వచ్చితి
రామునిసేమంబు నిందు రంజిల్లెడి యా
రామునిసతి కెఱిఁగించితి
రామునికడ కేఁగుచుండి రాజసపుత్రిన్. 203

క. నారాక మీకుఁ దెలియఁగ
బీరంబున వనము కలయఁ బెఱికితి శక్తిన్
ఘోరాజి నాకు నెదిరిన
వారలఁ బంపితిని యమునిపట్టము సూడన్. 204

క. నినుఁ జూచి తిరిగిపోయెదు
మనమున మఱి కట్టఁబడితి మనుజాశన ! నీ
యను వెల్లగంటి నింకను
వినుమా నాబుద్ధిఁ దెలియ వివరముతోడన్. 205

చ. ఘనుఁడవు నీతిమంతుఁడవు కార్యమెఱుంగుదుసాహసంబున
న్నిను నెదిరించి పోవుటకు నిర్జరవల్లభుఁ డోపలేఁడు నీ
వనిన జగత్ప్రియం బలుకు నద్భుతరూపము సెప్పరాదు నీ
యనుపమ భోగసంపదల గాఁడి తెచ్చితి విప్డు రావణా!

క. కడలేని బలము ధర నె
క్కడలేని మహాధనంబు కరితురగంబుల్
కడగానరానిసంపద
చెడ కుండఁగ నీకు బుద్ధి సెప్పెద వినుమా. 207

సీ. కుదియించి సింహంబుకోఱలు పెఱుకంగ
శేషాహిదాడలు చీల్చివేయఁ
బీడించి దంభోళిఁ బిడికిటఁ బట్టంగఁ
గఠినకాకోలంబు కడి గొనంగఁ
జెలఁగి బ్రహ్మాండమ్ము చిప్పలూడఁగఁ దన్న
హంకారమునఁ బడబాగ్ని నుఱుక
నంభోనిధానంబు లఱచేత నడఁపంగ
గిరివర్గములఁ దలక్రిందుచేయఁ

తే. గల మహాబాహుసత్త్వవిఖ్యాతివిపుల
చండభుజదండసాహసోద్దండ విజయ
కాలరుద్రావతారసంగ్రామభీమ
మూర్తిమంతులు కవులు సత్కీర్తియుతులు. 208

వ॥ అదియునుంగాక దశరథరాజనందనుండునుగౌసల్యా
గర్భసంభవుండును దాటకాప్రాణాపహారుండును విశ్వామిత్ర

యాగసంరక్షకుండును నహల్యాశాపమోక్షదీక్షాగురుండును హరకోదండఖండనుండును జామదగ్ని బాహుబలభంగుండును విరాధనిరోధుండును ఖరదూషణత్రిశిరశ్ఛేదనుండును మాయామృగసంచారి మారీచసంహారకుండును గబంధాంతకుండును వాలిప్రాణనిబర్హణుండును సుగ్రీవరాజ్యసంస్థాపనపరమాచార్యుండును ధనుర్విద్యాప్రవీణుండును నమోఘబాణుండును రాక్షసకులాంతకుండును గాకుత్స్థాన్వయాంభోనిధి చంద్రుండును గరుణాసింధుండును నగు శ్రీరామచంద్రుండు కరుణాలంకారుండు గావున. 209

ఉ॥ వారక సీత నిచ్చి రఘువల్లభునిన్ శరణంబు జొచ్చినన్
నేరము లెంచి చంపమికి నీయెడ కెప్పుడు నేను బూటగా
భారపడంగఁ జాలుదు శుభస్థితి నమ్ముము నమ్మకూర కే
పోరఁగఁ జూచితేనిఁ బొరిపుచ్చక మానఁడు నిన్ను రావణా!

ఉ. నావుడు మండి దైత్యకులనాయకుఁ డుగ్రవిలోకంబులన్
బావకవిస్ఫులింగములు పైకొని పాఱఁగ వీరఘోరదై
త్యావళిఁ జూచి మీరలు మహావిశిఖంబుల వీనిఁ జంపుఁడీ
యీవల రాముఁడుల్లుచుభయాకులుఁడై చెడిపోవునట్లుగన్.

వ. అనిన విని విభీషణుం డిట్లనియె. 212

క. దూతపనిఁ బూని వచ్చిన
దూతలు తమవారి కేమి తోఁచిన నట్లా
నేతల నాడుదు రాడిన
దూతలఁ జంపంగఁ దగదు దొరలకు నెందున్. 213

క. కా కుండిన మిాఁచిత్తము
కాఁకెల్లను దీఱ ముజ్జగంబులు బెదరన్
ఢాక నదలించి తోఁకను
వీఁకను ముట్టించి పోవ విడుచుట చాలున్. 214

వ. అని విన్నవించిన. 215

ఆ. నీతివాక్యకరణి నెఱయంగ విని రావ
ణేశ్వరుండు కోప మెడలి పలికె
వీనిఁ దోఁక గాల్చి వెడలంగఁ ద్రోయుఁ డీ
పొద్దె యటకుఁ దిరిగి పోవుఁగాక. 216

వ. అని యిట్లానతిచ్చిన విని రాత్రించరు లతనిని సభామధ్యంబునుండి బయటికి వెడలం గొనిపోయి యొక్కచోట,

ఉ॥ వాలము నిండఁ గోకలు జవంబునఁ గట్టిగఁ జుట్టి వానిపైఁ
దైలము చక్కఁ జల్లి పిఱుందం జనిపోరులు సూడఁ బావక
జ్వాలఁ దగిల్చి బొబ్బలిడి వాడల వాడలఁ ద్రిప్పుచుండ వా
తూలభవుండు దానికిని దూలక వహ్నిజపంబు సేయఁగన్.

ఆ. అగ్నిదేవుఁ డప్పు డాత్మలోఁ జింతించి
హితుఁడు నాకు లోకహితుఁడు పవనుఁ
డతనిపుత్త్రుఁడైన హనుమంతునకు నేను
జలువ కూర్తు ననుచుఁ జల్ల నయ్యె. 219

వ. అప్పు డచ్చటివృత్తాంతం బంతయుఁ దనకుఁ గావలి యున్న రాక్షసకాంతలవలన విని చింతాభరాక్రాంతయై జనకరాజనందని కరంబు శోకించి కరంబులు ముకుళించి జగద్ధితకార్య

ర్యధుర్యుండును రాఘవప్రియానుచరుండును మత్ప్రాణబంధుండును జగత్ప్రాణనందనుండును నైన హనుమానునకు శీతలుండవు కమ్మని యగ్నిదేవునకు నమస్కరించి యగ్ని మంత్రంబును బ్రహ్మమంత్రంబును నుచ్చరించిన నద్దానివలన వానికి వైశ్వానరభగవానుండు సల్లనయ్యె. బ్రహ్మాస్త్రబంధనంబును నూడె నట్టి సమయంబున, 220

సీ. కొలువుకూటములకుఁ గుప్పించి గజవాజి
 శాలలమీఁదికి జౌకళించి
భండారగృహములపైకిని లంఘించి
 మెఱుఁగారు మేడలమీఁది కుఱికి
చప్పరంబులమీఁది కుప్పరంబున దాఁటి
 యంతఃపురములకు గంతువైచి
చవికలమీఁదను సాహసంబున వ్రాలి
 గరిడికూటంబుల సొరిది నెక్కి

తే. వాడవాడల వీథుల వన్నె మెఱసి
హరుఁడు త్రిపురంబు వేల్చినయట్టిలీల
నొక్కగృహమైన లెక్కకు దక్కనీక
దానవేశ్వరుపురము దగ్ధంబు చేసె. 221

శా. అంభోరాశినివాలవహ్ని నతిశౌర్యం బొప్పఁ జల్లార్చి య
య్యంభోజానన సీతఁగాంచి తనవృత్తాంతంబు తెల్లంబుగా
గంభీరధ్వని విన్నవింపుచు నమస్కారంబు గావించి సం
రంభం బొప్పఁగ వేడ్కతోఁ గదలె ధీరప్రౌఢిదీపింపఁగన్.

క. పోనీదు వాయుజు నెక్కడఁ
బోనీదు నాచేత ననుచుఁ బోనీక వడిన్
డాయఁగ వచ్చిన లంకిణి
కాయము వగులంగఁబొడిచెఁ గడువడిఁ గినుకన్. 223

వ. ఇట్లు లంకిణిం జంపి సువేలాచలం బెక్కి సింహనా
దంబు సేయుచు, 224

క. వడిగా ధరశృంగంబున
నడుగులు వడి నూఁది త్రొక్కి యద్భుతశక్తిన్
జడరాశి దాటఁ బావని
మిడిపింటం బసిఁడియుండ మీఁటెనరీతిన్. 225

వ. ఇట్లు కుప్పించి యుప్పరం బెగసి వాయువేగంబు
నంజనుచు నయ్యబ్ధిమధ్యంబుననున్న సునాభం బనుశైలంబున
తనదేహంబుదాహంబుఁ దీర్చికొని సముద్రంబునుదాఁటి యవ్వ
లికిం జనియె నప్పుడు.

ఉ. వచ్చినపావనింగని జవంబున నంగదుఁడాది యైనకపుల్
గ్రచ్చుఱఁ గీర్తితో నెదురుగాఁజన నందఱుఁగౌఁగిలించి వా
రచ్చటికార్యమంతయుఁ బ్రియంబునదన్నడుగంగఁబోయి వే
వచ్చినచంద మేర్పడఁగ వారికిఁ జెప్పెను దప్పకుండఁగన్.

క. రఘువరుఁ డిచ్చినముద్రిక
రఘువల్లభదేవి కిచ్చి రభసంబున నా
రఘువరున కానవాలుగ
రఘువల్లభదేవి చేతిరత్నముఁ గొంటిన్. 228

మ. అని చెప్పన్ విని యంగదాదులు మహాహ్లాదంబునన్ బొంగి పా
వనిబాహాబలసత్త్వముల్ పొగడుచున్ వర్ణింపుచున్ వేఘునః
పునరాలింగనమాచరింపుచు వడిన్ భాషింపుచున్ మ్రొక్కుచుం
ఘనతం బాడుచు నాడుచున్ బలువిడిన్ గర్వంబునన్ దాటుచున్.

శా. నేనే చాలుదు రావణాసురుతలల్ నేలం బడం గొట్టఁగా
నేనే చాలుదు వానిపట్టణము మున్నీటం బడం ద్రోయఁగా
నేనే చాలుదు దుష్టదానవతతిన్ నిర్భీతి దండింపఁగా[చున్
నేనే చాలుదు నంచు బంతములు పూనికం బలుకుచున్ ద్రుళ్ళు

క. ఆరాత్రి కీశు లందఱు
మారుతితోఁ గూడి నిలిచి మఱునాఁ డచటన్
ధీరత దుర్ధర శైలము
చేరం జని నిద్ర చేసి చిత్తము లలరన్. 231

వ. అమ్మఱునాఁ డుదయంబున మధువనంబులోఁ బ్ర
వేశింప నుద్యోగించి యందఱకన్నను బెద్దవాఁడగు జాంబ
వంతునిం బిలిచి నీవు శ్రీరామునకు హితుండవు సుగ్రీవునకు
మంత్రివి కావున మాకు నొక్కబుద్ధి యానతిమ్ము. ఈకపులు
క్షుద్బాధావశంబునం బొరలి మహాశ్రమంబును బొందియున్న
వారు గావున సుగ్రీవుని మధువనంబున నుండెడు ఫలంబులం బరి
తృప్తులమయి రాముని సన్నిధానంబున కేఁగుట లెస్సయని
యంగదహనుమంతులు పల్క జాంబవంతుండును నత్యుత్సా
హంబున నంగీకరించి కపులం బురస్కరించుకొని మధువనంబులోఁ
బ్రవేశించి నంత. 232

సీ. ఒక్కఁడాఁకొని కొమ్మ లూఁచినఁ బడ్డెల్లఁ
జేకొని తేర భక్షించు నొకఁడు
ఒక్కఁడాఁకొని రేఁపు చున్నట్టితేనియల్
తడయక కొల్లాడి త్రాగు నొకఁడు
ఒక్కఁడాఁకొని కోయుచున్నట్టికాయలు
మిన్నక యూటాడి మ్రింగు నొకఁడు
ఒక్కఁడాఁకొని గోళ్ల నొలిచినట్టిచివ్వుళ్ళఁ
బుక్కిళ్ళకొలఁదిగా బొక్కు నొకఁడు
తే. తరువుపై నుండి తరువుపై దాఁటు నొకఁడు
పండ్ల కెటువంటి మ్రాఁకైనఁ బ్రాఁకు నొకఁడు
దిగువఁ గూర్చుండి తరువును కేగురు నొకఁడు
పెద్దపొడవున నుండి కుప్పించు నొకఁడు. 233

ఉ. కాయలఁ బ్రేటులాడుచును గంతులువైచుచుఁ బూవుఁదీవలం
దూయలలూఁగుచున్దరువులూఁపుచుఁబండ్లనుబొట్టనిండఁగా
మేయుచువెక్కిరింపుచును మిన్నకదాఁటుచుదోఁకలెత్తుచున్
గూయుచు నేల దూఁకుచును గుంపులు గూడి కపీంద్రు
లెంతయున్. 234

క. వన మంతఁ గాసి చేయఁగ
వనపాలకు లేఁగుదెంచి వడిఁ గోపముతో
డను నదలించిన వారల
హనుమంతుఁడు మొదలుగాఁగ నగచరు లెల్లన్. 235

క. మెడఁ బట్టి వనములోపల
వెడలఁగ నటు పాఱ ద్రొబ్బి వెడలుం డన్నన్
దడయక దధిముఖుఁ డనుతమ
యొడయనికడ కేఁగి వార లుగ్రముగాఁగన్. 236

వ. విన్నవించినయంత నే. 237

చ. దధిముఖుఁ డప్డు మండిపడి తాఁ దన వారలఁ గూడి వచ్చి బ
ల్విధముల సంచరించుకపివీరులఁ గోపముతోడఁ జూచియీ
మధువన మెల్లఁ గొల్లగొన మర్కటవల్లభునాజ్ఞఁ ద్రోయ ను
న్మథములఁ జేయనెంతఘనులంచును బాఱఁగ వారి నుద్ధతిన్.

వ. ఇట్లు దండింపుచున్న దధిముఖుపై నంగదాదివన
చరులు గదిసి యాగ్రహంబున. 239

క. కొందఱఁ గఱచియుఁ బొడిచియుఁ
గొందఱఁ దలపట్టి యీడ్చి కొట్టియు గోళ్లన్
గొందఱ వ్రచ్చియుఁ దన్నియు
నందఱ నొప్పింప వార లాగ్రహవృత్తిన్. 240

క. వ్రయ్యాలు వాఱఁగ వ్రచ్చినఁ
గ్రయ్యగ రక్తములు గ్రమ్మఁగా వడితోడన్
గుయ్యో మొఱ్ఱో యని వా
రయ్యెడ సుగ్రీవుకడకు నరిగిరి భీతిన్. 241

వ. అరిగి రామలక్ష్మణులం గూడి యున్న మిహిరనంద
నుంగనుంగొని నమస్కరించి మధువనంబునందు జరిగినవృత్తాం
తంబంతయు విన్నవించిన వారల నాదరించిసుగ్రీవుం డిట్లనియె.

క. దేవరపంపున( జని వా
రేవెరవున సీత( గనిరో యిటు గాకున్నన్
నానవము పాడు సేయరు
పావని మొదలైనవారు భయవిరహితులై. 243

వ. అని రామభూపాలుండు వినసుగ్రీవుండు వారల
నూరార్చి వారిదుండగంబులు వారికే యుండుంగాని వారలం
దోడ్కొని యతివేగమ రండని యనిపినం జని యంగదహనుమం
తులంగని యవనీశ్వరుం డీక్షణంబున మిమ్మందఱ నచటికిరండని
యానతిచ్చెం గావున( జెచ్చెర( బదుండని తోడ్కొనిపోవు
నప్పుడు వారల కెదురుగా వానరవీరుల( గొందఱ ననిపిన
వారల(గూడి చనుదెంచి శ్రీరామచంద్రునిపాదారవిందమ్ము
లకు సాష్టాంగదండప్రణామమ్ము లాచరించి సౌమిత్రికిని వంద
నమ్ము లొనరించి సుగ్రీవునకు సమస్కరించి తనచేత మేలు
వార్తవిన నుత్సహింపుచున్న రఘుకులేశ్వరుల తలం పెఱింగి,
హనుమంతుం డిట్లనియె. 244

శా. కంటిన్ జానకి( బూర్ణచంద్రవదనన్ గల్యాణినాలంకలో(
గంటిన్ మీపదపంకజంబులును నే(గౌతూహలంబొప్పగా(
గంటిన్ మీకరుణావలోకనము విఖ్యాతంబుగా( గీర్తులన్
గంటిన్ మాకపివీరబృందములలోఁగాంభీర్యవారాంబుధీ. 245

సీ. కట్టినవస్త్రంబు కట్టుకొం గే తక్క
జీర్ణించిపోయిన చీరతోడ
నడుగనివగలచే నొరంత పాద్రిదున(
జెక్కుంట( జేర్చిన చేయితోడ(

బుడమిపైఁ బొరలాడునోడలు బాడిదబ్రింగి
నిరతంబు దొరఁగుకన్నీటితోడ
నిడుదపెన్నెఱివేణి సడలించి జడలతో
నిరతనిరాహారనియతితోడఁ

తే. గినుక జంకించుదైత్యకామినులనడుమఁ
దపముఁ జేయుచు దనుజబాధలకు నోర్చి
వనిత ప్రాణంబు దక్క సర్వముఁ ద్యజించి
నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండు. 246

క. జానకిఁ బొడగనియును మీ
రానతి నాకిచ్చి పంపినట్టి విధంబుల్
నే నాయమ కెఱిఁగించియు
జానకిరత్నంబుఁ గొంచుఁ జనుదేఁ గంటిన్. 247

వ. ఇవ్విధంబున సీతచిహ్నంబులు రామచంద్రునకుం జెప్పి దండప్రణామంబు లాచరించి తనకు సీతామహాదేవిదయ చేసిన శిరోరత్నంబు శ్రీరామచంద్రునకు సమర్పించిన జూచి యది యక్కునంజేర్చి యానందబాష్పంబులుగ్రమ్మ దేవరమూర్ఛిల్లి తెప్పిఱిల్లి హా! వామలోచన, హా! పద్మగంధి, హా! సీత హాసీతా! యనుచు శోకించి సుగ్రీవుం జూచి మనము లంకాప్రయాణము చేయఁ బోవుదము గానఁ నిక సేనలం గూర్పు మని యానతిచ్చిన వానరేశ్వరుండు మహాప్రసాదం బని యంగదహనుమజ్జాంబవత్సుషేణపవననలనీలగజగవాక్షగోముఖాదు లగు సేనానాయకుల నఱువదికోట్ల నియోగించినవారును

నొక్కొక్కరు నూఱేసికోట్ల బలంబులతోడ రామచంద్రుని యిరువంకల నాడుచుఁ బాడుచు మాల్యవంతంబు వెడలిరన విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁది వృత్తాంతం బెట్టిదని యడుగుటయును. 248

క. జలజాక్షు! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!
జలజాకరచారుహంస! జానకినాథా! 239

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధగురు జంగమార్చన వినోద సూరిజనవినుతకవితాచమత్కా రాతుకూరి కేసనసెట్టి తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణమహాకావ్యంబునందు సుందరకాండము సర్వము నేకాశ్వాసము.

---

# యుద్ధకాండము.



## ప్రథమాశ్వాసము.

క. కామారివినుతనామా!
సామీరికృతప్రణామ! సంహృతరక్షో
గ్రామా! వర్షామేఘ
శ్యామా! సంగ్రామభీమ! జానకిరామా! 1

వ. శ్రీ నారదమహామునీశ్వరుండు వాల్మీకి మునీశ్వరున కెఱింగించిన తెఱంగువినుపించెద సావధానచిత్తంబుతో నాకర్ణించు మట్లు శ్రీ రామచంద్రుండు వానరసైన్యముతో వెడలి నడుచుచుండ హనుమంతుం డంతకుమున్దు తాను లంకకరిగి మగిడివచ్చి యచ్చటవృత్తాంతమంతయు శ్రీ రామచంద్రున కెఱింగించియు ద్రోవలో నుబుసుపోకకుఁగా మరల రావణుం డుండుచందంబును రాక్షసస్త్రీల సంవాదంబునింద్రజిదతికాయాదికుమారవర్గంబు తెఱంగును కుంభకర్ణవిభీషణాది సోదరుల యునికియును లంకిణిపోంకం బణంచుటయును లంకలోపలకుఁ బోయినచందంబును లంకాపురీ దహనంబును సముద్రలంఘనంబును నదియిది యననేల తాఁ జేసివచ్చిన కార్యంబులనెల్ల నెవ్వరెవ్వ రేదేది యడిగిన వారికావృత్తాంతంబు నెఱిగించుచుండ మిగిలినకపులు వినుచు, దనుజాతిచే

ష్టలు సూపుచుఁ జనుచున్న చందంబు సుగ్రీవుండు రామచంద్రునకుఁ జూపుచు నడుచుచున్న సమయంబున. 2

ఉ॥ కొందఱుమంతనమ్ములను కొంచునుగొందఱు దొమ్ములాడుచు
న్గొందఱు రామలక్ష్మణులకుం బ్రియమౌగతినాటలాడుచుౝ
గొందఱుగంతులేయుచును గొందఱుపండ్లిగిలించిచూపు చి
ట్లొందఱుఁబోవుచుండిరి దయానిధిరాముఁడు సంతసిల్లఁగౝ.

సీ. పాదఘట్టనలచేఁ బరఁగిన పెంధూళి
యాకసమ్మున మేఘమట్లు పర్వ
వీకతోఁ దాఁకినవృక్షజాతం బెల్ల
వ్రేల్మిడిఁ గొమ్మలు విఱిగి పడఁగ
బలువడితోఁ బోవు పక్షినాజమ్ములు
భయముచే నందంద పాఱుచుండఁ
జూపించి రావణాసురుని సైన్యం బిట్లు
మనవారిచేతను మ్రిందఁ గలదు

తే. అనుచు శ్రీరామునకు నర్కనందనయుఁ డిట్లు
సంతసము పుట్టఁ జెప్పుచు సాగి సాగి
క్రమముగా నందఱును గొంతకాలమునకుఁ
దిన్నఁగాఁ జేరిరి సముద్రతీరమునకు. 4

వ. ఇ ట్లందఱును సముద్రతీరమున విడిసి యున్న సమయంబున హనుమంతుండు బుద్ధిమద్వరిష్ఠుండు గావున శ్రీరామచంద్రునకు నమస్కరించి రావణుండు రాజ్యంబునం బట్టభద్రు

డై యున్నవాఁడు. వానింజంపి సీతామహాదేవిం దెప్పించుపనికై వేగ మన మందలమును సిద్ధులమై యుండవలయు నప్పుడు రామచంద్రుండు తమ్మునితో. 5

క. ఈవానరులను దోడ్కొని
ప్రావీణ్యముతోడ వృక్షపర్వతశతులన్
వేవేగమె తెప్పింపుము
పోవుద మటమీఁద నైరిపురముం జేరన్. 6

వ. అని యిట్లానతిచ్చి సముద్రతరణోపాయం బాలోచించుచుండె నంత. 7

సీ. అక్కడ రావణుం డఖిలమంత్రుల వేగ
రావించి తగను వారలకు ననియె
మంత్రిసత్తములార! మర్కటుం డొకఁ డేఁగు
దెంచి మనందఱం గొంచెపఱిచి
రాక్షసవీరుల రణభూమిఁ బొలియించి
వనమంతఁ బెకలించి వార్ధి దాఁటి
పోయెను పోరానిపోకలఁ బోవుచుఁ
వాఁడు శ్రీరామునియొద్ద కేఁగి
తే. ఏమి చెప్పునో యామీఁద నామనుష్యు
లిద్దఱును వానరులఁ గూడి యేపుమీఱ
వచ్చి లంకాపురములోనివారి నెల్ల
నేమి సేతురో యిపుడు నా కేమి దారి?

వ. అని యిట్లు రావణుండు నిండుపేరోలగంబునఁ గూర్చుండి డోలాయమానమానసుండై విచారించుచుండ నాస

మయంబున విభీషణుండు సాయంసంధ్యావిధిం దీర్చుకొని తన మంత్రులుం దానును గొల్వుకూటంబునకే తెంచి పెద్దగద్దియపైఁ గొలువున్నయన్నకు సాష్టాంగదండప్రణామంబు లాచరించిన నతండును సంతోషించి యజునకు సర్వాపీఠంబుఁ జూపినఁ నాసీనుండై యన్న కిట్లనియె.

తే. అవధరింపుము దేవ! మహానుభావ!
మనపురమ్మునఁ బ్రకృతమ్ము చను తెఱంగు
విన్నవించెద నున్నది యున్నయట్లు
కొంచె మవధానముగ నాలకించు మయ్య! 10

సీ. అన్నంబు నీరును నక్కఱ లేకుండ
భటు లందఱును దుఃఖపడుదు రయ్య
కంబాలఁ గట్టినగజబృంద మెల్లను
జవసత్త్వములు దూలి జడిసె నయ్య
వార్షంబుతోఁ దూలె హయజాతమంతయు
మెడ లెత్తుకొని వేడ్క మెలఁగ వయ్య
ప్రజ్వలించుచు నున్న ప్రతిహోమకుండంబుఁ
బొగలు గ్రమ్ముచు నాఱిపోవు నయ్య

తే. ఇట్టియపశకునములఁ గన్పట్టు నయ్య
సకలశాస్త్రంబు లెఱిఁగినజాణ వయ్య
యింపుగాఁ జెప్పుచుంటి నాలింపు మయ్య
వేగ రాముని సతి నిచ్చి వేయు మయ్య! 11

క. సీతను దెచ్చుట మొదలుగ
నీతో నయవాక్యములను నేఁ జెప్పితి నీ
చేతమునఁ బెట్టవైతివి
ఖ్యాతిగ నిఁక నైన సీత నాతని కిమ్మా. 12

వ. అదియునుంగాక మొన్న రాత్రి సీతయొద్దఁ గావలి యున్న రాక్షసకాంత లందఱును నిద్రించుచున్న సమయంబునఁ ద్రిజట దిగ్గన మేల్కాంచి నిదురించుచున్న స్త్రీలను లేపి చెప్పిన దుస్స్వప్నంబు విన్నవించెద నాకర్ణింపుము. రామచంద్రుండు మనలంకపై దండువిడిసినట్లును నీవును గుంభకర్ణుండును దక్షిణాభిముఖులై గార్దభంబులపై నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును నింద్రజిదాది కుమారవర్గంబును సైన్యంబును మూలబలంబును సర్వంబును నశించిపోవుచున్నట్లును సీతం జేకొని శ్రీరామచంద్రుం డయోధ్యకుఁ బోవుచున్నట్లును గలగన్నదఁట. త్రిజటకల నిక్కంబై తోఁచెడిని. రాముండు వానరసైన్యంబుతోఁ గూడి సముద్రతీరంబునకు వచ్చియున్నాఁడని చారులు విన్నవించిరి. ఆ రాముని దూతలు మరల నిచ్చటకు రాకమునుపే శ్రీరామచంద్రునకు సేబహుమానంబుగా సీత నర్పించుటయె లెస్స కార్యము ఇంత చెప్పనేల? మొన్న నొక్కదూత వానరవేషంబున వచ్చి తనపరాక్రమంబు నీకును బరివారమునకును నెఱింగించి పోయె నది గుఱుతుంచుకొమ్ము. అని యిట్లు నీతి చెప్ప తమ్మునిపైఁ గోపించి దిగ్గన కొలువుకూటంబు విడిచి యంతఃపురంబునకుఁ బోయె. నాసమయంబున నాసభలోనివారందఱును దమతమమందిరంబుల కరిగిరి. 13

క. మఱునాఁ డెప్పటియట్లనె
సురుచిరముగఁ గొలువు సేయఁ జోద్యంబుగ ని
ద్దురఁ బోవు కుంభకర్ణుఁడు
సరిగా మేలుకొని వచ్చె సరభసలీలన్. 14

వ. ఇట్లువచ్చి గృహప్రవేశంబుఁజేసి స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని భుజియించి మంత్రులతో నన్నకొలువునకుఁ జనుచుండుకుంభకర్ణునితో మరల విభీషణుండును మంత్రి సహితుండై వచ్చెను. అనుజు లిద్దఱును వచ్చి నమస్కరించిరి. దీవించి సేమం బడిగి యుచితాసనంబులం గూర్చుండ నియోగించినఁ గుంభకర్ణుం డత్యంతమును నాసన్నుండై కూర్చుండెను. కొంచెముదూరములోఁ గూర్చుండియున్న విభీషణుండు మరల నన్నతో నిట్లనియె. 15

సీ. దశరథరాముండు తనపత్నిఁ గోల్పోయి
వానరావళిఁ గూడి వచ్చి యిప్పు
డదె చూడు మంభోధియావలియొడ్డునఁ
గపిబలంబులతోడఁ గలిసి యుండె
రామునిసత్త్వంబు రమణిచే మున్వింటి
మాతనితమ్ముండు నట్టేఁడంట
పారిది వారికిఁ బ్రాపు సుగ్రీవుఁ డున్నాఁడు
వార్ధి నీఁ ముంచినవానితమ్ముఁ
తే. డాతఁ డిటు వచ్చి నిన్ను నుగ్గాడె కాని
సీతఁ దే నని పంతంబు చేసె నంట

వలదు వైరమ్ము సీత నీవలయు వేగ
నతని నని గెల్వఁగా జాల రమరవరులు. 16

తే. రాము గెలువంగ వచ్చునే రాజసమున
సీత నర్పించి తత్పదాబ్జాతములకు
నర్థిఁ బ్రణమిల్లి శర ణన్న నతఁడె కాచు
సత్యసంధుండు సత్కృపాసాంద్రుఁ డతఁడు. 17

ఆ. చంప వచ్చినట్టి శత్రువు నైననుఁ
శరణు చొచ్చునంత సదయుఁడగుచు
నభయ మిచ్చి కాచు టాతనిబిరుదంట
సీత నిచ్చి రాముఁ జేర బ్రదుకు. 18

వ. అనిన విని యారావణుండు కటకటంపడి విభీషణుని
తో రోషభీషణంబుగ నిట్లనియె. 19

తే. నీవు నాదాయతోఁ గూడి నీచబుద్ధి!
బుద్ధి చెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు!
కడగి నీమంత్రులును నీవుఁ గంటిలోని
నెరసు సరవిగ నున్నారు నిశ్చయముగ. 20

తే. నాకుఁ దమ్ముఁడవయ్యు ననార్యముగను
నాదుశత్రులఁ బొగడుచు నాకు బుద్ధి
సెప్ప వచ్చితి వౌరౌర సిగ్గు లేక
యిచ్చవర్తింపుచుండు టి దేమిపనిర? 21

వ. అనిన విని విభీషణుం డన్నకిట్లనియె. 22

తే. నిన్నుఁ జంపంగఁ దలపోసి నీదుమంత్రి
వరుల గాచుచు నున్నారు వలదు గోత్రి
కలహ మీచెడుబుద్ధి యేకరణి నబ్బె
నన్న! యింకొక్కకోసమాట యాలకించు. 23

వ. రామచంద్రుండు ఁ డాదినారాయణుండు సీత యాది లక్ష్మి, వానర బలంబు బృందారకసందోహంబు, గావుననీ వా రామచంద్రున కెదిరి జయంబుగొనుట కడిందికార్యంబు. నేఁ జెప్పినబుద్ధి విని వేగ నారాముని శరణుచొత్తుము. సుఖంబుగ మనుము. అని విన్నవించిన హితవచనంబులు రోగికిఁబథ్యాహారంబు రుచింపనిపోలికను వీనుల కసహ్యంబులై యుండ రావణుండు మండిపడి యిట్లనియె. 24

సీ. పటువిషం బొలికించుపాములతో నైనఁ
జెలఁగి యింపుగఁ జెలిమి సేయవచ్చుఁ
గాని శత్రులకు నెడ్డ గైవారములు సేయు
వానినిఁ దనపాలిబంధు నైనఁ
జేరఁ దీసినయేనిఁ జేటు వాటిల్లును
గావున వీనిబల్లర్వ మణఁతు
విను కుంభకర్ణ నీవును రాకమునుపు నీ
చెడుగు నాకును బుద్ధి చెప్పఁ బూనె

ఆ. ననుచు హుంకరించి యవ్విభీషణుఁ బట్టి
వేగఁ గత్తి భుజాన్ని ద్రోయఁ బోవ

నట ప్రహస్తుఁ డప్పు డడ్డమ్ముగా వచ్చి
దేవ! నీకుఁ దగునె యీవిధంబు. 25

క. నీ కేల యింతకోపము
నీకు హితముఁ జెప్పుచున్న నీతమ్ముని నీ
వే కత్తివేసి చంపిన
లోకులు నిను మెత్తురయ్య లోకస్తుత్యా! 26

తే. గుణయుతుండైన మనవిభీషణుఁడు లేని
లంక యేటికి సైన్యంబు లింక నేల
వైభవం బేల మామీఁదఁ బ్రాణ మేల
శాంత మవధారు దేవ! నీస్వాంతమందు. 27

వ. అని ప్రహస్తుండు రావణుకోపంబును గొంత శాంతపఱిచె; నప్పు డన్నకోపంబునకుఁ దమ్ముఁడు కుంభకర్ణుండు వడవడ వడఁకి యన్న కెదురాడ నోపక తమ్ముని గాదనలేక గద్దియ మీఁదఁ గూర్చుండియున్నయన్నకు మ్రొక్కి నిదురగృహంబునకుం జనియె నట విభీషణుం జూచి యోరీ! నీవు విశ్వాసఘాతుకుండవు, స్వామిద్రోహివిఁ గావున నీవు నాకొక్క పేదనరునిఁ బెద్దఁ జేసి చెప్పెద వాతఁడె పౌరుషశాలియేనినీవాతనిం జేరి సుఖంబున బ్రతుకుమనిన నతం డిట్లనియె. 28

సీ. విను రాక్షసేశ్వర విష్ణుసన్నిభుఁడు రా
ముండు హా! పేదనరుండె నీకు
నతనిసత్యస్థితి యతనిపరాక్రమం
బిపుడు నీ కెఱుఁగంగ నెట్టు లగును

అవనీశు బాణంబు లతిరయంబున వచ్చి
దండించునప్పుడైనఁ దలఁచు నన్నుఁ
బర్వతశిఖరముల్ పడినట్లు నీతల
లిలఁ గూలునప్పుడైనఁ దలఁచు నన్ను;

తే. నీకుఁ దమ్ముండ నాటచే నీవు బ్రతుకుఁ
గొఱకుఁ జెప్పిన నీ కింతకోప మేల
వినుము నామాట సీత నర్పించి యతని
శరణు వేఁడుము వలదు నీసాహసమ్ము. 29

వ. అని చెప్పిన హితవచనంబులకు మఱింతకోపోద్దీపిత మానసుండై యాజ్యాహుతిం బ్రజ్వరిల్లిన హుతాశనుగతి న్మండిపడి పెళ పెళ నార్చి గద్దియమీఁదం గూర్చున్న విభీషణునివక్షంబు పగులం దన్నిన నతండు తనకన్నులనుండి తొరఁగు జలకణంబులు హస్తంబులం దుడిచికొనుచు నాక్షణంబునన మంత్రులుం దానును దనతల్లియైన కైకసియొద్దకుం జని సాష్టాంగ దండప్రణామం బాచరించి యన్న చేసిన దుర్నయం బెఱింగించి శరణాగతవత్సలుండైన శ్రీరామచంద్రుని సన్నిధానంబునకుఁ బోవుచున్నాఁడ నని చెప్పి యామెయనుమతంబు వడసి దీవనలు గైకొని చని సముద్రతీరంబున విచారగ్రస్తుండై యున్న శ్రీరామచంద్రుని గని విభీషణుండు. 30

సీ. భానుకులోత్తంస పాలితామరలోక
జానకీనాయక శరణు శరణు

తాటకాప్రాణవిదారణ రఘురామ
సకలలోకాధార శరణు శరణు
దిక్కు నీవని వచ్చితిని దీనమందార
పరమపూరుష రామ శరణు శరణు
మాతృపితాదులమాడ్కి సంరక్షించు
సర్వలోకస్తుత్య శరణు శరణు

ఆ. రాను వెఱచినాఁడ రక్షించు రక్షించు
మిపుడు నాకు నభయ మిమ్ము యిమ్ము
చూడు చూడు నన్నుఁ జొచ్చితి శరణమ్ము
కావు కావు నన్నుఁ గరుణతోడ. 31

వ. అని యివ్విధంబున రామచంద్రుని స్తుతి సేయుచుఁ జేరవచ్చుతఱిని సుగ్రీవుండు శ్రీరామచంద్రునింగని విశ్వాసంబుసూపువాఁడై దేవా! వీఁడు రావణునితమ్ముండు విభీషణుండనువాఁడు, రాక్షసులు మాయలు సేయుదురుగాన వీనివధియింప నాజ్ఞ యొసంగు మనిన రామచంద్రుం డందులకుసమ్మతింపక యితం డెవ్వం డైన నేమి, శరణన్న రావణునితమ్మునినే కాదు రావణు నైనను గాచెద, శరణని వచ్చినవానిప్రాణంబులు గాపాడుట రాజులకుఁ బరమధర్మంబు. తొల్లి శిబిచక్రవర్తి రాజ్యంబు సేయుచుండ నొక్కఖగం బేతెంచి శరణు జొచ్చిన నభయంబిచ్చి తన దేహముం గోసి దానిందఱిముకొనివచ్చిన డేగ కిచ్చెనటు; కావున నాతని నాయొద్దకు గొనిరమ్మనవుడు సుగ్రీవుండు విభీషణునిఁదోడ్కొని తెచ్చి శ్రీరా

మచంద్రుని పాదారవిందములపైఁబడవైచిన నతండు విభీషణు
నెత్తి యాలింగనంబు చేసి యభయ ప్రదానం బొసఁగి నేఁడు
మొదలు నీవు మాకు హితుండవు, బంధుండవు నయితివి, కావు
న నిన్ను మాతమ్ములలో నొకనిగాఁ జూచుకొనియెద నని
నమ్మఁబలికి విభీషణా! యింక వైరిప్రభావంబు చెప్పుమనిన దశ
రథనందనునకు వందనం బాచరించి కరంబులు శిరంబున ధరియించి
యతం డిట్లనియె. 32

క. రావణుబలసత్త్వస్థితి
యావీరుని శౌర్యమహిమ యభినుతి సేయన్
నావశము గా దతం డల
దేవేంద్రుని బెట్టి గొనును దినము నరేంద్రా! 33

క. ఒక్కొక్క గవని వాకిట
నొక్కొక యేనూఱుకోటు లుందురు దైత్యుల్
పెక్కురఁ గావలి యుంచును
దక్కక మఱి యెల్లకడలఁ దానును దిరుగున్. 34

వ. తన కుమారవర్గంబు లక్షయుంబదివేలు. వారల
నొక్కొక్కరికి లక్షమంది బంట్ల నేర్పఱించి యుంచిన, వారు
లంకవీథులలోఁ గొందఱును నగరుచుట్టును గొందఱును మఱి
కొన్ని చోట్ల మఱికొందఱును గుంపుగూడి తిరుగుచుందురు.
అయినను బ్రహ్మాదులకైన నను సాధింప వలనుపడని లంకాపట్ట
ణము మీచేత సాధింపఁ బడఁగలదు. కావున మీరు వేవేగ

సముద్రునిం బ్రార్థించి సముద్రబంధనంబు సేయవలయు ననిన నంత మహేంద్రపర్వతంబు డిగ్గి సముద్ర ప్రాంతంబున విడిసి జాంబవదంగదసుషేణనీలముఖ్యులం దాది వనచరవీరులచేత నలు దిక్కుల యందుంగల పర్వతంబులును వృక్షంబులును బాషాణంబులును దెప్పించి కడలి కట్టం గడంగిన. 35

శా. కూపారుండును సంతసిల్లి జలజాక్షుం జూచి మిన్నంది స
ల్లాపం బుద్ధతి బొంగఁ జూచి విరసోల్లాసంబునన్ రాఘవ
క్ష్మాపాలుండును గోపముం గదుర నీగర్వంబు నాచేత వ
మ్మైపోనిప్పుడటంచులక్ష్మణుఁడువిల్లందియ్యఁబెన్వేకతోన్. 36

మ. పరుషోద్యత్కుటిలాకృతిన్ బొమలు చూపట్టంగశోణప్రభో
త్కరరేఖల్గనుఁగొల్కులన్ని గుడఁ గోదండంబు చేఁదాల్చిభూ
వరవంశాగ్రణి రాముఁడద్భుతముగా వారాశిమీఁదన్ వడిన్
శరజాలంబులు పేర్చి వ్రేయుటయునిచ్చన్ బ్రాణభీతిన్ వడిన్.

క. రాముని మొదుట సముద్రుఁడు
తా మానవరూపుఁ దాల్చి దైన్యము దోఁపన్
రామునకు మ్రొక్కి యప్పు డా
ధీమంతున కనియె నిలిచి తేజం బెసగన్. 38

ఆ. ఇంక నేల తడయ నినకులాధీశ్వర!
కపులఁ బంపి వేగఁ గట్టుమయ్య
కట్ట గట్టి దాఁటు కమలాప్తకులచంద్ర!
నీదు కీర్తిలతకు నెలవు గాఁగ. 39

వ. మిమ్ము దరిసించుటకు మిన్నంటఁ బొంగితి నింతియకాని కపటోపాయంబునఁ బొంగినవాఁడను గా ననిన రామభద్రుండు కరుణాసముద్రుండు గావున సముద్రునెప్పటి యట్ల యుండ నియమించి వానరులం బనిచిన. 40

క. రాముని పంపునఁ బ్లవగ
స్తోమం బ ట్లరిగి యరిగి దొ డ్డగుకొండల్
క్షేమమునఁ దెచ్చి జలనిధి
రామాజ్ఞను వైచి రధిక రభసం బొప్పన్. 41

వ. ఇట్లు వానరవీరులు పర్వతపాషాణ వృక్షజాతంబులు లక్షోపలక్షలుగాఁ దెచ్చి వారాశిం బడవైచి తద్గభగుభధ్వానంబుల కుప్పొంగుచు బ్రహ్మాండభాండంబు బ్రద్దలగునట్లుగా నార్చుచు నట్టహాసంబులు సేయుచు గంతులు వేయుచు వెక్కిరింపుచుఁ బరువులెత్తుచు మున్ను దెచ్చివైచినపర్వతాదుల నెల్ల దిమితిమింగిలములు మ్రింగ నా సమయంబున. 42

ఆ. తిరుగ దెచ్చివైనఁ దేలి రాకుండుట
నాత్మలోన సంశయంబు నొంది
రాజసింహుఁ డపుడు రత్నాకరునిఁ జూచి
యడుగుటయును వేగ నాతఁ డనియె. 43

సీ. రావణుపంపున రా లెల్లఁ జేపలు
మ్రింగుచుండె గదయ్య మేదినీశ!
తిమితిమింగిలములు దిరుగుచు నాయందు
నుండి రావణుపంపు నొనరఁజేయు

నలుఁడు కట్టినఁ గాని నిలువ నేరదు కట్ట
నలునిఁ బంపగదయ్య నలిననేత్ర!
యని సరిత్పతి సెప్పి యవ్వేళ జరిగిన
వీరు లిచ్చట మహా వీర్యముననుఁ

తే. పర్వతంబులు తేరఁగా భానుకులుని
పంపుచేతను వారధిఁ బరఁగ వేగ
నలుఁడు నాపొద్దె పదియోజనములు గట్టె
నంతలో సూర్యుఁ డస్తాద్రి కరుగుచుండె. 44

వ. అంత సూర్యాస్తమయం బగుటయు వానరేంద్రులు తమ బలంబులంగూడి వేగునందాఁక సేతుబంధనంబునకుఁ గాపుండి రంత సూర్యోదయం బయినవెంటనే మహాబలశాలి యగు హనుమంతుండు సువేలాద్రి కరిగి యానగంబుపొంత నున్న హేమకూటంబును నాగపర్వతంబును సింహాచలంబును నగు మూఁడు కొండలు వాలపాశంబునం బెకలించి నిమ్మపండ్లమాడ్కిఁ బూలబంతుల వంతున నెగరవైచుచు నేతెంచి నలుని కందిచ్చిన నాపర్వతంబులు మూఁడును దొంబదియోజనంబులు నిడుపుగల్గియుండ నిట్టిదంబున శతయోజనములు నిడుపును దశయోజనంబులు వెడల్పుగా నీరధిని బంధించి నలుం డా వార్త రాముని కెఱింగించిన తోడనే యతండు లంక లగ్గలు పట్ట నుద్యోగించి పనసు నుత్తరపు గవను జాంబవంతుఁ బడమటిగవను గవయు దక్షిణపుగవను హనుమంతుఁ

దూరుపు గవనుఁ బట్ట నియమించిన వారలను లంకాపురంబు లగ్గలకుం జొచ్చి రాక్షసుల నుగ్గునూచంబు గావించుచుండ హతశేషులు పరుగెత్త యావింతయంతయు రావణున కెఱిం గించిన నతండు చింతాక్రాంతుఁడై దేవాంతక నరాంతక కాతి కాతికాయత్రిశిరోమహోదర మహాపార్శ్వాదుల రామలక్ష్మ ణులం జంపి వారిశిరంబులు గొని రండని పనుప వారరుగు దెంచి ఘోరాహవంబునం దమశిరంబులె రామ లక్ష్మణుల బాణంబుల కర్పించిన వారిలోఁ జావక మిగిలినయతికాయుం డరుగుదెంచి తండ్రియగు రావణున కిట్టు లనియె. 45

శా. దేవా! భానుకులావతంసుఁడు మహాధీరుండు రాముండు బా
హావిఖ్యాతమహాప్రతాపమున దైత్యావ్రాతమున్ భూరివీ
రావేశంబునఁద్రుంచెబో మనమునం దాశ్చర్యమున్ భీతి
యున్ద్రోపన్ వేఱ వచింపనేల యిఁకఁ దద్ఘోరప్రతాపో
న్నతుల్. 46

వ. అని యతికాయుఁడు విన్నవించిన నుల్కిపడి కుంభ కర్ణుని మేల్కొలుప బనిచిన నతండును లేచి యావులింపుచుఁ బండ్లుగీటుచు లయకాలమృత్యువు బోలె నేతెంచిన నట్టి యనుజుం జూచి దశముఖుం డిట్టు లనియె. 47

క. అనిలో నీ వారాముని
ననుపమబలశాలి యైనయనిలతనూజున్
ఘనుఁ డగు లక్ష్మణుఁ గూలిచి
విను, వారలతలలు గొంచు వేగమ రమ్మా. 48

వ॥ అని యనిపిన. 49

సీ. భేరీమృదంగాది భీమవాద్యధ్వాన
ములకు సముద్రముల్ పొంగి పొరలఁ
గపులపాలికి లయకాలుఁడో యనుచును
వినువీథి దివిజులు వెఱచి తొలఁగ
నతికాయుఁడును మహాహంకారమున వేగ
వెనువెంట రోషప్రవృత్తిఁ జనఁగఁ
గుంభకర్ణుండు కాకుత్స్థుపైఁ బోయిన
దక్షిణోత్తర సముద్రములరీతిఁ
తే॥ గదిసి యిరువురుఁ బోరాడఁ గడఁగుటయును
గపులు వేవేగ వచ్చిరి విపులశక్తి
సాధ్యగంధర్వపతులెల్ల సరభసమున
జూచుచుండంగఁ బోరిరి సురుచిరముగ. 50

వ॥ ఇట్లు పెద్దయుం బ్రొద్దు వీరావేశంబునఁ బోరుచుండఁ గుంభకర్ణుండు విజృంభించి బలంబుల కుఱికి దిగ్గజకర్ణపుటస్ఫోటితంబుగా నార్చుచు వానరవీరుల నసంఖ్యాంబుగా ద్రుంగుటకుం గడంగిన రఘువీరుండలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి వాని శిరంబును దునుమాడె; నంత నతికాయుండు తన పినతండ్రిపాటున కలిగిన రాఘవేంద్రుని కభిముఖంబుగా నిలిచి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండ లక్ష్మణుం డడ్డుసొచ్చి నానాస్త్రంబులు ప్రయోగించి ఘోరంబుగా యుద్ధంబుసేసి

కడపట వారుణాస్త్రంబు వింట సంధించి విడిచిన నది యతికాయుని శిరంబుం దుంచె; నంత హతశేషులైన రాక్షసులు కాందిశీకు లయి రావణుం జేర. 51

తే. దేవ! దేవాంతకుఁడు వచ్చె దీనవృత్తిఁ
గుంభకర్ణుండు సమసెను ఘోరలీలఁ
గెగువ నతికాయుఁడును మ్రగ్గె దీని కింకఁ
బూని ప్రతికార మొనరింపు భూరితేజ! 52

వ. అని విన్నవించిన మండిపడి రావణుం డింద్రజిత్తుం బంపిన నతం డాగ్రహంబున, 53

క. పరవీరులపై వైశ్వా
నరుచేఁ గొన్నట్టి చాపనారాచములున్
బరిఘయు బ్రహ్మాస్త్రముఁ గొని
దుర మొనరింపంగ వచ్చె దోర్బలశక్తిన్. 54

వ. తదనంతరంబున. 55

క. తండోపతండములుగాఁ
జండాశుగసమితిఁ బఱపి శైలశరాళిన్
గాండమయంబుగఁ జేయుచు
భండన మొనరించె దైత్యపతిపుత్త్రుండున్. 56

సీ. మిన్నక రామసౌమిత్రులమీఁదను
బ్లవగసేనలమీఁదఁ బావకశక్తి
బ్రహ్మాస్త్ర మడరింపఁ బటునినాదంబునఁ
బఱ చెంచి వానరప్రతతిమీఁద

బ్రహ్మమంత్రజ్ఞానపరులైనవారి ని
ర్బంధంబుగాఁ జుట్టి పట్టి కట్టి
తక్కినవారల నుక్కడంగించినఁ
గనుగొని యమరేంద్రకంటకుండు

తే. వైర మెల్లను నేఁటితోఁ దీఱె ననుచు
మించి కేరలుచు విల్లెక్కుడించి పొదలి
శాంతతను బొంది రాక్షసచక్రవర్తి
కడకు నేఁగెను వడి ముద్దుఁగొడుకుఁ గూడి. 57

క. మునినాయక వినుమంతటఁ
దనమనుమలపాటు దెలిసి తనలోఁదానే
కనుఁగొనఁ జాలక పోయెనొ
యనఁగను నపరాబ్ధిలోన నర్కుఁడు గ్రుంకెన్. 58

క. అరవిందభవుని కరుణను
పర మందినవాయుసుతుఁడు వసుమతిమీఁదన్
మఱి బ్రహ్మమంత్రజపమున
బిటుదై యున్నట్టి యలవిభీషణుఁ డొకఁడున్. 59

వ. తక్కఁ దక్కినవా రెల్లరును మూర్ఛాగతులై చచ్చినయట్లు పడియున్న సమయంబున వాయుసుతుండును విభీషణుండును దమలో నెవ్వరువచ్చిరో నొచ్చినవా రెవ్వరో విచారింపం దగునని మహోగ్రాంధకారంబు వలను నింగలపుఁ గొఱవులు పట్టుకొని రణాంగణంబుఁ గలయ శోధింపుచువచ్చి శరతల్పంబున నున్న జాంబవంతునిం గని విభీషణుం డిట్లనియె. 60

క. భల్లూకేశ్వర! వానరు
లెల్లను నృపవరులతోడ నిలమీఁదను మూ
ర్ఛిల్లియుఁ జచ్చియు నున్నా
రొల్లంబోవుచును దీని కుపమ యెటన్నన్. 61

అ. అప్పుడు జాంబవంతుఁ డసురేశ! నీవంకఁ
గన్ను విచ్చి చూడఁ గానరాదు
వాయుసుతుని మేలువార్త నా కిప్పుడు
చెవులు సోఁకునట్లు చెప్పు మయ్య. 62

వ. అనిన విని హనుమంతుండును. 63

చ. పదములఁ జేరి మ్రొక్కుచును బాణియుగంబును మోడ్చి నీ
కృపన్, బ్రదికినవాఁడ నన్న నతిప్రీతిని చేరఁగఁదీసి నీవిటన్
బ్రదికితి గాన నీకతనఁ బార్థివముఖ్యుని సేవ లన్నియున్ బ్ర
దుకునిజంబుగానిప్పుడు పావనియంచుఁ బ్రియంబు సేయుచున్.

వ. వినుము వాయునందనా! యీలవణసముద్రంబున్ దాఁటి హిమవంతంబును నిషధాచలంబును గడచి మేరుశైలంబును వెండికొండయును శ్వేతపర్వతంబును నతిక్రమించి ఘృతసాగరంబులంఘించి ద్రోణగిరిమధ్యంబునందున్న యోషధ శిఖరంబునం గలసంజీవన్యాది దివ్యౌషధంబులు గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబులప్రాణంబులునిలిపి కీర్తివడయు మని ప్రార్థించిన నియ్యకొని వాయునందనుండు వాయువేగ మనోవేగంబులం జని జాంబవంతుండు సెప్పిన దివ్యౌషధాచలంబునె కొని

వచ్చి సకలసైన్యంబుల ప్రాణంబులుగాచి నిమేషమాత్రింబున
నకొండ తొల్లింటి యునికిపట్టున నెలకొల్పివచ్చెనప్పుడు. 65

క. ఇనుఁ డుదయపర్వతంబున
గనుపట్టినఁ దెల్లవాఱ గపిసైన్యములున్
జననాథుఁ గాంచి మ్రొక్కిరి
జనపతియును వాయుసుతుని సంశ్లాఘించెన్. 66

వ. అంత నింద్రజిత్తుపరాక్రమంబునకు సంతోషించి
నిజంబును గల్లయును దెలియుటకు రావణుం డనుపఁ జారు లే
తెంచి యుత్సాహంబుతో యుద్ధసన్నద్ధులై కెరలుచున్న వానర
బలంబులం గనుంగొని మరలి చనుదెంచి రామచంద్రునిబలం
బున్న తెఱంగెఱింగించిరి.అదివిని కలంగియుఁ గలంగనిభంగి
నాశ్చర్యంబునొంది రామలక్ష్మణులపైఁకి గుంభనికుంభ ధ్వాక్ష
ప్రజంఘ శోణితాక్షులం బంపిన వారును చతురంగబలంబుల
తోడఁ గరి తురగ రథారూఢులై వెడలి సింహనాదంబులు
సేయుచు వానర సైన్యంబుపై గవిసి శరవర్షంబులు గురియుచు
బరిఘలం జక్కు సేయుచు నడిదంబుల వ్రేయుచు ముద్గరంబులం
జెండుచు ముసలంబుల మోఁదుచుఁ గరులచే మట్టింపుచుఁ
దురంగములచేఁ ద్రొక్కింపుచు రథంబులం దోలి వెంపర
లాడుచు మహాహావంబు సేయుసమయంబునఁ గపిబలంబు
లడరి గిరివర్గంబులు దరువర్గంబులు ననర్గళంబుగఁగైకొని ప్రతి
ఘటించి పోరాడునప్పుడు. 67

క. తెంపున వాలికుమారుఁడు
కంపనుఁ డనువానిఁ జెదర్పఁ గనికోపమునన్
గంపింపఁ బట్టి వానిని
జంపెను వక్షంబు పొడిచి సాహసవృత్తిన్. 68

వ. అప్పుడు. 69

చ. కనుఁగొని శోణితాక్షుఁడు సకంపన ప్రాణము గొన్న వాలిసం
దనుని పయింగడుం గెలిసి తార్కొని తాఁకి రథంబు దోలినన్
గనలుచు నంగదుండు తురగంబులతోన రథంబు నుగ్గుగా
దనుజుని మీఁదఁ దానుఱికి తన్నిన వాఁడును గూలె నేలపైన్.

ఆ. అతఁడు నేలఁ గూల నాప్రజంఘుండును
ఘనుఁడు యూపనేత్రుఁ డెనసి వాలి
కొడుకు మీఁద రాఁగఁ గోపించి మైందుండు
ద్వివిదుఁ డంతలోనె తెంపు మిగిలి. 71

క. దనుజులఁ దోలఁ బ్రజంఘుఁడు
గనుఁగొని యువ్వాలిసుతుని కటములు పొడువన్
గనలి నిశాచరు శిరమును
ఘనతరదృఢముష్టిఁ బొడిచి కడపెన్ ధరకున్. 72

సీ. ఘనుఁడు ప్రజంఘుండు కదనంబులోఁ బడ్డ
నక్షయబలుఁడు యూపాక్షుఁ డంత
గడకొని వ్రేసిన ఘనతతోఁ గుప్పించి
భుజశక్తి నాతనిఁ బొదివి పట్టి

కొనిపోవునప్పుడు కోపించి యన్నకై
శోణితాక్షుఁడు వచ్చి శూరుఁ డగుచు
విడిపించుకొనఁ జూడ వడిగ మైందుఁడు డాసి
కలన యూపాక్షుని గదిసి పోరి

తే. సాహసంబున నొఱలంగఁ జంపుటయును
శోణితాక్షుఁడు ద్వివిదుని జూచి పొడువ
నతఁడు మూర్ఛిల్లి తెప్పిరి యసురుఁ బట్టి
శిరము కూలంగ నడిదంబుచేత వ్రేసె. 73

తే. శోణితాక్షుండు పోరిలోఁ జూర్ణ మయినఁ
గుంభుఁ డప్పుడు కోపించుకొనుచు వచ్చి
ద్వివిదు నెదురొమ్ము నాటఁగఁ దీప్తశరము
లేసి వడిఁ జంపె నాజిలో నేమి చెప్ప. 74

క. తమ్మునిపాటు గనుంగొని
హనుమ్మని మైందుండు కుంభు నురుతరముష్టిం
బొమ్మునఁ బొడిచిన నతఁ డా
క్షణమ్మునఁ గూలంగనేసె నమరులు దలఁకన్. 75

ఉ. అంగదుఁ డంతఁ గుంభునిశతాంగముపై నొకపర్వతంబుభూ
మిం గలయంగ వ్రేయుటయు మేదినికిం వడిదాఁటి వాలిపు
త్రింగని దైత్యుడాగ్రహముతో ముసలంబున వ్రేయనొచ్చి
తోఁ, కంగని వజ్రిపౌత్రుఁడు సగర్వముగన్ దగ నొదె
నార్చుచున్.
వ. అట్టి యవసరంబున. 77

క. కాలాంతక రుద్రులతోఁ
బోలుపఁ డగు కుంభుఁ డపుడు భుజబలశక్తిన్
వాలికుమారుని ధరపైఁ
గూలఁగ వడి వేసె నైదుకోలలచేతన్. 78

వ. ఇట్లు వాలికుమారుండు కుంభునిచేత బాణపీడితుం
డై పడుట యెఱింగి రామచంద్రుఁడు వానిపై సుగ్రీవజాంబ
వద్దనుమదాదులం బంపిన. 79

క. వారంద రధిపునాజ్ఞను
భూరుహములు గిరులుఁ గొనుచు భువనము లదరన్
బోరన నార్చుచుఁ గుంభుని
దారసమై వ్రేసి రంత దర్పోద్ధతులై. 80

క. వారలు వ్రేసినతరుగిరు
లారయఁ డనుఁ దాకకుండ నవితునియలుగాఁ
గ్రూరాస్త్రంబులఁ దునుముచు
నారసముల వారివారి నాటఁగ నేసెన్. 81

క. ఏసిన గుంభుని రవిజుం
డాసనుయమునందు నేసె నద రంటంగా
వేసినఁ గ్రమ్మఱ రవిజుని
గాసిల వక్షంబు పొడుగఁగా నిలఁ బడియెన్. 82

తే. మూర్ఛ తేఱి యారవిజుఁడ యోఘముష్టి
పూని దైత్యునిఱొమ్ముపైఁ బొడువ నంత

శరధి మథియించుమందరాచలముమాడ్కి
ధీరత యడంగి దిర్దిరఁ దిరిగి పడియె. 83

ఉ. కుంభుఁడుగూలినంగని నికుంభుఁడుదాఁబరిఘాయుధంబుసం
రంభ మెలర్పఁ ద్రిప్పి దినరాజతనూజునిపైకి రాఁగ బల్
సంభ్రమ మొప్ప వాయుజుఁడు శౌర్యముగన్పడ నడ్డమైనది
క్కుంభిగముల్ కలంగఁగనుగొబ్బునవక్షమువై చెనార్చుచున్.

క. వేసిన పరిఘాయుధ మది
వీసము నాటంగలేక విఱిగిన మింగులఁ
గాసిలి దైత్యుఁడు పవనజు
నాసమయమునందు నేసె నడిదముచేతన్. 85

తే. అంత హనుమంతుఁ డుగ్రుఁడై యసురగళము
నందు వాలంబు దగిలించి యాకసమునఁ
ద్రిప్పి ధరణీతలంబునఁ ద్రెళ్లఁగొట్టి
సింహనాదంబు జేసె నచ్చెరువు గాఁగ. 86

వ. అట్టి సమయంబున. 87

క. హతశేషులు ఘటకర్ణుని
సుతు లాహవభూమిఁ దెగినసుద్దులు లంకా
పతి కెఱిఁగించిన దుఃఖో
న్నతుఁడై యొక్కింతతడవునకు నిట్లనియెన్. 88

తే. మనకుఁ గలయట్టిబాంధవగణము సుతులు
బోరలుఁ బరివారమును గంధకరులు హరులు
గుటిలకపియూథములబారి గొఱియ లగుచుఁ
దెగిరి మునుమున్నె నేటితోఁ దీవ్రగతిని. 89

వ. అని చింతింపుచుఁ గొంతవడికి ధైర్యంబుంగొని, 90

క. వైదేహీవల్లభుఁడు గడఁ
గీర్తిఁ మకరాక్షుఁ జూచి పృథుతరశక్తిఁ
ఖ్యాతండై ఖరునిఁ జంపిన
యాతనిపై సూడు వీఁగు మరుగు మటన్నన్. 91

సీ. సింధురరథభటసైంధవంబులతోడఁ
దఱచైన పట్టుఛత్రములతోడఁ
బటహభేరీముఖ్యబహువాద్యములతోడఁ
దట్టంపునానాయుధములతోడ
వందిమాగధసూతబృందస్తుతులతోడఁ
గెరలాడు బిరుదు టెక్కెములతోడ
బహుళకాహళశంఖభాంకారములతోడ
రాజిల్లునవచామరములతోడ

తే. నడిచె దిగ్దంతిభూదారనాగకూర్మ
కులనగేంద్రయుతముగ భూతలము గదలఁ
బదరజఃపాళి సంఛన్నభానుఁ డగుచు
దక్షుఁ డైనట్టిమకరాక్షుఁ డాక్షణంబ. 92

వ. ఇట్లు భయంకరాకారంబుగాఁ గదలి వానరవీరుల తోడం దలపడి పోరాడునెడ వానరబలంబులు తలచెడి పాఱుట గని రాజపుంగవుం డోహో వెఱవకుఁ డని తన మఱువున కర్గ మరలించి మకరాక్షుం దేఱిచూచి చండకాండముల తండంబులు ఖండించి హరుల శరంబుల పాలుచేసి రథంబులను సారథులతోడంగూడఁ బృథ్విం గలిపి బలంబులఁ జలంబునం దఱిమి సింహనాదంబు చేసినం గినిసి మకరాక్షుం డిట్లనియె. 93

క. మాతండ్రి ఖరునిఁ జంపిన
నీతో యుద్ధంబు సేయ నేఁ డిదె కలిగెన్
నాతీవ్ర నిశితసాయక
పాతంబులపా లొనర్తుఁ బగదీఱ నినున్. 94

మ. అనిగర్వోక్తులు వల్కుచున్ గెరలితీవ్రాస్త్రంబులా రాముపైఁ
దనబాహాబలశక్తి నేయఁ గని కోదండంబునన్ దప్పుచున్
వనజాప్తాన్వయుఁడేసె వానినట గీర్వాణుల్ ప్రశంసింపగా
దనుజుం డేసెను రామభూవిభునిపై దద్బాణ జాలంబులన్.

క. ఆశరము లుడిపి మఱియొక
యాశుగమున వానిచాప మపుడు దునిమి యా
దాశరథి రథము పొడిగాఁ
గౌశలమున నేయ వాఁడు క్ష్మాస్థలి కుఱికెన్. 96

ఆ. ధరకు నుఱికి దుష్టదైత్యుండు గదఁ ద్రిప్పి
భానుకులుని నేయ దాని నొక్క
విశిఖముననె తునిమి వేగంబె విభుఁ డగ్ని
శరముఁ దొడిగి వానిశిరముఁ ద్రుంచె. 97

క. ఆమెడ మకరాక్షుఁడు రిపు
సాయకములు దూఱినాటి చచ్చుట విని దై
తేయుఁడు గుండెలు వగులఁగఁ
బాయనిదుఃఖంబు పాలుపడి చింతిల్లెన్. 98

వ. ఇట్లు చింతాక్రాంతుండై కొంతతడ వూరకుండి
మేఘనాదునిఁ గనుంగొనియె. 99

క. అక్కట! నీవును నేనును
దక్కఁగ మఱి తక్కినట్టి దళములు దెగఁగా

నొక్కకపియైనఁ గానీ
యక్కడ రిపులందు నొచ్చిరనఁగా వింటే. 100

వ. అదియునుం గాక. 101

సీ. నాగపాశంబున నాఁ డాఁజిలోఁ బడ్డ
ప్లవగు లీరీతిని బ్రదుకు టెట్లు
బ్రహ్మాస్త్రమునఁ గూల్పఁబడి ధాత్రి యెడఁబాసి
పోయిన కపులెల్లఁ బుట్టు టెట్లు
కుంభకర్ణుఁడు సావఁగొట్టిన వానరుల్
చెచ్చెర జీవించి వచ్చు టెట్లు
అతికాయుఁ డడఁగించినట్టి కీశబలంబు
క్రమ్మఱఁ దానెల్లఁ గలుగు టెట్లు

తే. రాముఁ డెన్నంగ నాదినారాయణుండె
వనచరావళు లెల్ల దేవతలు మున్నె
కాన లేనైతి నీరీతిఁ గదనమునను
వారి గెలువంగ నెవ్వారివశము చెప్పుమ! 102

వ. అని దీనాలాపంబు లాడుచున్న తండ్రికి నమస్కరించి మేఘనాదుండు మేఘగంభీరవాక్యంబుల దుఃఖోపశమనంబు చేసి నేఁటితోడఁ బగసాధింతు నని ప్రాగల్భ్యంబుగఁ బలికి యనిపించుకొని గజవాజిశతాంగాదులగు చతురంగబలంబులు గూర్చుకొని ఛత్రచామరంబులు పిక్కటిల్ల నట్టహాసంబు సేయుచు లంకాపురంబు వెడలి సంగ్రామరంగంబునకుం జని తనబలంబులఁ జక్రాకారంబుగా నిలిపి తన్మధ్యంబున రథావతరణంబుచేసి రక్తాంబరగంధమాల్యంబులు ధరియించి లోహ

పాత్రింబునఁ గృష్ణసర్పరక్తంబు నించి తర్పణంబు చేయుచు
దద్విధియుక్తంబైన హోమంబులు సేయుచుండునెడ నొక్క
కృత్తిప్రత్యక్షంబై నిలిచి మెచ్చితి వరంబిచ్చెద వేఁడు మనిన
నతండు తా నాకసంబుననుండి భండనంబు సేయునెడ గపుల
కుం గానరాకుండ నంధకారంబు గావించిన నేను వారిని
జయింతు నని ప్రార్థించిన నియ్యకొనియె; నంత మేఘనా
దుండు నభంబున కెగసి మహాంధకారబాణంబు వేసిన
దానంజేసి పెంజీఁకటిం గప్పిన జీకాకై పాఱుచున్న వానరు
లంగని వాయునందనుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. 103

క. వాయువ్యాస్త్రముచేతను
బాయును జుమ్మంధకారబాణవిక్షేపం
బీయెడ నేయుఁడు శ్రీరఘు
నాయక! యని విన్నవింప నవ్విభు నంతన్. 104

క. విల్లెక్కువెట్టి మారుత
భల్లము సంధించి తివిచి పార్థివుఁ డలుకన్
బెల్లార్చి యేసె గగనం
బెల్లను వడిఁ దూల దైత్యుఁ డిలపై గూలన్.

ఆ. రాజతిలకుఁ డంబరమ్మున కెగయంగ
వాయుశరముఁ దొడిగి వేయుఁ దడవె
మాయశక్తి దొలఁగిపోయిన నంతలో
మేఘనాదుఁ డుర్విమీఁదఁ బడియె. 106

చ. పడియును మేఘనాదుఁడును పర్వులువెట్టిల నుగ్రబాణముల్
తొడిగి ప్లవంగ సేనపయిఁ దోరముగా నడరింపనంతటన్

బెడబెడ నార్చి మారుతివిభీషణు లుగ్రిత దానవావళిన్
బొడిపొడిసేయలక్ష్మణుఁడుపూనికనాతనిఁదాఁకెనార్చుచున్.

క. అంతట దానవ సేనలు
పంతము చెడి తలలు వీడఁ బారంగని తా
నెంతయు వెఱవకుఁ డనుచును
గుంతము ద్రిప్పుచును దైత్యకుంజరుఁ డంతన్.

శా. సౌమిత్రిం గని గర్వ మొప్పఁ బలికెన్ శౌర్యంబు సంధి
ల్లఁగా। నామీఁదం బఱపింపవచ్చితివె నానాగాస్త్ర సంఘం
బులన్ । నే మిమ్ముందఱఁ గట్టుటల్ మఱచితే నేఁడైనఁ
జింతింపుమీ। నీమానసత్త్వ విశేషమెల్ల మదిలో నిక్కం
బుగా లక్ష్మణా!

వ. అని బాణప్రయోగంబు సేసిన. 110

క. వానిని బ్రతిశరములు దాఁ
బూనిక సంధించి త్రుంచి భుజబలకీర్తిన్
దానవుని మూర్ఛ వుచ్చెను
భానుకులుం డంత నొక్క బాణముచేతన్. 111

ఆ. ఇంద్రజిత్తుఁ దప్పు డినకులోద్భవునిచే
మూర్ఛనొంది తెలిసి మూర్ఛగతిని
భాసమానమైన బ్రాణత్రయంబున
నతని నొవ్వ నేసి యార్చె నంత. 112

సీ. సౌమిత్రి తా వాని చాపంబు నడిమికి
ఘనతరాస్త్రంబుచేఁ దునుఁగ నేసి

పదిబాణములు వాని బాహుమధ్యంబున
గాటంబుగా వడి నాట నేసి
తురగంబులను నాల్గు తూపులఁ దునుమాడి
సారథి నొక్కటఁ సంహరించి
శరవృష్టిఁ గప్పిన సురవైరి కోపించి
కాద్రివేయాస్త్రసంఘుంబు లేయ
తే. గరుడశరమునఁ దునిమి లక్ష్మణుఁడు కినిసి
వడిఁ గుబేరాస్త్ర మతనిపై వైచె నసుర
దానిఁ దునుమాడి వేగ నైంద్రాస్త్ర మేసె
నరవరుఁడు దాని యామ్యాబాణమునఁ దుంచె. 113
వ. ఇట్లు తుంచిన. 114
క. వరుణాస్త్రంబును నేసెను
సురరాజవిరోధి రాజసూనునిమీఁదన్
గర మలిగి రాముసోదరు
డరుదారఁగ దానిఁ దుంచె నైంద్రాస్త్రమునన్. 115
వ. మఱియును. 116
తే. కనలి దానవుఁ డతనిపై గంధపుష్ప
సమితి నొప్పెడుగంధర్వశరముఁ దొడిగి
వ్రేయఁ గోపించి దశరథోర్వీపసుతుఁడు
ఖండశశిబాణమున దాని గం డడంచె. 117
వ. ఇట్లు గంధర్వశరంబును దుంచి యంతటం బోవక
దేవేంద్రదత్తంబైన భుజగాస్త్రంబు వింట సంధించి వేదంబులు
సత్యం బగునేని రామచంద్రుండు ధర్మాత్ముండేని యింద్రాది
బృందారకద్రోహి యైన యింద్రజిత్తునిశిరంబు నీశరంబుద్రుం

చుంగాక యని వానిపై లక్ష్యంబు చేసి ప్రత్యాలీఢ పాదస్థుండై నిలిచి కర్ణాంతంబుగాఁ సిలిచి దిగిచి యేసిన నదియును గాలానలాభీరజ్వాలాజాలంబు లుప్పతిల్ల గగనంబునం బఱతెంచి యక్కఱకురక్కసుని శిరంబునఁ ద్రుంచిన,

క. కనుఁగొని దేవత లందఱుఁ
దనుఁ బొగడఁగ మరలి రాముతమ్ముఁడు విజయం
బున వచ్చి మ్రొక్క నాతని
మనుజేంద్రుఁడు కౌఁగిలించి మఱి యిట్లనియెన్.

క. నీచేత వీఁడు త్రుంగుట
భూచక్రం బెల్ల మేలు పొందెను వినుమీ
నాచేత దశముఖుండును
నీచుఁడు తెగు టెల్ల నిజము నిర్మలచరితా! 120

వ. ఇట్లు సౌమిత్రిచేత నింద్రజిత్తు తెగె నని చెప్పిన వారదుని వాల్మీకిమహామునీంద్రుండటుమీఁది కథావిధానం బెట్టి దని యడుగుటయు,

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాతా! సంధా
జలరాశీ భవ్యమందిర!
జలజాకరచారుహాస! జానకినాథా!

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజనవినుతకవితాచమత్కార రాతంకూరి కేసన సెట్టితనయ మొల్లనామధేయవిరచితంబైన శ్రీ రామాయణ మహాకావ్యంబునందలి యుద్ధ కాండమునఁ ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

క. అమలినశుభచారిత్రా
కమలదళసమాన నేత్ర కౌశిక మిత్రా!
ద్యుమణికుల వార్ధి సోమా!
సమదాసురజనవిరామ! జానకి రామా! 1

వ. శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకికి కెఱింగించిన తెఱంగెఱింగించెద నాకర్ణింపు మట్లు. 2

ఆ. చారు లరుగుదెంచి సౌమిత్రిచే నింద్ర
జిత్తుఁ డీల్గె ననుచుఁ జెప్పుటయును
బంక్తిముఖుఁడు సుతుని బలుమాఱుఁ దలఁచుచు
వగవఁ బుచ్చె నెల్లవారు వినఁగ. 3

వ. ఇట్లనేకప్రకారంబుల గుమారుం బలువరింపుచు ఘశిక్షింపుచుఁ గొంతతడవున కూఱడిల్లి ధైర్యంబు నూఱుకొల్పి తనకుమారుం జంపినవానిని నేఁ డవశ్యంబును సంగ్రామరంగంబునఁ జంపుదు నని నియమంబుచేసి తత్క్షణంబ. 4

సీ. శైలసన్నిభములౌ సామజంబులతోడ
ననిలవేగము గల్గుహయములతోడ
గాంచనోజ్జ్వలములౌ ఘనరథంబులతోడఁ
బ్రతిలేని ఘనమహాబలములతోడఁ
గిమ్మీరువర్ణోరు కేతనంబులతోడఁ
దఱచైన పట్టుఛత్రములతోడఁ
భేరీమృదంగాదిపృథువాద్యములతోడఁ
వరశంఖ కాహళధ్వానములతోడఁ

తే. బాదఘట్టనచలితోర్వీభాగుఁ డగుచు
వనధు లెల్లను బిండిలిపండు గాఁగ
నడిచె లంకేశుఁ డధికసన్నాహమునను
రామచంద్రునితోడను రణ మొనర్ప. 5

మ. కరిఘీంకారములున్ మహాజవతురంగవ్రాత హేషావళుల్
వరకోదండనినాదముల్ సుభటదుర్వారాట్టహాసంబులున్
గురుశంఖోజ్జ్వలనాదముల్ దశదిశాక్రోశంబుగా నొక్కటై
పరగన్బంక్తిముఖుండు దానడిచెఁ గోపస్ఫూర్తినిశ్వాసుఁడై.

వ. ఇట్లు చతురంగబలంబులు గొల్వ లోకవిద్రావణుండగు రావణుండు సమరంబొనర్ప నరుదేరం గని రాఘవేశ్వరుం డతనికి దండనాయకులం బనిచిన వారును దరుగిరిపాషాణపాణులై యెదురు నడిచి సింహనాదంబులు సేయ నుభయ బలంబులుం దలపడి పోరాడుసమయంబున నమరవైరులు శస్త్రాస్త్రవర్షంబులు గురియించి నొప్పించి నంత వానరవీరులు మరల దానవులపైఁ బాషాణపాదపంబు లడరింప నరిబలంబులు విఱిగి పికాపికలై పఱచున త్రేఁ బంక్తికంధరుం డుదగ్రుండై కెరలుచుఁ గ్రూరనారాచంబులు చాపంబునందొడిగి పనసపవనతనయనల నీలద్వివిదశరభకుముద గజగవయ గవాక్ష గంధమాదనాంగద మైందాదుల నొక్కొక్కరిఁ బదేసిబాణంబుల గుదిగొన నేసిన విఱిగి యగచరసేనలు సురుగు నయ్యవసరంబున.

క. చేరి విరూపాక్షుని దగు
తేరిపయిన నొక్కకొండ ధీరతతోడన్
శూరజుఁ డప్పుడు మిక్కిలి
శూరత్వం బడర వేసి చూర్ణము సేసెన్. 8

ఆ. రథము విఱిగినంత రణమధ్యమున నొక్క
వారణంబు నెక్కి వచ్చునెడను
వాలికొడుకు దాని పటురోషమునఁ దోల
నుఱికి ప్లవగుఁ గోల నఱికె వాఁడు. 9

క. అక్షయబలుఁ డగు రవిసుతుఁ
డాక్షణమున నుగ్రుఁడగుచు నద రంట విరూ
పాక్షునివక్షముఁ బొడిచిన
రక్షోవీరుండు కూలి రణమునఁ బడియెన్. 10

వ. ఇట్లు కూలిన. 11

క. హనుమ్మని యాతనికూరిమి
తమ్ముండును గనలి వచ్చుతపనజు నత్యు
గ్రమ్ముగ మార్కొని జడిగా
నమ్ములవర్షంబుఁ గురియ నాలోఁ బెలుచన్. 12

చ. శరములు తాఁకకుండ నొకశైలమునందగ నోసరించి యా
యరదము నుగ్గుగాఁ గపికులాగ్రణివైచిన వాఁడు నేలకున్
వరభుజశక్తి దాఁటి కరవాలున నేసినఁ దప్పుఁ గుప్పికి వా
నరపతి కొట్టెనప్డు మహినాథుఁడు సంతసమంది చూడగన్.

క. కదనమున నొచ్చి దానవుఁ
డదలింపుచు భానుసుతునియాొదల వగులన్
గదచే నడిచిన వానినిఁ
గుదియంగాఁ బట్టి వైచెఁ గుంభినిమీఁదన్. 14

క. అంత సుపార్శ్వుఁడు మిక్కిలి
పంతము నెఱపుచును రథము పవనాత్మజుపై

నెంతయుఁ బఱపుచు బాణము
లంతంతనె నాట సేయు నవసరమందున్. 15

సీ. హనుమంతుఁ డాదైత్యునరదంబుపై దాఁటి
చెక్కులు వాఱంగఁ ద్రొక్కివేసి
సైంధవంబులఁ జంపి సారథితలఁ గొట్టి
గొడుగులు పడగలు పుడమిఁ గలిపి
వడి వానిచే నున్నయడిదంబుఁ గైకొని
బిరుసుగా నేసిన ధరను గూలి
కొబ్బునఁ దెప్పిర్లి కోపంబు దీపింప
ననిలజునురముమూఁడంబకముల

తే. జాంబవంతుని నిరుమూఁడుసాయకముల
నడిగవాక్షుని నైదింట వాలిసుతుని
నేడు బాణంబులను దూలనేసె నంత
నవనిఁ బడి లేచి యంగదుం డాగ్రహమున. 16

తే. వానిచే విల్లు విఱిచిన వాఁడు కినిసి
పరిఘుఁ గొని యేయ మూర్ఛిల్లి ధరణి వ్రాలి
తెలిసి యంగదుఁ డాదైత్యుఁ దెగువ నురము
పిసు గడంచినగతి ముష్టిఁ బొడిచి చంపె. 17

వ. ఇట్లు సుపార్శ్వాది రక్షోనాయకులు లక్షణంబునం
గూలిన. 18

క. తనకట్టెదురను గూలిన
దనుజులఁ జెక్కుండ్రి జూచి దశకంఠుఁడు దాఁ
గనలుచు సూతున కనియెను
జననాయకుమీఁద రథముఁ జనిమ్మనుచున్. 19

ఆ. అధిపుఁ డానతిచ్చినట్లుగా సూతుండు
రామచంద్రుమీఁద రథము వఱపె
లప్పుడు శంఖకాహళాదిరవంబులు
వంది జనుల నుతులు సందడింప. 20

వ. ఇట్లు శతాంగగజతురంగహేషారవంబులునుబహుళ కింకిణీ ఘంటికానినదంబులును రథనేమిస్వనంబులును దనుజ భటాట్టహాసంబులునుబోరుకలంగసంగరరంగంబునకరుగుదెంచు నక్తంచరేశ్వరుండు ధనుర్ధరుం డై ప్రతిఘటించు సమయంబున,

క. తన కెదిరించిన రామునిఁ
గని దనుజవిభుండు కినుక గదురఁగ నటఁ జ
య్యన నాగాస్త్రమ్ములు దన
ధనువునఁ గీలించి యేసెఁ దనభుజశక్తిన్. 22

క. అవి లెక్కఁ గొనక పోఁబోరి
నవనీనాయకుఁడు గినుక నసురాధిపుపై
దవిజారు లులికి పాఱఁగఁ
బవి సన్నిభమైన తీవ్రబాణము లేసెన్. 23

సీ. లంకేశుఁ డవియెల్ల లక్ష్యంబుసేయక
తిమిరాంబకములు సంధించి యేయ
నిబిడమై చీఁకటి నిండంగఁ బర్వినఁ
గపు లెల్ల సంధులై కళవళింప
నర్వీశ్వరుం డంత నుగ్రబాణంబుల
నంధకారం బంత నడఁగఁ జేసె
వాసవారాతిపై వహ్నిబాణము నేయ
నాతండు దా దాస్త్ర [illegible]

తే. రెండుబాణంబులును గూడి గం. డెసంగఁ
బెనఁగి యాకాశమున నుండి పృథ్విమీఁదఁ
బడియె నద్భుతగతి జగత్త్రయముగను
సురలుఁ గపులును దైత్యులుఁ జోద్యపడగ. 24

వ. అట్లు మహాద్భుతకరంబుగా సమరంబు జరుగుచున్న సమయంబున.

క. రాముని మేనను బాణ
స్తోమంబులు నాట నేసె సురరిపుఁ డలుకన్
రాముడు ఘననారాచ
స్తోమంబులు నాట నేసె సురరిపుమీఁదన్.

చ. ధరణిపుమీఁదనుం గనలి దానవనాయకుఁ డేసె నంత భీ
కరశరభోష్ట్రి కాకఫణిగండకఘూకబలాకభేకసూ
కరకరిఋశ్యకూర్మశుక గర్దభభల్లుకసీలకంఠకే
సరి వృకగృధ్రకీటబకసైంధవసైరిభవక్త్రిబాణముల్. 27

వ. ఇట్లు నిరంతరంబుఁ బ్రయోగించిన. 28

చ. పరువడి మీఁదవచ్చు పటుబాణచయంబులఁజూచి రాఘవుం
డరుదుగ వాని నన్నిఁటి వియత్తలవీథిని దుంచికృమ్మఱన్
సురపురిపుమీఁద నేసెబలసూదనముఖ్యులు సూచి మెచ్చని
బ్బరముగ నగ్ని బాణము నభంబునఁ గీలలు పర్వుచుండగన్.

వ. అమ్మహాస్త్రంబువలన. 30

క. దహనముఖంబుల శరములు
గ్రహముఖములు గలుగునట్టి ఘనతశరముల్
మిహిరముఖంబులశరములు
బహుళముగా గల్గి దైత్యపతిపైఁబర్వెన్. 31

ఆ. అంత దానవేంద్రుఁ డా బాణతతు లెల్ల
దృణములట్లు నడుమఁ ద్రెంచి వైచి
మయునిచేత గొన్న మహనీయ మగునట్టి
శంబరాఖ్యమైనశరము వైచె. 32

క. ఆశరమున బహుశస్త్రము
లాశుగతిం గలిగి గవియ నన్నిటి నొకటన్
నాశము చేసెను రాముం
డాశాపతు లలర మన్మథాస్త్రముచేతన్. 33

ఆ. శంబరాఖ్యశరము జగదీశుబాణంబు
వలనఁ జెడక రామువక్ష మడర
నాటె నంతలోన నాకారిపై నేసె
విశిఖతతులు వేయు వేయునెడను. 34

క. రావణు డా బాణములకు
వేవేగను ప్రతిఘటించి వేసినశరముల్
చేవమెయిఁ దాఁకి వడి ధా
త్రీవలయంబునను వడె ధరిత్రి వడంకన్. 35

ఉ. తల్లడ మంది రామవసుధాపతి కడ్డము సొచ్చి లక్ష్మణుం
డుల్లము నొవ్వనాటుచుమహోన్నతకోపముతోడ దైత్యు
చేవిల్లును నారియుం దునిమివేసి వడిన్ శరసప్తకమ్ముచే
బల్లిదుఁడైన దైత్యకులపాలునివక్షముఁదూర్చి యార్చినన్.

క. అంత విభీషణుఁ డమరేం
ద్రాంతకు నరదంబుఁ గూల నట నేసిన న
త్యంతజవంబున ధరణికి
గంతుగొనన్ వడిని బంక్తికంధరుఁ డలుకన్. 37

వ. ఇట్లు తనరథంబుఁ గూలనేసిన విరథుండై రావణుండు మయదత్తంబైన శక్తి నిబూని తమ్ముని నేయఁ జూచుచున్నంత శరణాగతవజ్రపంజరుం డగు రాఘవేశ్వరుని తోఁబుట్టువగుటంజేసి లక్ష్మణుండు కరుణాకరుండై విభీషణుం దనవెనుక నిడికొని యెదుర్చినంగని నీవు నాపగర కడ్డంబ వైతివి గావున నీవ యీశక్తిఁ బాత్రుండవు గమ్మని యేసిన నదియును శతఘంటికారంజితంబును శతకోటినినదంబును బావకజ్వాలాభీలకీలాన్వితంబునునై పఱతేరంగని సురేంద్రాదిదేవగణంబులు భయం బంది రాముతమ్మునకుం దీర్ఘాయువగుం గావుత మని దీవింప జగంబులు తల్లడిల్ల సముద్రంబులు ఘూర్ణిల్ల కులాచలంబులు వడఁక జంద్రార్కబింబంబులు దలంక నేఁగుదెంచి సౌమిత్రియురంబు నాటి ధాత్రిం బడియె నట్టియవసరమ్మున. 38

సీ. పంక్తికంధరుఁ డేయు బాణంబు లవి లెక్క
సేయక రఘుకులసింహుఁ డప్పుడు
తమ్మునిమెయి నాటి ధరణి గాడినశక్తి
నొగి వానరులు తీయ నోపకున్న
నవలీల దాని నొయ్యనఁ దీసి పోవైచి
ఘనులైన కపులను గాపువెట్టి
నేను రాముఁడ నైతి నేని మజ్జనకుండు
దశరథుం డగునేని దప్పకుండఁ
తే. గలన నెదిరించి నాతోడఁ గయ్యమునకు
నిలిచి నేనియుఁ దనుజేంద్రు నిజము గాఁగ
నమరు లెఱుఁగంగఁ జంపుదు నతనిచేతఁ
జిత్తు నింకిట్టు కాని నే రిత్త మగఁడ. 39

వ. అని మఱియును. 40

క. రాముఁడు రావణుఁ డనుచును
భూమిపయిని నిర్వు రికని పొసఁగదు నుండీ
నామాట వినుఁడు లెస్సఁగ
రాముఁడ నే నొంటె భువిని రావణుఁ డొండెన్. 41

వ. ఉండుదు మని వీరాలాపంబు లాడుచు రామచంద్రుండు ధనుర్ధరుండై శరవర్షంబులు గురియించిన నసురేశ్వరుండును బ్రతిశరంబుల వాని నన్నింటిని దూల నేసినఁ గనలి రామచంద్రుండు తొడిగినయమ్మును వెడలుతూపులును విల్లు గుడుసుపడుటయు నెఱుంగ రానిచందంబునఁ బింజపింజ గఱచి పాఱుచుండునట్లుగా హస్తంబు ముడుచుటయుఁ జాఁచుటయు దెలియరాకుండ రావణు కాలు సేతు లాడకుండ శరలాఘవంబు నెఱపుచు నేయుచున్న యప్పుడు విఱిగి శరీరభూషణంబు లురుల గిరీటంబులు డుల్లఁ దలలు వీడ మరలి మరలి చూచుచు మృగేంద్రుం గన్నగజేంద్రుని చందంబున భీతచేతస్కుండై దశముఖుండు లంకాపురంబుఁ జొచ్చెఁ దదనంతరంబున. 42

క. ఆవేళ లావు సూపుచు
రావణుచే శక్తి దాఁకి రణరంగమునన్
జేవ సెడి పడినలక్ష్మణు
దేవుని డగ్గఱఁగ రామదేవుఁడు వచ్చెన్. 43

వ. ఇట్లరుగుదెంచి. 44

తే. రక్తసిక్తాంగుఁడై ధాత్రి శక్తి నాఁటి
యున్నతమ్మునిఁ గనుఁగొని యుస్సు రనుచు

దుఃఖ మంతంత నాఁగక తొంగలింపఁ
దొడలపై నిడి బాష్పముల్ దొప్పదోఁగ. 45

సీ. హా! భానుకులదీప! హా! సత్యసల్లాప!
హా! సుగుణకలాప! హా! సురూప!
హా! ధర్మసంచార! హా! వైరిసంహార!
హా! కీర్తివిస్తార! హా సుధీర!
హా! నిత్యసుజ్ఞాన! హా పుణ్యసంధాన!
హా! పూజ్యసమ్మాన హా! నిధాన!
హా! శౌర్యగుణవృద్ధ! హా! యుద్ధసన్నద్ధ!
హా! చిత్తసంశుద్ధ! హా! ప్రసిద్ధ!

తే. హా! మునీశ్వర సంరక్ష! యసురశిక్ష!
హా! గుణస్తోత్రసత్పాత్ర! యబ్జనేత్ర!
హా! సదాచారసంపన్న! హా! ప్రసన్న
యనుచు శోకాతురాత్ముఁడై యంతకంత. 46

క. జనకునిపంపున నడవికిఁ
జనుదెంచియు నిడుమ కోర్చి సన్మునివృత్తిన్
ననుఁ గూడి నడవ నేర్చిన
యనుజన్మా! యెందుఁ బోయితయ్యా తలఁపన్. 47

క. వనమునఁ గలఫలమూలము
లనుదినమును భక్తియుక్తి నర్పింపుచు మ
జ్జనకునిభంగిని నన్నును
జనకజఁ బోషించి యెందుఁ జనితివి తండ్రీ! 48

క. నీవంటితోడఁబుట్టువు
నీవంటిగుణోత్తరుండు నిజ మూహింపన్

భూవలయమందుఁ గలఁడే
భావింపఁగ నీవె తక్కఁ బావనచరితా! 49

క. నెఱయక నిద్రాహారము
లెఱుఁగక పదునాలుగేండ్లు హితమతితో మ
మ్మఱిముఱి నరసిన నిన్నును
మఱువ నగునె నీతి గల్గుమనుజుల కెందున్. 50

క. ని న్నిచట విడిచి పురికిని
జన్నను నినుఁ గన్న తల్లి సనుదెంచి నను
నిన్నడుగఁ దడవ మదిలోఁ
జిన్నం దోఁచును నేమి చెప్పుదుఁ దండ్రీ! 51

వ. అని మఱియును. 52

చ. వినుఁడు కపీంద్రులార పలవింపుచు మజ్జనకుండు నాకమున్
జనియె ధరాతనూభవ నిశాచరుచేఁ జెఱవోయె నేఁటితో
ననుజుఁడు దీఱె నింక నడియాసల నుండుట నాకు ధర్మమే!
చనుఁడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరు గొబ్బునన్.

వ. అని విభీషణుం గనుంగొని,

ఉ. అక్కట! నీకు నింటఁ గలయట్టిసుబాంధవకోటిఁ బాసి నీ
విక్కడ కేఁగుదెంచితి వహీనముదంబున మమ్ము నమ్మి పెం
పెక్కఁగ రావణుండు తగ నేలెడిలంకఁ గడంగ నీకు నేఁ
దక్కఁగ నిత్తు నన్ పలికిన దప్పె విభీషణ! నీవు పోవుమా.

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రలాపించుచున్న
రామ భూపాలునకు సుషేణుం డిట్లనియె. 56

ఉ. దేవర నీకు నీగతి మదిం దలపోయఁగ నేల తీవ్ర మై
రావణుచేతిశక్తి బవరంబున నాటుటఁ జేసి లక్ష్మణుం

డీవిధి నుండెఁ గాని ధరణీశ్వర చూడు ముఖారవిందముం
జావఁడు సావఁడియ్యెడ నిజంబుగ నమ్ము మనంబులోపలన్.

ఉ. ఫున్నమచందురుందెగడి పొల్పెసలారెడి మోముదమ్మి
యున్ । గన్నులు కల్వరేకులను గాంతి జయించెడుఁ గాని
రక్తిమం। జెన్నుదొలంగియుండ వఱజేతులుఁ బాదములున్
దలంపఁగా। నున్నవి వర్ణముల్ గలిగి యొప్పు తొలంగదు
రాఘవేశ్వరా!

వ. అని విన్నవించుచు హనుమంతు గనుఁగొని సుషే
ణుం డిట్లులనియె.

క. ఈయన ప్రాణము లెత్తఁగ
వాయుజ యలనాఁటిమందు వడిఁ దేవలె నీ
వీయెడ నచటికిఁ దడయక
పోయి వెసఁ దమ్ము ప్రొద్దు పొడువక మునుపే.

వ. అనిన భూకాంతుండు హనుమంతున కిట్లనియె. 61

క. రమ్మా వాయుతనూభవ
యిమ్మహి సత్కీర్తిఁ బడయు మీతనిప్రాణం
బిమ్ముగ రక్షింపుము నా
తమ్ములలో నీవు నొక్కతమ్ముఁడ వరయన్. 62

వ. అని డాయం జని కౌఁగిటం జేర్చి దీవించి యంపె
నప్పుడు.

ఆ. పదము లూనఁ ద్రొక్కి వదనంబు దిగఁ జూచి
చేతు లూని నడుము చిక్కఁ బట్టి
క్రుంగి నిక్కి మొగసి కుప్పించి వడి దాఁటి
చనియె గగనవీథి ననిలసుతుఁడు. 64

వ. అట్టి సమయంబున, 65

సీ. దనుజేశుఁ డా వార్త విని కాలనేమి
హాము చొచ్చి నడిరేయి యతనితోఁడఁ
దనిచేత హతుఁ డైనధరణీశుతమ్ముని
ప్రాణంబు లెత్తంగఁ బవనసుతుఁడు
సనుచున్న యట్టియాపని విఘ్న మొనరింప
గ్రక్కున నటఁ బోయి రమ్మటంచుఁ
గాలనేమి యిదేటికార్యంబు తగదన్న
వినక కోపించిన వేగ నరిగి
తే. ద్రోణశైలంబు చేరువత్రోవయందు
వనముఁ గావించి తగ మునీశ్వరునిరీతి
జపము సేయుచుఁ గన్నులు చక్కమూసి
నడుము నిక్కించి పద్మాసనమున నుండె. 66

వ. అప్పుడాకాశమార్గంబునఁ జనుచున్న యప్పవన సుతుండు వనంబుం గాంచి త్రోవ దప్పె నని మనంబున సందియ మొంది యమ్మునీంద్రు నడిగి చనువాడై యతనికి నమస్కరించి యిట్లనియె. 67

క. మునినాథ నేను రాముని
పనికై చనుచున్న వాఁడఁ బరమౌషధముల్
గొని రావలె మది భావిం
చి నిజమ్ముగ నిప్పుడు త్రోవ సెప్పుము నాకున్. 68

వ. అని ప్రార్థించి దాహోపశమనంబున కుదకంబు వేఁడిన నకపటమునీంద్రుఁ డిట్లనియె, 69

ఆ. పవనతనయ రామభద్రుని పనిమాకుఁ
దీర్పవలయుఁ గాన నేర్పుతోడఁ
బ్రాణరక్షకొఱకు ద్రోణాద్రి కరుగంగ
వలదు వినుము నాదు వనమునందు.
తే. ఘనతరం బైన సంజీవికరణి మొదలు
గాఁగ దివ్యౌషధంబులు గలవు గాన
గొంచుఁ బోవచ్చుఁ గావున గోరుపండ్లు
తనివి దీరంగఁ దిని నీళ్లు త్రాగు మిచట. 71

వ. అని తనహస్తంబున నున్నవిమయుక్తం బైనకమండలూదకంబు చూపినం గని హనుమంతుం డవి చాల వనిన నక్కపట మునీంద్రుండు క్రూరమకరావృతం బైనకమలాకరంబొకం డెఱింగించి పొమ్మనినఁ బవనాత్మజుండు సని 62

క. విమలమకరందలుబ్ధ
భ్రమరనికరపక్షపవనపరికంపిత స
త్కమనీయకుముదదకైరవ
కమలంబులు గలుగుకొలను గనుఁగొని యచటన్.

సీ. మడుఁగులోపలఁ జొచ్చి కడుపారనుదకంబు
గ్రోలంగ దిగ నందుఁ గ్రాలుమొసలి
పాదమ్ముల్ కబళించి పట్టినఁ జరణముల్
విదళింపఁ బట్టూని విడువకున్నఁ
గడు సూక్ష్మరూపుడై కడుపులోపలఁ జొచ్చి
వేగంబె భేదించివెడలె నంత
నది దేవకన్యయై యాకాశముననుండి
తనదు వృత్తాంత మంతయును జెప్పి

తే. వీఁడు దైత్యుండు నమ్మకు వీనిఁజంపి
పొమ్ము సంజీవికొండకుఁ బొ్రద్దు గలుగ
నీకతంబున శాపంబు నాకుఁ దీఱె
ననుచు దీవించి చనియెఁ దా నమరపురికి. 74

వ. అంత హనుమంతుడు తేజోవంతుండై యరుగుదెంచి కపటసంయమినిం గనిన నతం డిట్లనియె. 75

చ. తడసితి వేల యింతవడి దాపుననే వసియించినట్టి యీ
మడువున కేఁగి రాకునికి మాకనుమానముదోఁచెనయ్యయి
ప్పుడు గలదేనిఁ గొంతగురుపూజకు విత్తము కానుకవెట్టిన
వడుగుము మందులెట్టివి ప్రియంబగునట్టివి నీకు నిచ్చెదన్.

చ. అనవుడుఁ గోపమెత్తి పవనాత్మజుఁడప్పుడు నీకుఁబూజగా
మ్మని యురుముష్టి చేఁబొడువ నాతఁడు డీకొనిపక్షిరూపుఁడై
తనుఁగరచియంగవచ్చుటయుదాని నపక్షముగాఁగఁద్రుంచినన్
గినిసి మృగేంద్రుఁడై పొడువఁ గేసరిపుత్రుఁడు దానిఁ గూ [ల్చినన్.

తే. అంత సుగ్రీవుఁడై వచ్చి యనిలతనయ
బ్రతికె సౌమిత్రి మంచులపని తలంప
వలదు రమ్మని నమ్మ భూవరుఁడు పనిచె
మగుడి పోదము పదు మన్న మాట వినుచు. 78

వ. సుగ్రీవుం డని విచారించి కాకుండు లెఱింగి వాని బాహుమధ్యంబునఁ బొడిచిన నతం డారూపంబు విడిచి శత శృంగుండై నొప్పించిన నలిగి జగత్ప్రాణనందనుండు వాలంబున నడిచి కరంబులు ఛేదించి శిరంబుఁ దున్మిచివైచి సింహనాదంబు చేసి జయలక్ష్మిం గైకొని. 79

క. ద్రోణాద్రి కేఁగి మందులు
ప్రోణిమి నీకున్నఁ గినిసి పొల్పలరఁగ నా
క్షోణీధర మగలింపుచుఁ
శాణితలాగ్రమునఁ బెట్టి పట్టుక రాఁగన్. 80
సీ. కావలి యున్నట్టి గంధర్వగణములు
పదునాల్గు వేలు కోపంబుతోడ
నాహవం బొనరింప నందఱ నచ్చోట
వాలముఖంబున వసుధఁ గూల్చి
గగనమార్గంబునఁ గడుతీవ్ర గతితోడఁ
బోవ నందిగ్రామ పురమునందుఁ
దైలయుక్తంబైన తలలతోఁ బొరలాడఁ
గలిగిన రామలక్ష్మణుల తెఱఁగు
తే. భరతుఁ డారాత్రి కలఁగని భయమునొంచి
తొడరి దుస్స్వప్న దోషంబు దొలఁగిపోవ
విప్రవరులకు దానముల్ వేడ్క నిచ్చి
వెలుపలను నున్న భరతభూవిభునిఁ గాంచి. 81
తే. రాముఁడే యంచు నూహించి రాముఁడేల
వచ్చు నిచటికి సౌమిత్రి వనచరులను
జనకనందనఁ దగడించి జగమెఱుంగఁ
బగరఁ జంపక రానేమిపని తలంప. 82
వ. అని యిట్లు సందియంపడి కాఁడనినిశ్చయించి యంత
హనుమంతుండు దక్షిణపాథోనిధి దటియం జనునప్పుడు దశా
ననువంపున సేనలఁగూడి మాల్యవంతుం డెదిరించి శస్త్రాస్త్రం
బులు గురియించి నొప్పించినం గని వాతూలసంభవుండు వాల

మల్లార్చి యార్చి పేర్చి దనుజబలంబులఁ జలంబునం దఱిమి వాల ముఖంబున గళంబులు పట్టి నానాముఖంబులం బాఱవైచినఁ గని మాల్యవంతుండు తీవ్రశరంబుల నొప్పించిన నడరి యద్దానవేంద్రుని కంఠంబున వాలంబుం గీలించి గిరగిరం ద్రిప్పి సముద్రమధ్యంబునఁ బడవైచిన వాఁడును బాతాళంబునకుం జనియె నాక్షణంబ. 83

తే. మాల్యవంతునిఁ బోకార్చి మానుషమున
గగనమండల మందంద పగుల నార్చి
వచ్చునప్పుడు శతకోటి వారిజాప్త
దీప్తిఁ గనుపట్టెఁ బ్రాచీనదిక్కునందు. 84

వ. ఇట్లు వెలుంగుచున్న మహౌషధాచలంబు దివ్యదీప్తులు గను గొని రాఘవేశ్వరుం డది సూర్యోదయం బని మనంబునఁ దలంకి కపిరాజున కిట్లనియె. 85

చ. అదెకనుఁగొంటె రేకలయ నర్కుఁడు పూర్వగిరీంద్రశృంగమం
దుదయమునొందె నింక నిటనుంచినఁ దమ్ముని ప్రాణవాయువుల్
బ్రదుకుట దుర్లభం బకట పల్మఱు మ్రొక్కెదు ప్రొద్దెమాకుఁ దా
సదయత శత్రుఁ డయ్యెఁ గపులార వినుం డిదె మీకుఁ జెప్పెదన్.

తే. మాకులంబున కెల్లను మహిమఁ దలఁపఁ
దానె కర్తయై యుండియు ధర్మమునకు నె
యుదయ మందంగ మమముఁ డిట్లున్న యెడను
గొనరి చుట్టాలుఁ బగవారిఁ గూడవలెనె! 87

క. ఈలాగునఁ దాఁ బొడిచిన
మాలక్ష్మణు ప్రాణ మేల మగుడును భానుం

గూలఁగ నేసెద విల్లును
గోలలుఁ దెమ్మనుచు సందిగొను నాలోనన్. 88

వ. రామచంద్రునకు జాంబవంతుం డిట్లనియె. 89

చ. భానుఁడు గాఁడు చూడు నరపాలక మందులకొండదీప్తలీ
మానముదోఁచెగానియనుమానములేదువినుండు వేడ్కతో
వానరసేన నింకెదురు వాయుతనూజుని గారవింపఁగా
మానవనాథ పంపు మనుమాత్రనె వచ్చెనతండు తీవ్రతన్.

క. అనిమిషులు సన్నుతింపగ
హనుమంతుడు ద్రోణశైల మతిశీఘ్రముగాఁ
గొనివచ్చి నిలిచి రఘురా
ముని శ్రీపాదముల కెలమి మ్రొక్కినయంతన్. 91

వ. రామచంద్రుం డతనిం గౌఁగిలించుకొని సుషేణుం
జూచి నీవిందలి దివ్యౌషధంబులవలన సౌమిత్రి ప్రాణంబులు
తేర్పుమనిన నయ్యధిపునాజ్ఞ శిరంబునఁ దాల్చి వనచరవహి
తుండై పర్వతం బెక్కి తొల్లి దేవత లమృతపానంబు చేసినతా
వును నారాయణుండు మోహినీరూపంబున నమృతము పంచు
నప్పుడు సూర్యచంద్రులనడుమ నిలికిన రాహువు శిరంబుఁ
ద్రుంచిన తావును బలిచక్రవర్తియాగంబు చేసిన తావును రాక్ష
సులు జన్మించిన తావును శంకరభగవానుఁడు పర్వతరాజుగాఁ
తును బెండ్లియాడినతావును వానరులకుం జూపుచు న్నారిం
ద్రింబుపై నున్న యోషధంబులు గొనివచ్చి ప్రయోగింప నా
యోషధముల సామర్థ్యంబునం జేసి లక్ష్మణునకుఁ బ్రాణం
బులు మగుడవచ్చె నంత సకలవానరులు నానందరసాబ్ధిఁదేలిరి
రప్పుడు సౌమిత్రి రామునకు నమస్కరించిన రామచంద్రుండు

కౌఁగిటం జేర్చి హనుమంతుం డొనరించిన యుపకృతికి సంతో
షించి యీపర్వతంబును దొల్లింటి యునికిసే యుంచి రమ్మనిన
నతం డట్ల కావించె నని నారదుండు సెప్పిన వాల్మీకి మునీశ్వ
రుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు. 92

క. జలజాక్ష ! భక్తవత్సల !
జలజాసన వినుతపాద జలజాత ! సుధా
జలరాశి భవ్యమందిర !
జలజాకరచారుహంస ! జానకినాథా ! 93

గద్య. ఇది శ్రీ గౌరీశ్వరప్రసాదలబ్ధగురుజంగమార్చన వినోద
సూరిజనవినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ
రామాయణ మహాకావ్యంబున ద్వితీ
యాశ్వాసము.

---

తృ తీ యా శ్వా స ము.

క. విమల సుధాకరవదనా !
సుమనశ్శోభితోబ్జసదన ! సుస్థిరకదనా !
కమనీయరదన ! శత్రువి
షమ ! రఘుకుల సార్వభౌమ ! జానకిరామా ! 1

వ॥ శ్రీ నారద మునీంద్రుండు వాల్మీకి కెఱింగించిన
తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 2

క. కలకల పక్షులు గూయఁగఁ
బలుపలనై తారకములు పడమటఁ బోవన్

జలజములు విరియఁ దూర్పున
బలపలనై తెల్లవాఱ భానుఁడు పొడమెన్. 3

సీ. అట మున్ను దశకంఠుఁ డాచార్యుఁ డైనట్టి
శుక్రానుమతి దేహశుద్ధితోడ
రణజయార్థంబుగా రథములు గుఱ్ఱముల్
కవచంబు లస్త్రసంఘములు గలుగఁ
బాతాళగుహఁ జొచ్చి వీతిహోత్రునిఁ గూర్చి
పాయక హోమంబు సేయుచుండ
నాహోమధూమంబు లాకసంబునఁ బర్వఁ
గని విభీషణుఁడు భూకాంతువకును

తే. విన్నవించెను మాయన్న నిన్న నరిగి
హోమ మొనరింపుచున్నవాఁ డుడుగ కిపుడు
మొనసి యా హోమ మది తుద ముట్టెనేని
గలన బ్రహ్మాదు లాతని గెలువలేరు. 4

క. ఈపని విఘ్నము సేయగ
భూపాలక! కపుల నేర్చిఁ పుచ్చుము లేదేన్
మీపని విఘ్న మగు ననుచు
భూపాలవరేణ్యుఁ డప్డు భూధరచరులన్. 5

చ. గవయగవాక్షవాలిసుత కంజహితాత్మజ నీలవాయుసం
భవనలగంధమాదనవిభాషితభల్లుకనాథముఖ్యులన్
దివిజవిరోధిపైఁ బనుపఁ దీవ్రత నేగి పురంబు సొచ్చి దా
నవపతి సేనలం దఱిమి నాకము ఛేదిల నార్చి యత్తఱిన్. 6

క. గుహ సొచ్చి దనుజవల్లభ
విహితమె సాహసము వీడిచి విను మునివృత్తిన్

దహనగత ధూమరేఖల
నహరహమును నీకు వ్రేల్వ నర్హంబగునే! 7

క. మగఁటిమి గలిగిన పురుషుఁడె
మగతనమును విడిచి నడుచు మగువలు నగఁగా
తగ దనక నేఁడు మఱుగున
విగతహ్రీకుండ వగుచు వ్రేల్పం దగునే! 8

మ. అని కేతెంచి నృపాలశేఖరుఁడు వాహ్యాళిప్రదేశంబునన్
నిను రమ్మంచును బిల్చుచుండ నిచటన్ నీవుండ వ్యాజంబునన్
దనుజాధీశ్వర వీరధర్మ మగునే తప్పించుకో నందు న
వ్వనచారుల్ సిగవట్టియీడ్వఁగను గ్రవ్యాదుండు నిశ్చింతుఁడై.

క. కదలక హృదయజ్ఞానము
వదలక మంత్రంబుఁ జొప్పు వడి తప్పక లోఁ
జెదరక వ్రేల్చుచు నుగ్రత
బెదరక కూర్చుండె నట గభీరప్రౌఢిన్. 10

వ. అట్లు శిలాస్తంభంబు పగిదిని జలింపకున్న యతని చేతి సమాహుతులపిడిచి పాఱవైచి స్రుక్స్రువంబులు వలువఁగఁ ద్రొక్కి యిధ్మంబు హోమద్రవ్యంబులు నొక్కింత నగ్నిలోఁ దోఁచి హోమాగ్నిం జిందఱవందఱ చేసి, భుజంబు లెక్కి మీసలు పట్టుకొని లాగి తలలు గదలించి పీనుఁగు బెనుబొబ్బ లిడి కదలకున్నం గినిసి వాలితనూభవుం డంతనంతఃపురంబునకుం బోయి యందున్న మండోదరినిఁ జుట్టువట్టి యీడ్చుచు, బరువునఁ గొని వచ్చి దశవదనుముందఱ నిలువ నక్కాంత దుఃఖాక్రాంతయై తన కాంతున కిట్లనియె. 11

తే. రామచంద్రుండె యాదినారాయణుండు
గపులె దేవత లని నీకుఁ గనఁబడంగ
నెల్లవేళల నేఁ జెవి నిల్లు గట్టి
విన్నపము సేయ నామాట వినకపోతి. 12

మ. మయదైత్యేంద్రునకుం దనూజనయి సేమంబొప్పనీపత్నినై
జయవెట్టంగను నింద్రజిజ్జననినై సర్వాంగనాపూజ్యనై
భయ మెన్నండు నెఱుంగనట్టినను నిబ్భంగిన్ వనాటుండు ని
ర్భయవృత్తిం దలపట్టి యీడ్వఁగనుఁగోఁబాలైతి నీముంగలన్.

క. రాముని దూతలు నిన్నును
బాణములు వెట్టంగఁ జూడఁ బందువె నీకున్
నామానము గాపాడని
నీమానుష మేటికిప్పుడు నిర్జరవైరీ!

ఉ. ఈమునివృత్తికన్న దనుజేశ్వర రామునితోడ నేఁడు సం
గ్రామము సేసి గెల్చిన నఖండరమావిభవంబు గల్గు నా
రామునిచేతఁ జచ్చిన స్థిరంబుగ మోక్షము గల్గు దీనికై
యేమిటి కింత దైన్యమిసీ! యిచ్చఁదలంపుము రాక్షసేశ్వరా!

వ. అని యనేకవిధంబులుగా దీనాలాపంబు లాడుచు వెక్కి వెక్కి యేడ్వం గన లజ్జించి మహోగ్రాకారుండై లేచి దగ్ధశేషకాండంబులచే వానరవీరుల కరంబులు శిరంబులు ముక్కులుఁ జెక్కులు నలుగ మొత్తినం బఱచి వారు రామచంద్రునిసమ్ముఖంబునకుం బోయి తాము పోయి వచ్చినపని విన్నవించి రట్టి సమయంబున,

తే. నగచరులఁ ద్రోలి క్రమ్మర నగరి కరిగి
పంక్తికంఠుండు ధైర్యంబు పాదుకొల్పి

విన్నఁదసమున వగపునఁ జిన్నవోయి
చెంతనున్నట్టి తనకులకాంతఁ జూచి. 17

క. నా కేలు వట్టి వెలసిన
నీ కేలా చిన్నవోవ నీరజనయనా!
నాకులు బెదరఁగ నిల యి
క్ష్వాకుకులోద్భవుల గెలిచి వచ్చెద నింకన్. 10

తే. తెలియ మయపుత్త్రి నాదుప్రతిజ్ఞ వినుము
వనచరులతోడ రామభూవరుని నేఁడు
చంపు టొండెను వానిచేఁ జచ్చు టొండెఁ
గాని యూరక మరలుట కానిమాట. 19

వ. అని వీరరసం బుప్పొంగఁ బ్రతిజ్ఞాలాపంబులఁ దన
పట్టపుదేవి యగుమందోదరి నోదార్చి కొలువుకూటంబున కే
తెంచి యచ్చట.

క. శిరముల వీనుల గళములఁ
గరముల నురమున నడుమునఁ గమనీయపదాం
బురుహముల భూషణావళు
లరుదారఁగ దాల్చి మోహనాకృతి మీఱెన్. 21

తే. గంధమాల్యాంబరాదులు బంధురముగ
మేనఁ గలయంగ ధరియించి దానవేంద్రుఁ
డంత రణభేరి వ్రేయించి పంత మరల
బిరుదురాహుత్తువీరులఁ బిలువఁ బనిచె.

వ. అట్టియవసరంబున, 22

ఆ. రోష మడర ఖడ్గరోముండు వృశ్చిక
రోముఁ డల్ల సర్పరోము డగ్నిఁ

వర్ణుఁ డాది గాఁగ వచ్చిరి రాక్షస
వీరు లపుడు దనుజవిభునిఁ గొలువ. 24

క. ఇరువదిచేతుల శస్త్రో
త్కరములు మెఱయంగఁ దాల్చి కౌతుక మడర౯
దురగములు నూఱు గట్టిన
యరదముపైఁ గూరుచుండి యతివిభవమునన్. 25

సీ. భేరులుతమ్మటల్ పెల్లునిస్సాణముల్
బూరగొమ్ములు కంచువీరణములు
మకిలకొ్రవులు వీరమద్దెలల్ గిడుగిల్లు
పేరైన తప్పెటల్ పిల్లగ్రోల్లు
తారలు చిమ్మటతారలు శంఖముల్
కాహళల్ పసిఁడిఢక్కలును బిడులు
గాలిదుమ్ములు డోలుకైవల్లు రుంజలు
ఛత్రసంఘంబులు చామరములు
బోరుగలఁగంగ దిక్కులు బూరటిల్ల
దనుజవర్గంబు లిరువంకఁ దవిలి కొలువ
వెడలె సన్నాహ మదరంగ వీరరవము
కరువు గట్టినచందంబు గానఁబడఁగ. 26

క. కాలాగ్ని కాలభైరవ
కాలాంతక కాలదండ కాలాహిశిఖా
భీలసముద్యద్దినకర
కాలాకృతితోడఁ బంక్తికంఠుఁడు వెడలెన్. 27

వ. ఇట్లత్యుత్సాహంబుగా యుద్ధరంగమునకుం బయలు
దేఱిన సమయంబున. 28

చూర్ణిక॥ జయజయ కైకసీగర్భసముదగ్ర సంపూర్ణసుధాకరా! జయజయ మయతనూజమనోహరా! జయజయ రాక్షసకులసార్వభౌమా! జయజయ సాగరావరణలంకాధీశ్వరా! జయజయ పాకశాసనభద్రశ్రీహరణచతురా! జయజయ కుటిలవైశ్వానరపుటభేదన నిర్ధూమధామా! జయజయ సమవర్తిసంపద్విచ్ఛేదకా! జయజయ దనుజవల్లభహల్లకల్లోలా! జయజయ యబ్ధీశ్వరతోయశోషణబడబానలా! జయజయ పవమానసంహారా! జయజయ యక్షనాయక దుర్వారగర్వాపహారకా! జయజయ యీశానైశ్వర్యహరణోద్యమా! జయజయ నవగ్రహానుగ్రహనిగ్రహా! జయజయ దశగ్రీవాలంకారా! జయజయ కైలాసనగేంద్రోత్పాటన కందుకక్రీడావినోదా! జయజయ భవానీశ్వర శ్రీపాదకమలశిరఃకంజాతపూజాసమర్థా! జయజయ పుష్పకారూఢ సకలదిగంతవిక్రాంతా? జయజయబ్రహ్మవంశప్రదీపకా! జయజయత్రిలోకవిజయా! రావణేశ్వరా! జయీభవ దిగ్విజయీభవ.

వ. అని వందిబృందంబులుభయపార్శ్వంబుల జయజయధ్వనులతో బిరుదు గద్యపద్యంబులు వక్కాణింప ముక్తాతపత్రంబులనడుమ మహిళామండలార్పిత చామరపవనకంపితకుంతలుండగుచు వీరరసంబు పురుషాకారంబు దాల్చినలీలనే తేర ముజ్జగంబులు గడగడ వడంకెఁ గులాచలంబు లొడ్డగిల్లెఁ జంద్రార్కమండలంబులు తడఁబడె నక్షత్రంబులు డుల్లనట్టిసమయంబునఁ గరిబృంహితంబులు నశ్వహేషారవంబులును

దనుజభటాట్టహాసంబులును సురత్రాసజనకంబులుగాఁ బటహ నిస్సాణభేరీ శంఖకాహళ ఝాంకారరవంబులును ప్రతిధ్వనుల నీన నంత రాముపై మేఘంబులు రక్తధారలు వర్షించె; బిరుదధ్వజంబులు విఱిగి పడియెఁ; దురంగంబులవాలంబులనుండి నిప్పులురిలె; దిక్కుల ధూమంబు నిబిడంబై పర్వె; నట రామునిచే రావణుండు తెగుట యవశ్యం బని నభంబును మ్రోసె; నట్టియవసరంబున. 30

క. భూనాయకుఁ డతి వేగమ
దానవసేనలకు నెదురు దార్కొని పోరన్
వానరసేనలఁ బంపెను
భానుజముఖ్యాధిపతులఁ బౌరుష మడరన్. 31

మ. తరుశైలంబులతోడ నార్చుచు భుజాదర్పంబులుప్పొంగవా
నరవర్గంబు లెదర్చి వచ్చునెడ నానాకారులా దక్షిణో
త్తరవార్ధుల్ ప్రకటించి డాయుగతి నుద్యత్త్రీవ్రఘోషఁ దార్కొంచుసం
గరముం జేయఁగఁ జొచ్చిరంత సురలాకాశంబునం జూడఁగన్.

సీ. కరుల నెక్కించి భీకరలీలఁ ద్రొక్కించి
వాజులఁ దోలి తీవ్రముగ నేయ
రథములఁ బఱపి శిరంబులఁ జక్కాడి
చెలఁగి పదాతులఁ జేరి పొడువఁ
బంతంబు చేకూఱఁ బ్లవగోత్తములఁ గేరి
తరువులుఁ బాషాణతతులుఁ బఱపి
శైలంబు లడరించి సంహారములు సేయఁ
గలఁగక దైత్యులుఁ గపులు గలసి

తే. పోరునప్పుడు వానరవీరు లసుర
వరులమీఁదను బాషాణవర్ష మధిక
ములఁ గురియుంప దనుజు లావేళ విఱిగి
తలలు వీడంగఁ బఱచిరి క్షేత్రమున. 33

సీ. మెండైన రథములమీఁదికిఁ గుప్పించి
విక్రమప్రౌఢిమై విఱుగఁద్రొక్కి
కరులకొమ్ములు పట్టి బిరబిర వడిఁ ద్రిప్పి
జగతీస్థలంబునఁ జదియఁ గొట్టి
తొడరి సైంధవకోటి కడకాళ్లు విదళించి
పట్టి పెడజెక్కలు వాఱఁ గొట్టి
కాల్బలంబులపైకిఁ గదిసి శస్త్రంబుల
తోడఁ గూడనె చుట్టి తునియఁ గొట్టి

తే. ఛత్రములు గూల్చి చామరసమితి విఱిచి
కేరలియార్చుచు బిరుదుటెక్కెములు చించి
వాద్యసంఘంబు లవలీల వసుధఁ గూల్చి
కపులు దోలిరి దానవగణము నెల్ల. 34

ఆ. అంతఁ బంక్తివదనునరదంబు నెదురుగా
నడుచు వాయుపుత్త్రునకును ఖడ్గ
రోముఁ డనియె నతని రూపించి నాతోడ
రణము సేయ వేగ రమ్మటంచు. 34

చ. పిలిచిన రోష మెత్తి కడు భీకరవృత్తిని ఖడ్గరోముతోఁ
దలపడ వానిరోమములు దాఁకి శరీరము నొచ్చి యంతఁ గో
పల నొకపర్వతంబుఁ గొని పావని దైత్యునిమీఁద నేయ ని
శ్చలతను ఖడ్గరోముఁడును జక్కఁగఁజేసినఁ దక్షణంబునన్.

చ. మఱియొకపర్వతంబుహనుమానుఁడు గైకొనివచ్చి క్రమ్మఱన్
మెఱవడిఁ ద్రిప్పి తద్రథముమీఁదను వైచిన వజ్రధారచేఁ
బఱియలు వాఱి ధాత్రిఁబడుపర్వతమో యనఁ దేరితోడని
ర్భరముగ ఖడ్గరోముఁడు సపాటగఁగూలెదురంబులోపలన్.

ఆ. రోజి కలన ఖడ్గరోముండు గూలుట
సర్పరోముఁ డెఱిఁగి సాహసమున
వాలిసుతుని దాఁక వానిరోమంబుల
విషము సోఁకి నొచ్చి వేగఁ దెలిసి. 38

క. ఆలోన సర్పరోముని
దూలింపుచు వాని ముక్కుదూలము పగులన్
వాలితనూజుండు దన్నినఁ
జాలంగా నొగిలి తెలిసి సాహస మొప్పన్. 39

ఉ. వాలితనూజు నెన్నుదురు వ్రక్కలువాఱఁగ సర్పరోముఁడా
భీలత నార్చి చేకొలఁదిఁ బేర్కొని కొట్టిన రక్త ధారలన్
దేలుచు నంగదుం డతని డీకొని పూని శిరంబు చెక్కలై
వ్రీలి పడంగఁగొట్టఁ బృథివీస్థలిఁ గూలెను సర్పరోముఁడున్.

క. ఆలోన సర్పరోముఁడు
గూలుట కన్గొనుచు మిగులఁ గోపంబునఁ దా
నాలో వృశ్చికరోముఁడు
నీలునిపై రథముఁ దోలె నిర్భయవృత్తిన్. 41

ఉ. బోరన నీలుఁ డంత నొకభూజముఁ గైకొని వానితేరిపై
శూరత నేసి యాక్షణమ చూర్ణముగా నొనరింప నేలకున్
ధీరత దాఁటి భూరుహముఁ ద్రెంచఁగనుంగొని నీలుఁ డొక్కమం
దారమహీజమున్ నయిచె ధారుణి వృశ్చికరోముఁ డీల్గఁగన్.

సీ. వృశ్చికరోమముఁ జావేశఁ దు్రుంగుటఁజేసి
వడి రోషమున నగ్నివర్ణుఁడదరి
త్రేతాగ్ని బోకృఁ గై తెరలి మండినలీల
నన మేనిమంటలు దరకొనంగ
రావణునెదురఁ బరాక్రమస్థితిఁ బేర్చి
రామచంద్రునిమీఁద రథముఁ దోలి
ప్రల్లదంబునఁ బెక్కుభాషలు నుడువుచు
సాయక నిచయంబు లేయునెడను
తే. వానిశౌర్యంబుఁ దెంపును వానిబలముఁ
జూచి భూపాలుఁ డప్పుడు చోద్యపడుచు
ధనువునందును వారుణాస్త్రంబు దొడిగి
యగ్నివర్ణునితలఁ దు్రుంచె నాక్షణంబ. 43
తే. అగ్నివర్ణుండు తెగిపోవు టసురవరుఁడు
కన్నులారంగఁ గనుఁగొని కలుషవృత్తి
రామచంద్రుని డాయంగ రథముఁ బఱపి
పలికె నుత్కట గర్వప్రభావుఁ డగుచు. 44
క. జాఱకుమా బీరము చెడి
పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనముల్
దూఱకుమా పేర్కొంచును
జీరకుమా కపులఁ దోడుచేకొని పోరన్. 45
మ. అనివిల్లెక్కిడి దైత్యనాయకుండు రోషాయత్తచిత్తమ్మునన్
ఘనమౌర్వీనినదంబు భీకరముగాఁగావించి పెల్లార్చి య
జ్జననాథాగ్రణిమీఁద నుగ్రశరముల్ సంధించి బిట్టేయఁగా
వినువీధిన్ సురసంఘముల్గొలువఁగావీక్షించె దేవేంద్రుఁడున్.

వ. ఇట్లు కనుంగొని, 47

క. రథ మెక్కి రావణుండును
బృథివిస్థలి నుండి రాముపృథ్వీపతియున్
బ్రధనము సేయుట తగ దని
వ్యథఁ బొందుచు నాత్మలోన వాసవుఁ డంతన్. 48

క. మాతలి చేతను గవచము
చాతుర్యము గలుగురథము చాపము వరమున్
భూతలనాయకునకుఁ బురు
హూతుఁడుపుత్తెంచెఁ గడుమహోన్నతమహిమన్. 49

వ. ఇట్లు పుత్తెంచిన, 50

చ. ధరణికివచ్చి మాతలిముదంబున రామునిఁజూచి మీకుఁగా
సురపతి పంపినాఁ డధికశోభనకృత్యములై వెలుంగు నీ
శరములు విల్లు వజ్రికవచంబును దేరును వీనిచేత సం
గరమున దైత్యునిం దునిమి కైకొను రాఘవ శ్రీజయంబులన్.

వ. అని చెప్పిన మాతలిప్రియవచనంబులకు సంతసించి విభీషణానుమతంబున రామభూపాలుండు వజ్రికవచంబు దొడిగి శరశరాసనంబులు గైకొని యింద్రస్యందనంబునకు వలగొని వందనం బాచరించి బాలాదిత్యుండు పూర్వపర్వతం బెక్కు చందంబున రథం బెక్కినంత జయజయ ధ్వనులతో సుగ్రీవాంగద హనుమదాదులైన వానరవీరులు మ్రొక్కి రప్పు డంతరిక్షంబున దేవసంఘంబులు సంగ్రామరంగంబుఁ జూడ వేడ్కపడి వచ్చి విమానంబులతోఁ గిక్కిరిసి చూచుచుండి రాసమయంబున. 52

క. గిరి గిరి నభము నభంబును
ధర ధరయును జలధి జలధి దానోలెనుకీలిన్
సురరిపుఁడు నసురరిపుఁడును
దురమునఁ దెమరించి రథికదోర్బల యుక్తిన్. 53

వ. ఇట్లు మారోలెనుచు. 54

శా. వీరాలాపము లాడుచుం గడిసి దోర్వీర్యంబుతోడన్ ధను
ర్జ్యారావంబులు మిన్ను ముట్ట నతితీవ్రంబైన శబ్దంబులన్
వారాశుల్ కలఁగంగనార్చినిజగర్వస్ఫూర్తినుప్పొంగుచున్
క్రూరాస్త్రంబులనేసిరొండొరులపైఁ గోదండపాండిత్యులై.

క. దనుజేశుఁ డేయుశరములు
మనుజేశుఁడు తప్పఁ ద్రుంచు మారొల్లని కడిమిన్
మనుజేశుఁ డేయుశరముల
దనుజేశుఁడు దప్పఁ ద్రుంచుఁ దతభుజశక్తిన్. 56

క. కంటను నేసిన శరములు
వింటన్ దప్పించుకొనుచు వెసబాణములన్
గంటింపుచుఁ దమ గాత్రము
లంటకయుండంగ నేటులాడిరి కడిమిన్. 57

క. మొదల నొకబాణ మావలఁ
బదులును బదిపదులు వేయుఁ బదివేలును నేఁ
బదివేలు లక్ష కోటియు
జెదరక విలుకాండ్రమీఁద శీఘ్రము పర్వెన్. 58

క. తొడగిన బాణము వింటను
దొడిగినయట్లుండు మిగుల దోస్త్రాణవలన్

వెడలెడు శరములు లెక్కకుఁ
గడగుఱు తనరాక చిత్రగతులన్ బర్వెన్. 59

వ. అట్టిసమయమున. 60

చ. అభవమురాంతకాదులు మహాత్ములు వింటికి వారికన్న నుఁ
ద్రిభువనమందు వీరె గణుతింపఁగ నెక్కుడటంచు మెచ్చుచున్
నభముననుండి ప్రస్తుత ఘనంబుగఁ జేతురు దేవకోటుల
ట్లుభయబలంబులం బొగడుచుందురు రాముని రావణాసురున్.

చ. ధనువుల మ్రోఁత మేఘనినదంబులుగా శరదీప్తిజాలముల్
ఘనతరచంచలావళులుగా మఱిమార్తికదీప్తి ధాత్రిమీఁ
దను వడగండ్లుగా క్షతజధారలు సంతతవర్షధారగా
ననయముఁ జెప్పనొప్పె విపులాహవమప్పుడు వానకాలమై.

తే. పంక్తికంఠుండు మిగులఁ గోపంబు గదుర
దేవగంధర్వశరముసంధించి తివిచి
రామభూపాలుమీఁద విక్రమము మెఱసి
వేసి వడి నార్చె దిగ్దంతివిసర మడల. 63

క. దానికిఁ బ్రతిశర మప్పుడు
మానవనాథుండుఁ దొడిగి మానుష మడరన్
బూనిక నేసిన దానిం
బోనీయక త్రుంచి వైచె భువనము లదరన్. 64

క. త్రుంచినఁ గనుఁగొని దనుజుఁడు
మించినకోపమున రాముమీఁదను వడి సం
ధించి స్ఫురద్విషబాణము
వంచింపక యేయ దానివలనన్ జాలన్. 65

ఆ. నాగశరము లోదవి నానాముఖంబుల
వచ్చునప్పుడు మనుజవల్లభుండు
గరుడబాణ మేసి ఖండించెనన్నింటి
మింట సురలు సూచి మెచ్చి పొగడ. 66

చ. అగపృథపోయినన్ దనుజుఁడాగ్రహమూనిక రత్రిశూలము
య్యదనునఁద్రిప్పినైవ విస్ఫులార్భులఁ జేర్చుచు వచ్చు దానిపై
వదలక ముందుగాఁ ద్రిదశవల్లభుఁడిచ్చినశక్తి నేసినన్,
బొదలుచుఁబాఱత్రుంచెమణిభూషణజాలమునా త్రిశూలముర్. 
వ. ఇట్లు శూలంబును దూలి పోయిన. 68

క. సూతుని రథమును వాజులఁ
గేతువుఁ దూలంగ నేసి కినుకమెయిం జే
సేతను నొప్పించిన నృపుఁ
డాతటి దైతేయవిభుని నద్భుత మడరన్. 69

క. సూటిగొని యసురతలఁ కి
రీటము లవలీల ద్రుల్లి రివ్వన నొసలున్
భీటలు వాఱ శతాంగము
ఘోటకములగుండె లవిసి కూలఁగ నేసెన్. 70

ఉ. ఆయెడదైత్యనాయకుఁ డహంకృతి రాముని మేన నాఁటగా
వేయుశరంబు లాయముల వేగమె గాడిన రక్తపూరముల్
కాయముదొప్పఁదోఁగవడిఁగ్రమ్మెడునప్పుడుచూడనొప్పెఁబ
ద్మా యతలోచనుండుచరమాద్రితటిందగుభానుఁడోయనన్.

ఆ. అంత రామచంద్రుఁ డత్యంతకుపితుఁడై
బాణవృష్టిఁ గురియఁ బంక్తిముఖుఁడు

కాలు సేతులు చెయ్యి కదలింప నోపక
మెదల లేక రథముమీఁద నొరిగె. 72

వ. రావణుండు సొమ్మసిల్లి పోవు టెఱింగి కాలకే
తుఁడు తేరు దూరంబుగాఁ గొనిపోయినఁ గొంతప్రొద్దునకు
దనుజేంద్రుండు మూర్ఛదేఱి యోరి పగవారలు నవ్వఁ దగ
దనక రథం బిట్లు తేఁ దగునే యని కోపించినఁ గాలకేతుం
డును యుద్ధమధ్యంబున దేహికి సంకటంబైన రణంబు వెడలఁ
గొనిపోవుట యోటమిగాదని ధర్మవిదులు సెప్పుదురు
గావున నేనిట్లు దెచ్చితి నని విన్నవించిన సూతునివాక్యంబులకు
మెచ్చి పసదనంబు లిచ్చి మనరథంబు రామునిపయిం బఱపు
మనిన నట్లు కావించినఁ గనుంగొని. 73

క. ఆతనిరథమున కెదురుగ
మాతలి! మనరథముఁ బఱపుమా యన నతఁడున్
వేతీవ్రగతిం బఱపిన
భూతలపతి పలికె దనుజపుంగవుతోడన్. 74

ఉ. భూరిభుజప్రతాపమునఁ బొంగుచు నిర్జరకోటి మాటికిన్
బోర జయించి తెంచుఁ బలుపోకలు పోదువు నీవు భీతిమైఁ
దారక నిల్చినా యెడఁ బ్రతాపముసూపుము చూపవేని నా
వారిజగర్భుఁ డడ్డపడ వచ్చినఁ జంపుదు నిన్ను రావణా!

ఉ. అలములోన వానరుల వాలము సేసినయట్లు గాదు నా
వాఁడిశరంబు నీయురుటివ్రీలు హరింపఁగఁ బాలుపడ్డ దీ
వో వృథాపహాస్యములు వేయువిధంబుల మానలేక తాఁ
గాలుఁడు కన్ను గీటె నిదె కాలము దగ్గఱె నీకు రావణా!

చ. హరిగిరివహ్నిగిహ్ని బ్రహ్మేశానాంతకులఁ గింతకు దైత్యగిత్యావా
ర్వారుగిరి గాడ్పు గిడ్పు ఘనవల్లభు గల్లభు రుద్రు నిద్రు సం
గరమున నొప్పినట్టి దశకంధర నీకు జయింప వచ్చునే
సురనరకేశ నుగ్రరణశూరునఁ బయోధిగర్భిను రాఘవున్.

క. మఱిఁ దలఁప సుభరతిం బతి
వ్రతలను మునివరులఁ బట్టి వ్రతములు గర్వో
న్నతిఁ జెఱిచినట్టి దురిత
స్థితి నిప్పుడు నీవు నాకుఁ జక్కఁతి నిచటన్. 78

వ. అనిగర్వాలాపంబులాడుచున్న యుద్యోగునకుఁ బూర్వ
గీర్వాణాధీశ్వరుం డగు రావణాసురుం డిట్లనియె. 79

క. అంతటి భూరిపరాక్రమ
వంతుఁడవొ కొఱుఁగు దేని వసుధేశ్వర! నా
వంత మొఱింగియు నెఱుఁగక
యింతప్రగల్భముల నాఁడ నేటికి నీకున్. 80

క. నీలావును నాలావును
వాలాయము సురలు సూచి వర్ణింపఁగ నేఁ
డాలములోపలఁ జూపుద
మేలా గర్వోక్తు లిప్పు డినకులతిలకా! 81

మ. జననాథాగ్రణి! నాప్రతిజ్ఞ వినుమా శాంతాత్ముఁడై నీకునై
వనజాక్షుండిటువచ్చి కావు మనుచున్ వైశంబనన్ గోరినన్
వినువీధిన్ సురలెల్లఁ జూచి వెఱవన్ బరంబు సంధిల్లఁగా
నినునీతమ్ములనీజలపకొండమురలన్ నేలంకకుఁ బోఁజూతా. 82

వ. అని కోపోద్దీపితమానసులై వీరాలాపంబు లాడుచు
విద్దఱును నుద్దవిడిగద్దింపుచు నోలమాననొనక మీఱిన కోపం

బున శరీరంబులు మఱచి జయోల్లాసంబు లుల్లసిల్ల నొసళ్ళఁ బొడమి పెన్ జెమట మెత్తంబులును రక్తపూరంబులును గెరసి కాలువలై పాఱుచుండ మెఱుంగు కఱకుటంపగములు దాటినం జాఱు కెఱుంగక తమకంబునను నిష్ఠురబాణ సంఘట్టనంబులను బృంహితల రథనేమి స్వనంబులను ద్వేషహ్రస తురంగ హేషారవంబులను భటుల సింహనాదంబులను గగనంబు వగుల జగంబులు కలంగ సముద్రంబులు ఘూర్ణిల్ల రాత్రి వడఁక దిగ్గజంబులు మ్రొగ్గతిల్లఁ బడ నభోభాగంబున దేవగంధర్వసిద్ధ సాధ్య కిన్నర కింపురుషాదులు సూచి వెఱంగుపడ నిది పగ లిది రాత్రి యని యెఱుంగక తమకంబున నేడహోరాత్రంబులు పోరాడి యలసి బాణప్రయోగంబు లుజ్జగించి యొకరి నొకరు సూచుచుండ నయ్యవసరంబున. 83

క. సరసీరుహమిత్రాన్వయుఁ
డరు దరు దని సురలువొగడ నసురేశ్వరు న
క్క్రూరములు శిరములుఁ దెగిపడ
నురుముష్టిని దీసివేసె నుగ్రాస్త్రములన్. 84

క. తెగిపడిన తలలుఁ జేతులుఁ
దెగినట్లే మొల్చుచుండఁ దీవ్రత యడరన్
జగతీశుఁ డప్పుడు మదిలోఁ
దెగకుండుట చిత్రమనుచు దీని మఱియున్. 85

క. ఒకకోలఁ దలలుఁ జేతులు
బ్రకటంబుగఁ ద్రుంచినంతఁ బాహులుఁ దలలున్
వికచాంబుజములరీతిని
నక లేశుఁడు వెఱఁగుపడగఁ జయ్యన మొలిచెన్. 86

క. తొడిగెడిశరములు ధరపైఁ
బడియెడు మస్తకము లేరుపడకుండఁగ న
ప్పుడు రామమహీతలపతుఁ
డెడ తెగకుండంగ నేసె నేమనిచెప్పన్. 87

వ. అట్టి సమయంబున, 88

ఆ. వింటఁ దొడుగుశరము వెడలెడుశరమును
దిరుగ మొలుచుతలలు దెగినతలలు
వెట్టివారికైన నెఱుఁగంగ రాకుండ
రాముఁ డేయఁ దొడఁగె రణములోన. 89

ఆ. శరము దొడిగి తివియఁ జక్రింబువలె నుండు
శరము విడుచునప్పుడు చాప మగును
జూడ నొప్పె నౌర శోభితం బగురాము
చేతివిల్లు సెప్పఁ జిత్రమగును. 90

ఉ. కాంచనపుంఖదివ్యవిశిఖంబుల బాహువులు మస్తకంబులున్
ద్రెంచినఁ ద్రెంచినట్లె కడుఁదేజ మెలర్పఁగ నుద్భవించు న
త్కాంచనరత్నభూషణవికాయము దీప్తులు ప్రజ్వరిల్లఁగాఁ
గాంచనగర్భదత్తవరగర్వవిశేషముచేత సారెకున్. 91

చ. పొరిఁ బొరిఁ ద్రుంచినన్ దిగిరిప్పుట్టెచందముఁ గోలనార్చిపై
వెరవుగఁ బూనుచందమును వేసెడుచందముఁ బాఱుచంద
ము,న్గరమునుతింపఁగా నరుదుగాదె తలంపఁగ దేవతాళికిన్
శిరములచిత్రమున్ నృపతిచేతివిచిత్రము తూపుచిత్రమున్.

ఉ. రావణుడేయుబాణములు రామునిబాణము లొక్కపెట్టునన్
రావణు మేన నాటియును రామునినాటియురక్తపూరముల్

ప్రావృలతోఁటిమోదుగనుబూర్వగిరీంద్రము మీఁది భానునిన్
జేవురుకొండ కాలువలసిందురమున్ దలఁపించు నెంతయున్.

క. ఒత్తిలి రాముఁడు దైత్యుని
కుత్తుక నొకకోల ద్రుంచి కూల్చుట దోఁచెన్
నెత్తురు గ్రమ్మకమున్నె
మొత్తములుగ దలలు మొలచుటదోఁచెన్. 94

వ. అని దేవసంఘములు గొనియాడ శ్రీరామచంద్రుం
డు దైత్యనాయకునితలలుఁ జేతులుం ద్రుంచిత్రుంచి విసివి
నం గని విభీషణుండు నరేంద్రున కిట్లనియె. 95

క. బోలఁగ నాతనినాభీ
మూలంబున నున్న యమృతమును మొదలను ని
ర్మూలముగా శ్రీరఘు భూ
పాలక ! తెగ వ్రేయు మగ్ని బాణముచేతన్. 96

క. అది తెగిపోయినపిమ్మట
బదితలలును రెట్టి గలుగు బాహులు మరలన్
జెదరక తునుమఁగ దునుమఁగ
దుది ముట్టఁగ మొలుచు నూటతొమ్మిదిమారుల్. 97

వ. అంత నంతం బవునని విన్నవించిన విని రామభూపా
లుం డట్లు గావించిన 98

క. ఒకతలయు రెండుచేతులు
నకలంకస్థితిని గల్గున ట్లితనిన్ నేఁ
డొకతలకుఁ దెచ్చె నావని
ప్రకటించిరి సురలు రామభద్రుని నెలమిన్. 99

తే. అంత నమృతంబు తెలిపోవ నసురవిభుని
మేని బాహులుఁ దలలును మిన్న కడఁగి
పోయి కనుపట్టె నప్పు డద్భుతము గాఁగ
రెండుచేతులు నొకతల గండు మిగుల. 100
వ. అంత దైత్యేంద్రుండు తన మనంబున 101
క. ఎవ్వరు నెఱుఁగని మర్మం
బివ్విభునకు నెఱుకపఱుప నిటు గావించెన్
మవ్వమున నీ విభీషణు
క్రొవ్వెల్ల నడంతునంచు గ్రూరతతోడన్. 102
సీ. తొల్లి వరప్రాప్తి దొరకినయటువంటి
రక్తాభ మనుమహాశక్తి దివిచి
గంధపుష్పాక్షకలితమై కనుపట్టి
వితులతేజంబున వెలయుచున్న
దానిఁ బ్రయోగింప దారుణానలతీవ్ర
శిఖలు దిక్తటములఁ జెలఁగుచుండ
ఘనఘనారావమై ఘంటానినాదంబు
శ్రుతిపుటంబులకు నశ్రుతము గాఁగ
తే. జండతరముగ నట విభీషణునిపైకిఁ
జిచ్చు లుమియుచు నుగ్రమై వచ్చు దానిఁ
గాంచి రాముండు నిశితమార్గణముచేతఁ
దృణముకై నడి నడిమికిఁ ద్రెంచివైచె.
వ. ఇట్లు తనశక్తి వృథ యగుటఁ గని దానవేంద్రుం
డు మానవేంద్రునిపై గరం బలిగి నిట్టూర్పు నిగుడింపుచు
వసిముసల ముద్గర పరశు పట్టిస ప్రాసగదాదండకోదండభిండివా

లాదిసాధనంబుల నవక్రవిక్రమంబున నాలంబు సేయుచుండఁ
గని విభీషణుం డులికి దేవా! వీఁడు రెండుకరంబులతోడనే
మెండుగ యుద్ధంబు సేయం దొడంగె నింక శిరంబులుఁ గరం
బులు మరల నుద్భవించెనేనిఁ గార్యంబు దప్పుటకు సందియంబు
లేదు గావున వీని నీలోన నబ్రహ్మాస్త్రంబున నడఁగింపఁ దగు
నని విన్నవించిరి. 104

మ. అనఘుండుజ్జ్వలచాపదండమున నబ్రహ్మాస్త్రంబుసంధించిమో
య్యనఁ గర్ణాంతముగాఁగడుఁ దివిచిప్రత్యాలీఢపాదస్థుఁడై
దనుజాధీశ్వరు బాహుమధ్యమువడిందాఁకంగ లక్ష్యంబుగా
గొని బిట్టేసె నదల్చి తీవ్రతరమౌ కోపంబు దీపింపఁగన్.

క. ఆవ్రేటు వడిగ నాటిన
రావణుఁ డతివివశుఁ డగుచు వ్రాలె ధరిత్రిన్
దేవతతి పొగడె యప్పుడు
పూవులవర్షంబు గురిసె భూవరుమీఁదన్. 106

ఉ. సంగరభూమి రావణుఁడు సత్త్వముదూలి ధరిత్రిఁగూలినన్
గ్రుంగె భరంబునన్ ధరణి క్రుంగెఁ గులాచలవర్గమెల్ల వేఁ
గ్రుంగెదిశాకరీంద్రములు గ్రుంగెమహోరగవంశనాథుఁ
డున్। గ్రుంగెదులీకులేశ్వరుఁడు క్రుంగె వరాహముగ్రుల్లు
తేలఁగన్. 107

క. జగములకు నెల్ల బాధకుఁ
డగురావణుఁ డాజిఁ గూల నంతటితోడన్
బగ దీఱె ననుచు రాముఁడు
తగఁ దన విల్లెక్కుడించి తమ్ముని కిచ్చెన్. 108

సీ. అఖిలలోకమ్ముల కానంద మొదవెను
సురలకంటికి నిద్రసోఁకె నంత
మునులు జేసిన తపంబులు చాల ఫలియించెఁ
దొడరి సాధ్యులకుఁ దుందుడుకు వాసె
గుహ్యకావళికినిఁ గూడు నోటికిఁ బోయె
సిద్ధులతలఁపులు సిద్ధినొందె
దర్వీకరంబులెల్లడం బడఁగెను
కిన్నరసంఘకంబుకీడు తొలఁగె
తే. గరుడగంధర్వఖేచరగణములకును
క్షేమ మింపారె జనపరిణామ మయ్యె
వేడ్క లింపొదె బాధలు విఱుగ డయ్యె
సంగరంబున దైత్యుండు సచ్చుకతన. 109

ఉ. అంత విభీషణుండు తనయన్నపదంబులమీఁద వ్రాలి య
త్యంతవిషాదదుఃఖజనితాశ్రుకణంబులు రాల నేడ్చె లో
కాంతకుఁ డైన రావణుమహాద్భుతదుష్టపరాక్రమంబు భూ
కాంతుని ముంగలన్ దడవి గద్గదకంఠకషాయనేత్రుఁడై.

వ. అట్టిసమయంబున మందోదరి మొదలైన యంతఃపుర
సుందరీసందోహంబు లేతెంచి తమ ప్రాణేశ్వరుం డైన రాక్షస
కుల సార్వభౌముం గని వక్షంబులు శిరంబులు మోఁదు
కొనుచు బహువిధంబులఁ బ్రలపింపుచుఁ బరివేష్టించికొని
యుండ భూకాంతుండు శాంతాలాపంబుల ననునయించి
విభీషణుం గని నీవు దుఃఖింబడిగి మీయన్నకు నగ్నిసంస్కా
రాదివిధుల నాచరింపు మనిన నతం డట్లు కావించిన యనంతరంబు
విభీషణుని లంకానగరంబునకుం బట్టంబు గట్టించిన నతండు

సుగంధద్రవ్యంబులును నవరత్నఖచితంబులైన భూషణంబులును జీనిచీనాంబరంబులును గానుకగా నిచ్చినం బరిగ్రహించి యవి యెల్లను మాతలి కిచ్చి ప్రియోక్తులం దనిపి యనిపిన నతండు స్వర్గంబునకుం జనియె నయ్యవసరంబున. 111

సీ. ఆలోన రాఘవుం డావిభీషణుఁ జూచి
సత్రీతియుక్తమై సరగఁ బిలిచి
పంక్తికంధరు నాజిఁ బరిమార్చితి నటంచు
వసుమతీతనయకు వార్త సెప్పి
సీదేవి మొదలగు నీరజాక్షులచేత
నతివకు శృంగార మమరఁ జేసి
కొంచు రమ్మని చెప్ప నంచితగతి నేఁగి
సరమాదిసతుల కాసరణిఁ జెప్ప
తే. సతులు నిర్మలజలముల జలక మార్చి
పట్టుపుట్టంబు ముదమునఁ గట్టఁ బెట్టి
చందన మలంది సురభిపుష్పములు ముడిచి
మేలిమణిభూషణంబులు సాలఁ దొడిగి. 112

క. ఇందిరతో సరి యగు నా
సుందరిఁ ద్రైలోక్యమాత సొబగొందఁగఁ దా
రందలమునఁ గొనివచ్చిరి
కందర్పవిభుండు రాముకడకుం బ్రీతిన్. 113

వ. ఇట్లు గొని వచ్చి రామభూపాలుని సమ్ముఖంబున నునిచిన నద్ధరాతనూజాత పతికి వినయభక్తి తాత్పర్యంబులు వెలయఁ బ్రణమిల్లిన నతండు వనితారత్నం బగుసీతం గనుంగొని యిట్లనియె. 114

క. కులసతిఁ జెఱ గొనిపోయిన
యలశాత్రవు గెలువ నోపఁ డనుపలుకులకున్
గెలిచితిఁ బగ చంపితి నిఁక
నెలఁతా! నీయిచ్చఁ జనుము నే నిన్నొల్లన్. 115

ఆ. అనుచుఁ బలుకుపలుకు లవనీతనూజాత
కర్ణములకు వాఁడి గలుగునట్టి
నారసములు సోఁకి నాటిన యట్లైన
సరసిజాక్షి మూర్ఛఁజాల నొంది. 116

చ. నరవర! నాదుచిత్తము మనంబుననీవ యెఱింగియుండియున్
బరుషము లాడ నేమిటికిఁ బాపము నాయెడలేదు కాదుపో
సురలునుతింప మేటిసొదఁజొచ్చెద మెచ్చుఁడటన్న రామభూ
వరునిమనం బోడంబడిన వారిజలోచన సీత యాతఱిన్.

క. హృదయేశుఁ డలర నప్పుడ
సొదఁ జొచ్చెను భూమిపుత్రి సురలు నుతింపన్
ముద మంది పద్మభవుఁ డా
యదనం బ్రత్యక్ష మయ్యె నా నా ననుచున్. 118

ఆ. అంతఁ బద్మగర్భుఁ డవనీశుఁ డగురామ
భద్రుఁ జూచి పలికెఁ బరమపురుష
వనజనేత్ర సీతవలన దోసము లేదు
నమ్ము వసుమతీశ నాదుమాట. 119

వ. అని పలికిన పితామహుని మాటల కుభయసేనలును సంతసిల్లినవి. అనంతర మగ్నిభగవానుండు నయ్యంగనం గొని వచ్చి మరలపతివ్రతాభరణం బగు నిద్ధరాతనూజాతం గైకొమ్మని యప్పగించిన నయ్యెడ దశరథుండు ప్రసన్నుండై న శ్రీరా

మచంద్రుండు సతీసమేతుండై తమ్ముండును దానును నమస్కరించినఁ గుమారద్వయంబును గోడలిని నాలింగనంబుచేసి తద్దుఃఖంబులం బాపి చనియె; నప్పుడు సకల దేవతలు నిట్లనిరి.

క. మాకొఱకు జనన మొందితి
రాకాసులరాజుఁ జంపి రక్షించితి వా
లోకంబు లెల్లఁ గృపతో
సాకేత పురాధినాథ! సజ్జనవినుతా! 121

క. అని వినుతి సేసి కలనన్
జనిపోయిన కపులనెల్ల సత్కృప బ్రదుకం
డని వరము లిచ్చి యనిగిరి
ఘను లా దేవతలు మరలి గగనంబునకున్. 122

వ. తదనంతరంబున. 123

తే. భానుపుత్త్రాది వానర బలముతోడ
ఘన విభీషణ ముఖ్య రాక్షసులతోడ
మఱియు జానకితోడ లక్ష్మణునితోడఁ
బుష్పకం బెక్కి చనిరా నాభూమివిభుఁడు. 124

వ. ఇట్లు పుష్పకారూఢుండై చనుచుండి రామభూకాంతుండు కాంతారత్నంబునకుఁ జేయెత్తిచూపుచు సంగ్రామస్థలం బిదె రావణకుంభకర్ణాదులైన రాక్షసబలంబును మర్దించిన తా విదె సువేలాచలం బిదె సముద్రంబునన్ బంధించిన సేతుబంధనం బిదె విభీషణుఁడు మమ్ము శరణుచొచ్చిన ప్రదేశం బిదె సుగ్రీవుని కిష్కింధానగరం బిదె వాలిని నేలఁగూల్చేసినచో టిదె భూమిసుతనుండు మమ్ముఁ బొడగన్న స్థలం బిదె ఋష్యమూకాచలం బిదె వాయుతనూభవుండు మమ్ముఁ

బోడగన్నతా విదె పంపాసరోవరంబునిదె కబంధుం డను దానవుని వధించిన ప్రదేశం బిదె జటాయు వను పక్షీంద్రుండు నన్నుఁ గొనిపోవునప్పుడు రావణాసురునితోడం బోరి మడిసినస్థానం బిదె జనస్థానం బిదె దశవదనుండు నన్నుఁ జెఱఁ గొనిపోయినచో టిదె మాయామృగంబును బడ నేసినచో టిదె ఖరదూషణాదులు నాతోడఁ బోరి పొలసిన తా విదె శూర్పణఖ యనుదాని ముక్కు చెవులుం జెక్కిన యిక్కయిదె సుతీక్ష్ణుం డనుమునీంద్రుడు వర్తించు నాశ్రమం బిదె యగస్త్యాశ్రమం బిదె యత్రిమహామునీంద్రునిపత్ని యనసూయాదేవి యంగరాగంబులు నీకిచ్చిన చక్కి యిదె విరాధుం డనురాక్షసుండు నన్నుఁ బట్టికొని పోవుచుండ విడిపించినచో టిదె చిత్రకూటాచలం బిదె భరతుండు మనల నోడంబఱిచి మరలం గొనిపోవ వచ్చినచో టిదె గంగానది యల్లదె కనుంగొను మనిచెప్పుచు భరద్వాజాశ్రమంబుఁ జేరం జని యచ్చోటఁ బుష్పకంబు డిగ్గి యమ్మునీంద్రునకు నమస్కరించిన నతండు రాముని దీవించి మహానందంబునొంది యనిలసంభవా! వేవేగ నీవేగి నందిగ్రామమ్మున నున్న భరతునకు మా రాక తెలియించి రమ్మని యనిపిన. 125

క. అరుదెంచి చూచెఁ బావని
సురుచిరసౌభాగ్యభరతు శోభనచరితుఁన్
విరచితపుణ్యస్ఫురితుఁన్
నిరుపమసత్కీర్తి నిత్యనిరతుఁన్ భరతుఁన్. 126

వ. కనుంగొని వందనంబు సేసి కరంబులు మోడ్చి వినయం 127

బున.

ఆ. భరతునకును రామభద్రుఁ డేతెంచిన
వార్తఁ జెప్ప వినుచు వాయుసుతుని
గారవించి నిండు కౌఁగిటఁ జేర్చుచు
నగ్రజన్మ సేమ మడిగి యడిగి. 128

క. తల్లులు మువ్వురకును రఘు
వల్లభుఁ డేతెంచినట్టివార్తను దెలుపన్
బల్లిదుఁ డగుతనతమ్ముని
నల్లన సాకేతపురికి ననిపెన్ వేడ్కన్. 129

వ. అట భరద్వాజాశ్రమంబున మజ్జనభోజనాదు లాచరించి నాఁటిరాత్రి నిలిచి మఱునాఁ డమ్మునీంద్రుని వీడ్కొని శ్రీరామచంద్రుండు పుష్పకారూఢుండై చనుదెంచుచున్న యప్పు డన్నకు భరతుండు సకలసేనాసమేతుం డై తల్లులుం దమ్ముండును నెదు రేఁగి రాఘవేశ్వరుపాదారవిందంబులకు వందనం బాచరించిన నతం డనుజన్ములఁ గౌఁగిలించికొని లక్ష్మణసహితుండై జనకరాజనందనం గూడి తల్లులు మువ్వురకుం బ్రణమిల్లి వార లతిస్నేహంబున నిండుకౌఁగిళ్ల నొత్తుచు దీవింపఁ దమలోఁ దాము పెద్దపిన్న యంతరువుల వందనంబులు సేసికొని మరలి నందిగ్రామంబున కేఁగి యచ్చటఁ బుష్పకంబు డిగ్గి దానికర్చనలిచ్చి కుబేరునివీటికిఁబొమ్మని యనిపి భరతు మందిరంబు ప్రవేశించె నట్టిశుభసమయంబున. 130

క. దానంబు లిచ్చి భద్ర
స్నానంబులు సేసి భూషణంబులు వూఁతల్
చీనాంబరములు బరిమళ
మానంబులుఁ దాల్చి రథికశోభనలీలన్. 131

వ. ఇట్లు రామాదిసోదరచతుష్టయంబును భూమినంద నయును దపోవేషంబు లుజ్జగించి రాజచిహ్నంబులు గైకొని దానవవానరబలంబులం గూడికొని షడ్రసోపేతంబులైన భోజ నంబులం బరితృప్తులై యారాత్రి గడపి మఱునాఁడు గజతురగస్యందనాది వాహనంబు లెక్కి ఛత్రచామరాదులు మెఱయ శంఖభేరీ భాంకారంబు లుల్లసిల్ల వందిమాగధుల బిరుదుకైవారంబులు సెలంగ నయోధ్యాపురంబుఁ బ్రవేశించి నగరులోనికి వచ్చి వసిష్ఠానుమతంబున శుభముహూర్తంబున భద్రసింహాసనంబునఁ బట్టభద్రుండై రామభద్రుండు భూసురులకు దానంబు లొసంగి యర్థార్థుల కిష్టార్థంబు లిచ్చి విభీషణసుగ్రీవాంగద జాంబవద్ధనుమదాదులఁ బ్రియవచనంబులం దనిపి వారి వారికిం దగినపగిదిని గట్నంబు లిచ్చి వీడ్కొలిపిన వారు నిజస్థానంబులకుం జని రంత మహానందంబున. 132

ఆ. అశ్వమేధయాగ మన నొప్పుజన్నంబు
నెలమిఁ జేసి దివిజు లెల్ల మెచ్చ
లీలఁ బదునొకండువేలేండ్లు ధర యేలెఁ
బరమధర్మ మహిమఁ బ్రజలు వొగడ. 133

సీ. సకలౌషధక్రియా సంజీవకరణిచేఁ
జెలఁగిదిక్కులను రక్షింపఁ జాలు
బంధురోన్నతశస్త్రసంధానకరణిచేఁ
గుటిలారులను రంభఁ గూర్పఁ జాలు
సంతతోత్పాదనసౌవర్ణకరణిచే
నర్థుల దారిద్ర్య మడఁపఁ జాలు

ననుదినసంధాన మనుశల్యకరణిచేఁ
బురుషార్థనికరంబెఁ బోర్చఁ జాలు
తే. సిద్ధవిద్యానురాగప్రసిద్ధుఁడైన
రాజచంద్రుం డితం డని రాజు లెల్ల
సన్నుతింపఁగ విలసిల్లె జగతియందు
భాగ్యవిస్తారి రామభూపాలశౌరి. 134
సీ. కుటిలత నటులందుఁ గుంతలంబులయందు
బొంకు జాదములందు బూతులందు
లేమి వైరులయందు లేమలనడుమందు
భంగ మంబుధులందుఁ బరులయందుఁ
గోపంబు ఖలులందుఁ గూ్రరవర్తనులందు
వడఁకు వీణలయందు వ్యసనులందు
బంధంబు రతులందుఁ బటుశిరోజములందు
మోహంబు ధనమందు మునితలందుఁ
తే. జింత కవులందుఁ దపసులచిత్తమందు
వర్ణమిళితంబు చిత్తరువందు యువను
లందునను కాని యొండెడఁ జెందకుండ
లీల ధర యేలె రామభూపాలవరుఁడు. 135
క. ఈరామచరిత మెప్పుడు
వారక విన్నట్టివారు వ్రాసినవారున్
గోరి పఠించినవారును
శ్రీరామునికరుణ మేలు సెందుదురెలమిన్. 136
క. జలజాక్ష ! భక్తవత్సల !
జలజాసనవినుతపాదజలజాత ! సుధా

జలరాశిభవ్యమందిర !
జలజాకరచారుహంస ! జానకినాథా ! 137

మాలిని. కువలయదళనేత్రా కోమలస్నిగ్ధగాత్రా
భవముఖనుతిపాత్రా భక్తవృత్తాళిచైత్రా
రవిశతసమధామా రక్షితాత్మాంఘ్రిభామా !
కవిజననుతనామా కావుమా మమ్ము రామా ! 138

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన
వినోద సూరిజనవినుత కవితాచమత్కార రాతుకూరి
కేసనసెట్టితనయ మొల్లనామధేయవిరచితం బైన
శ్రీరామాయణ మహాకావ్యంబునందు
యుద్ధకాండము సర్వంబును ద్వితీ
యాశ్వాసము.

రామాయణము సంపూర్ణము.

---

కలితహృదంతర • కావ్యనిరంతర • కౌతుకదంతుర • కవ్యధిరాట్
సులభసుదర్శన • సూక్ష్మవిమర్శన • సూచకకర్శన • సూర్యనృపా.

ఉ. భావుకనందనాబ్దమున • వార్యియుటకుఁ సమకట్టి నేర్పుమై
శ్రీ విజయాబ్దమందు నెఱి • చేఁ బరిపూర్తిగ సంఘటించి వి
శ్వావసు వత్సరంబుననొ • సంగితి జేనికి భవ్యకీర్తికిం
దావగు రామరాడ్విలస • నంబను నిక్కృతిఁ బ్రాభృతంబుగన్.

గద్య. ఇది శ్రీరామచంద్ర కృపాసాంద్ర కటాక్ష నిరీక్షణ సంలబ్ధ
శతావధానాది సరసతరకవితావిచక్షణ శ్రీమత్కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లి కులపయఃపయోనిధి కళానిధి సీతారామ
శాస్త్రి పౌత్త్ర వేంకటకృష్ణశాస్త్రి పుత్త్ర తమ్మనాభి
ధానాంతర వేంకటకృష్ణశాస్త్రి నామాగ్రజన్మ
త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన రామరాయ
విలాసంబను ప్రబంధంబు నందు
సర్వంబును తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ